కొన్ని ప్రాంతములందు మా గ్రామము రెడ్డిగారు సాహెబుగారని నుడువుటాచార మైనది - నేనిటుల వ్రాయుటచే చదువరులకు సంశయము గలుగవచ్చును. కాని హిందూ జాతి యందు రాజులు క్షత్రియులని యావజ్జనులకు విశదమే. అయితే ఇతర జాతివా రీపదవిని గ్రహించినప్పుడు వారిని కూడ రాజనుట సహజము. మరియు క్షత్రియులు రాజ్య మేలకున్నను వారిని క్షత్రియ జాతి వారని జెప్పుటా చారమే. ఇదే మాదిరి వైదిక బ్రాహ్మణులు ఉపదేశము (బోధ)సేయక పంటపని లేక బేరము, కొలువు సేయుట మొదలగు పనులు జేసినను వీరిని గురువులనియు, ఆచార్యులనియు పిలుచుచున్నారు. మరియు నియోగి బ్రాహ్మణులను సచివ, అమాత్య, మంత్రి లేక పంతులు అనుటలేదా ?

వైశ్యుడు బేరము జేసినను చేయక పోయినను శ్రేష్ఠి (శెట్టి) లేక మహో జనుడని నుడువుచున్నారు. వీరల నీలాగున బిలుచుటయు నితరులా పని జేసినను పిలువకపోవు టెందుచేత ? ఇతర జాతుల వారికది సనాతన వృత్తి గానందున వారు తాత్కాలిక పదవికి సంబంధించిన నామము వహించినను, కులవిమర్శనము నందు యథార్థనామము జెప్పకతప్పదు. ఇతర జాతివారు గ్రామాధికారులైనను రెడ్డిజాతి వారా పదవిపై లేకయున్నను సనాతన సంస్కారమునుబట్టి కులవృత్తి ననుసరించి రెడ్డియను బట్టపు నామము కలిగినది. అనగా రెడ్డిగారనుటయందు గ్రామాధికారముగల జాతివారని యభిప్రాయము.

గ్రామాధికారిని రెడ్డిగారనుటయేగాక పటేలు అని కూడ పిలుచుచున్నారు. ఈ పద మన్యదేశీయమే. కాని మహమ్మదీయ చక్రవర్తుల కాలము నుండి భరత ఖండమంతట వ్యవహరింపబడుచున్నది. పటేలు[1] = గ్రామము యొక్క సర్దార్ లేక చౌదరి యని ఉర్దూ నిఘంటువు లందున్నది. చౌదరి = గ్రామము యొక్క పెత్తనగాడైన కాపు అని యాంధ్ర నిఘంటువులందున్నది. పటేలుకు క్షత్రియత్వ మెటుల జెల్లునని మీ కనుమానము గలుగవచ్చును. "స్థాయుకోఽధికృతో గ్రామే" (అమరకోశము, క్షత్రియవర్గు)=ఒక గ్రామమున కధికారియైనవాడు స్థాయుకుడు. ఎక్కువ భూములు సంపాదించి, మిక్కిలి డబ్బు గడించి, పెక్కు గ్రామములపై

1. ఉత్తర హిందూస్థాన మంతట గ్రామాధికారిని పటేలని యందురు. దక్షిణ హిందూస్థానములో కూడ ప్రస్తుత నిజాం రాష్ట్రాది దేశములలో నీ పదము వాడుచున్నారు.

నధికారము జూపు వారిని దేశాయి, దేశముఖి, జమాన్‌దారు అని పిలుచుచున్నారు. పైరెండు పదముల యర్థము స్పష్టమే. ఇక 'జమాన్‌దారు'కు ఉర్దూ నిఘంటువు లందు పర్యాయ పదములు కిసాన్, జాట్, అని వ్రాయబడి యున్నది. కిసాన్, కృషిక శబ్దము యొక్క తద్భవము. "జాట్" అను పదమున కర్థము ప్రసిద్ధి కెక్కిన వ్యవసాయకులని వ్రాయబడియున్నది. వ్యవసాయకులే కాఁపులు. 'కాఁపు' పదము శూద్రునికి జెల్లునని యాంధ్ర నిఘంటువుల త్రోవను ద్రొక్కకుడు. అది పొరపాటు. మన కావ్యము లందొక పృథివీపతి గుణగణములు వర్ణించుచు తక్కిన రాజులందరతనికి "అరిగాఁపు" లైరి యని జెప్పబడియున్నది. అరి - కప్పము, కాఁపులు - రక్షకులు, అనగా చక్రవర్తికి కప్పము గట్టు సామంత రాజులని యర్థము. "అరిగాఁపు" కప్పముఁ గట్టువాఁడు అని యాంధ్ర నిఘంటువులందున్నది. ఏ విధముగ విచారించినను "కాఁపు" పదమునకు రక్షకుడనియు ఈ రక్షకత్వము క్షత్రియులే వహింతురనియు, క్షత్రియ పర్యాయ పదము రాట్, దీని తద్భవము రేడు, దీనికి వికృతి రెడ్డి వీని పర్యాయ పదములు దొర, భూపతి (జమీన్‌దారు) దేశాయి, దేశముఖ్, ప్రభువు(పటేలు), చౌదరి(పెద్దకాఁపు) మొదలగునవి వాడుకలో నున్నవి - ఈ వ్యవహార నామములే గాక పాలు నీరు ఏర్పాటు జేసిన పక్షిని హంసయని గుర్తించినటుల వీరి గుణకర్మ స్వభావములుఁ గూడ వీరి క్షత్రియత్వ మును స్థిరపరచుచున్నవి. "శూద్రో బ్రాహ్మణ తామేతి, బ్రాహ్మణశ్చైతి శూద్రతాం, క్షత్రియాజ్జాత మేవంతు విద్యాద్వైశ్యాత్తదైవచ"[1] శూద్ర కులమందు బుట్టినను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యగుణకర్మ స్వభావములు గలవారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులే యగుదురు. అటులనే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య జాతులందు బుట్టినవారుకూడ శూద్రగుణ కర్మ స్వభావములు గలవారు శూద్రులే యగుదురు. ఇటులనే ఆ యా జాతుల గుణకర్మ స్వభావములను బట్టి గ్రహించవలయునని మహాభారత అరణ్యపర్వములో నహుష ప్రశ్నలందు మరియు శుక్రనీతియందు ఇంకననేక గ్రంథములలో సప్రమాణముగా సహేతుకముగా వ్రాయఁబడియున్నది. కావున కాఁపుల, రెడ్ల గుణకర్మ స్వభావములను బట్టి కూడ వారు క్షత్రియులని జెప్పవచ్చును. అవి యేవన? "ప్రజానాం రక్షణం దాన, నిత్యాధ్యయన మేవచ,

1. మనుస్మృతి 10-65.

విషయేష్వ ప్రసక్తిశ్చ క్షత్రియశ్య సమాసతః'',[1] ప్రజా పోషణము ఇతరుల మేలును గూర్చి దానము, వేదశాస్త్రములం జదుపుట, జితేంద్రియత్వము గలిగి యుండుట, క్షత్రియ ధర్మములు. మరియు "శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్య పలాయనం, దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మస్వభావజం"[2]

శౌర్యము దాన శీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ దేజమున్
ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముగామమున్ బుధా
చార్య ముకుంద సేవలును సత్కృతియున్ బరితోషణంబు స్వ
దీర్యము రక్షణంబుఁ బృథివీవర శేఖర రాజచిహ్నముల్.[3]

1. మనుస్మృతి 1-89.
2. భగవద్గీత 18-43.
3. భాగవతము, స్కంధము 7.

# వర్ణాంతర వివాహాలు

వర్ణాంతర వివాహాలు పూర్వం చాలా లేకుండెను. ఇప్పుడు గూడా అవసరం లేదని శ్రీ నందిగామ దత్తాత్రేయ రావుగారు గోలకొండ పత్రికలో వ్రాసినారు. చాలా లేకుండెను అనుటచేత కొద్దిగా పూర్వంలోనూ ఉండెననిన్నీ ఇప్పుడున్న "చాలా" వరకు పోక కొద్దిగా చేయవచ్చుననిన్నీ వారి వాదాన్ని అర్థము చేసు కొనవలెనో యేమో? అయినా వారు చూపించిన కారణాలు తృప్తికరముగా లేవు.

"వజ్ర సూచికోపనిషత్తు" అను చిన్న ఉపనిషత్తు వావిళ్ళవారు తెనుగర్థ ముతో ముద్రించినారు - దాని వెల 2 అణాలు మాత్రమే. దాని నింతవరకు చదువనివారు తప్పకుండా చదువవలెనని కోరుతున్నాను. అందీ చర్చకు బ్రాహ్మ ణత్వానికేది ప్రధానం ?

"కోవా బ్రాహ్మణోనామ
కిం జీవః కిందేహః? కింజాతిః?
కిం జ్ఞానం? కింకర్మ? కిం ధార్మిక?"

అని ప్రశ్న వేసుకొని ఇవన్నియు ప్రధానం కావు అని చెప్పుచు ఇట్లు సెలవిచ్చినారు.

"తర్హి జాతిర్బ్రాహ్మణ ఇతిచేత్, తన్న;
తత్ర జాత్యంతరేష్వనేక జాతి సంభవాత్
మహర్షయో బహవస్సంతి, ఋష్య
శృంగోమృగ్యాః, కౌశికః కుశాత్,
జాంబూకో జంబుకాత్, వాల్మీకో వల్మీకాత్
వ్యాసః కైవర్తక న్యాయాం, శశ

పృష్ఠాత్ గౌతమః, వసిష్ఠ ఊర్వశ్యా, అగ
స్త్యః కలశేజాత ఇతిశ్రుతత్వాత్, ఏతే
షాం జాత్యా వినాప్యగ్రే జ్ఞాన ప్రతి పాదితా
ఋషయో బహవస్సంతి తస్మాన్న
జాతిర్బ్రాహ్మణ ఇతి.

వర్ణము బ్రాహ్మణుడనిన యెడల అదికాదు. ఒక వర్ణములోనే అనేక వర్ణాలు కలిగెను. ఋష్యశృంగుడు లేడికి, కౌశికుడు దర్భకు, జాంబూకుడు నక్కకు, వాల్మీకుడు పుట్టకు, వ్యాసుడు బెస్తకన్యకకు, గౌతముడు కుందేటికి, వసిష్ఠుడు ఊర్వశియను బోగము దానికి, అగస్త్యుడు కుండకు పుట్టిరి.

పై ప్రమాణాన్నిబట్టి మహర్షులు జంతువులకు, కుండలకు, గడ్డికి పుట్టలకు కన్యలకు, వేశ్యలకు, బెస్తలకు పుట్టినట్లు స్పష్టమగు చున్నది. ఈ వజ్ర సూచికోపనిషత్తును మొదట ముద్రించిన పళ్ళె చెంచల రావుగారు ఈ యుపనిష దంతమందు తమ పక్షాన ఈ విధముగా వ్రాసినారు.

పై జెప్పబడిన వచనముల కనుగుణముగా బ్రాహ్మణేతరులు సైతము బ్రాహ్మణులైనట్లు భాగవతములో నీ క్రింది ప్రమాణములు కలవు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 10-12 | శ్లోకాలు | 5 | స స్కంధం | 4 | అధ్యాయం. |
| 17,21,22 | ,, | 9 | ,, | 2 | ,, |
| 11 | ,, | 9 | ,, | 17 | ,, |
| 1 | ,, | 9 | ,, | 20 | ,, |
| 21,32,33 | ,, | 9 | ,, | 21 | ,, |

ఈ ప్రమాణాలను బట్టి శూద్రులు బ్రాహ్మణులైనట్లు తెలియవచ్చును.

అట్లయితే శూద్రులెప్పుడు బ్రాహ్మణులైనారో, అట్లు బ్రాహ్మణులైన వారు బ్రాహ్మణ స్త్రీలను వివాహమాడి బ్రాహ్మణ వంశములకు కర్తలెప్పుడైనారో ఆ యాచారాన్నే వర్ణాంతర వివాహమంటారా లేదా? పాండు ధృతరాష్ట్రులు నియో గముచే పుట్టినారని యా నియోగము వివాహము కాదనియు రావుగారు సెలవిచ్చి

నారు. వివాహము కాదు నిజమేకావున అది వ్యభిచారమే యగును. వ్యభిచారము వలన పుట్టిన వారికి గౌరవమర్యాదలు కలుగునా? అట్టివారి సంతానము పొందినది పెండ్లి కాకముందే ఒకణ్ని కన్నది. దీనికి సమాధానమేమంటే వ్యభిచారము చేసినవారు దేవతలట! ఈ కాలములో కూడా వ్యభిచారం చేసే వారంతా దేవతలని మనము సమాధాన పడవచ్చునా? హిడింబి రాక్షసియే కాని వాస్తవముగా క్షత్రియ జాతి స్త్రీయే! అని రావుగారనుచున్నారు. రావణుడు రాక్షసుడే కాని నిజంగా ఆయన బ్రాహ్మణుడే. అందుచేత లంకలోని రాక్షసులంతా బ్రాహ్మలే. రాముడు బ్రాహ్మల జంపెను అని తర్కించితే యెట్లుంటుంది - వేద కాలములో నూటికి 99 వాళ్ళు సవర్ణ వివాహములేనట - మిగతా ఒక పాలు ఏమైంది.

చారిత్రిక నిదర్శనములోనికి రావుగారు పోనియ్యరు. ఎందుకంటే చరిత్రలు విదేశీయులచే వ్రాయబడినవట. "కావున నమ్మదగినవి కావు"అట. "ఒకవేళ నమ్మినను పౌరాణిక వర్గము వారికి సనాతనులకంతగా ప్రమాణములు కావు" అని రావుగారు కొట్టి పారవేసినారు. పురాణాలు నమ్మదగినవికావు. అవి ప్రమాణాలు కావు అని ప్రాచీన భారతీయ తార్కికులన్నారు. ఆచార్యత్రయము వారు తమ తమ భాష్యాలలో పురాణాలకు కనిష్ఠ స్థానమిచ్చినారు. పురాణాలు పరస్పర విరుద్ధమైనవి. ఒకే పురాణములో వివిధ స్థలములలో ఒక విషయమును గురించి పరస్పర విరుద్ధాంశములను వర్ణించినారు. పురాణాలు ఎల్లప్పటికినీ పెరుగుతూవచ్చినవి. 8000 శ్లోకాల భారతము 1 లక్ష శ్లోకాల గ్రంథముగా పెరిగెను. రావుగారు ఉదాహరించిన స్కాంద పురాణము ఇప్పటికిని పెరుగుచూ ఉండే గ్రంథము. అట్టి పురాణాలను వారు నమ్ముతారట. చరిత్రను వారు నమ్మరట. విదేశీయులు వ్రాసిన చరిత్రలు అబద్ధమైతే స్వదేశీయులు వ్రాసిన చరిత్రలనైనా రావుగారొప్పుకొందురా ? స్వదేశీయులు విదేశీయులను అనుకరించి నారు కావున వారిని కూడ ఒప్పుకోము అంటారా ? రావుగారు శాసనాలనైనా ఒప్పుకుంటారా? అవి కూడా అబద్ధం అంటారా? సర్వంకల్లా సాగరంకల్లా అంటే ఇక దత్తాత్రేయరావుగారికే దిగ్విజయ పత్రమిచ్చి ఆడియేన్ దాసు అని సెలవు పుచ్చుకుంటాము.

వేద కాలంలో కులాలు లేకుండెను. అట్లంటే వాదవివాద మేర్పడుతుందని నాకు తెలిసిన యంశమే పురుష సూక్తం కులాల సూక్తం కాదా అని ప్రతి పక్షులనగలరు. ఆ సూక్తం ఋగ్వేదాంత్య భాగమందేయున్నది. అదియు ఋగ్వేదమును విభాగించి సంహితగా దిద్ది తీర్చిన వెనుక చాలా కాలం తర్వాత చేర్చబడినదని పాశ్చాత్య పరిశోధకులంతా ఏక వాక్యంగా నిర్ణయించినారు. పాశ్చాత్యులు మాకు ప్రమాణభూతులు కారను వాదమును శ్రీ దత్తాత్రేయరావుగారు ఇదివరకే లేవదీసినారు-అగుగాక-వేద కాలములో పుట్టుకచేత కుల నిర్ణయమైనట్లు కానరాదు-ఆ మాటనే భగవద్గీతలోను "గుణ కర్మ విభాగశః" అని చెప్పినారు. దానికి కూడా అపార్థం చేసిన సనాతనులున్నారు. పోనిండు, ఇక మూల చర్చ నందుకొనుచున్నాను.

కారు రహం, తతో భిష
గు, పల ప్రక్షిణీననా,
నానాధియో వసూ
యవోఽనుగా,
ఇవతస్థి మేంద్రాయోం
దోపరిస్రవ —ఋగ్వేదం - 9-112-3

అంటే - నేను సూక్తాలు రచించేవాణ్ణి, నా తండ్రి వైద్యంచేసి బ్రదుకు తాడు, నా తల్లి విసురుతూ జీవించుచుంది. వివిధ వృత్తులతో మేము బ్రతుకు తాము - ఆవులు గడ్డికై నానా క్షేత్రాలలో సంచరించునట్లుగా జీవించుతాము. కావున ఓ సోమా! మాకు సంపద ఇచ్చుటకై నిన్ను ప్రార్థించుతాము. ఇంద్రా ! నీవున్నూ సహాయపడుము.

ఇందు వివిధ వృత్తులవారు ఒకే యింట భేదము లేకుండా జీవించినట్లు కనబడుతుంది. ఈ వృత్తులనే తర్వాతి సూత్ర కాలంలో కులాలని నిర్ణయించి నారు. క్షత్రియుడు బ్రాహ్మణుని యజ్ఞములో పాల్గొని భుజించిన అతని రెండవ లేక మూడవ సంతతి బ్రాహ్మణులలో చేరుతుంది. (ఐతరేయ బ్రాహ్మణం 7,29)

ఇదే ఐ. బ్రాహ్మణంలో 2,19 లో ఒక చిన్న ముచ్చట యిట్లున్నది. ఐలూషునికి కవషుడు అనే కొడుకుండెను. అతడు బ్రాహ్మణుల యజ్ఞానికిపోతే "ఒరేయ్ నీవు దాసీ పుత్రుడవు, జూదగాడవు, మాతో కూర్చునే దానికి నీకు అధికారం లేదు" అని వెళ్ళగొట్టినారు. కాని కవషుడికి దేవతలంతా పరిచయమై ఉండటంచేత వారు అతన్ని ఋషిగాచేసి వేసిరి.

ఛాందోగ్యోపనిషత్తు 6,4 లో ఒక రమ్యమైన కథ యిట్లున్నది—

జబాల అను స్త్రీ యొక్క కుమారుడు గురుకులములో చదువుకొనుటకై బయలుదేరుచు "అమ్మా! గురువులవారు నీ తండ్రి యెవరు, నీ గోత్రమేమి" అని అడిగితే యేమి చెప్పుదును అని తల్లిని అడుగగా తల్లి యిట్లన్నది: "నాయనా, నేను చిన్నతనంలో చాలా మంది యిండ్లలో దాసీపని చేసినాను. అట్టి సమయంలో ఎందరో నన్ను పొందినారు. వారిలో నీవెవరికి పుట్టినావో యేమో. కావున నీ పేరు సత్యకామ జబాల అనిమాత్రం చెప్పి, ఉన్నంత సంగతి గురువులతో తెలుపు కొనుము." సత్య కాముడు గురువుతో అట్లే చెప్పుకొన్నాడు - గురువిట్లన్నాడు. "నీవు సత్యమే చెప్పినావు. నీవు బ్రాహ్మణ బీజానికే పుట్టినావు. కావున నీవు బ్రాహ్మణుడవే" అని నిర్ణయించి చదువు చెప్పినాడు. ఈ కథ యింకా చాలావర కున్నది. అదంతా యిప్పుడవసరంలేదు. దీనివల్ల తెలిపేదేమనగా వ్యభిచార సంజా తుడుగూడా ఏ దాసీపుత్రుడో ఏ సేవకులవాడోకాకుండా బ్రాహ్మణుడే అయినాడు.

ఉత యత్పతియో దశ
స్త్రియాః పూర్వే అబ్రాహ్మణాః
బ్రహ్మచేద్ధస్తమగ్రహీత్
బ్రహ్మ చేద్ధస్తమగ్రహీత్
స ఏవపతి రేకధా

— అథర్వవేదం, 4, 17, 8

అనగా;

ఒక స్త్రీకి పదిమంది అబ్రాహ్మణులైన భర్తలు ఏర్పడిపోయినప్పటికిన్ని తుదిలో ఆమెను ఒక బ్రాహ్మణుడు పెండ్లి చేసుకొన్నట్లయితే అతడే ఆమె భర్త.

దీనివలన స్త్రీకి 11 మంది భర్తలను చేసుకొను అధికారం ఉన్నదన్నమాట. 11 వ భర్త బ్రాహ్మణుడైతే ఆమె బ్రాహ్మణి అయిపోతుంది కదా !

ఇక మనువుగా రేమంటారో చూడండి.

యాదృగ్గుణేన భర్త్రా స్త్రీ
సంయుజ్యేత యథావిధి
తాదృగ్గుణాసాభవతి
సముద్రేణేవ నిమ్నగా.

నదిలోని నీరు ఎట్టిదైనను సముద్రములో పడినతర్వాత దానిలో కలిసి పోయినట్లు స్త్రీలును తాము వివాహమాడిన వారిలో కలసిపోతున్నారు. (ఎట్లనగా)

అక్షమాలా వసిష్ఠేన సంయుక్తాధమ యోనిజా
సారంగీ మంద పాలేన జగమాభ్యర్హణీయతామ్.

వసిష్ఠునిచే వివాహము చేసికొనబడిన అధమయోనిలో పుట్టిన అక్ష మాలము, మందపాలుడను వానికి వివాహితయైన సాంగి యను (అధమ యోని జయగు) స్త్రీయు భర్తల మూలాన పూజ్యులైరి.

అక్షమాల (లేక అరుంధతి) శూద్ర స్త్రీ కాదు. అధమజాతి వనిత(చండాలస్త్రీ) ఆమె బ్రాహ్మణునింటిపిల్లయే కాని ఎవ్వరో చండాలుడు పెంచినాడు అని వాదించ కుండా అచ్చట ఆమె అధమయోనిజగా స్పష్టీకరింపబడినది. మందపాల ఋషి సారంగి అను దాన్ని పెండ్లాడిన కథ యే పురాణమందున్నదో యేమో నాకు తెలి యదు. వీరిద్దరేకాదు. ఇంకా ఇట్టి వర్ణాంతర వివాహాలను చేసుకొన్నవారు చాలా మంది యుండిరి.

ఏతాశ్చాన్యాశ్చలో కేస్మిన్
అపకృష్ట ప్రసూతయః
ఉత్కర్షం యోషితః ప్రాప్తాః
స్వైస్వైర్భర్తృగుణైశ్శుభైః.

ఇంకా చాల మంది నికృష్ట జాతి స్త్రీలు గొప్పవారిని పెండ్లాడి తమ భర్తల శుభగుణాల మూలాన తాము ను ఉత్కర్షను పొందినారు (మనుస్మృతి అధ్యాయం 22, 23, 24 శ్లోకాలు.)

పూర్వకాలములో భారతదేశమందు కొందరు రాజులు చాలా దుర్మార్గులుగా నుండిరి. వారి కాలములో వర్ణాంతర వివాహములు. స్త్రీలకు స్వేచ్ఛా భోగము వివాహ నియమ రహితత్వము (రష్యాలో Nationalisation of women ఉన్నదని కొందరు వ్రాసినట్లుగా) ఉండెను.. వేనుడు చాలా చెడ్డ రాజు. అతని కాలములో ఒకని భార్యను మరియొక్కడు స్వేచ్ఛగా పొందు చుండెను. అదితప్పు కాదని ఆ రాజు శాసించి యుండెను.

అయంద్విజైర్హి విద్వద్భిః
పశుధర్మో విగర్హితః.

అది పశుధర్మమని పెద్దలు గర్హించిరి. కాని

మనుష్యాణామపి ప్రోక్తో
వేనే రాజ్యం ప్రశాసతి (మను. 966)

ఈ పశుధర్మాన్ని మనుష్యులు కూడా పాలించండి అని వేనమహారాజులుం గారు బారాఖూన్ మాఫీగా సెలవు పెట్టిరి.

గౌతమ ధర్మసూత్రాలు (అవిసూత్రాఉ అరుటచేత) చాలా ప్రాచీనములని పరిశోధకులు నిర్ణయించినారు. అందు ఎత్తుకుంటూనే మూడవ సూత్రము ఇట్లున్నది.

దృష్టోధర్మవ్యతిక్రమః
సాహ హంచ మహతాం.

పెద్దలు ధర్మ విరుద్ధంగా ఆచరించినారు. అది సాహసమే అన్నారు దానికి వ్యాఖ్య వ్రాసిన హరదత్తాచార్యులిట్లు వ్రాసినారు.

కతక భరద్వాజౌవ్యత్యస్య
భార్యే జగ్మతుః వసిష్ఠ
శ్చండాలీం అక్షమాలాం.

కతకుడు భరద్వాజుడు ఒకనాడు ఇట్లు ముచ్చటించుకొన్నారట. "ఎమోయ్, నీ భార్యపై నాకు మోజు, నాభార్య నిన్నుచూస్తే నీమీద విరుచుకొని పడుతుంది. ఎందుకీ దొంగబ్రదుకు సుఖంగా పెండ్లాలను మార్చుకొందామా ? సరే అంటే సరే అనుకొన్నారు. భార్యలను వెంటనే అదిలీ బదిలీ చేసుకొన్నారు. ఇది యీ చర్చకు అప్రస్తుతము లెండి — మరి ప్రస్తుతమేమంటే శ్రీ రావుగారు వసిష్ఠుని భార్య చండాల స్త్రీ కాదన్నారు. ఇచ్చట "చండాలీం అక్షమాలాం" అని మనుస్మృతి ప్రమాణాన్ని విప్పి స్పష్టం చేసినారు. స్మృతి ప్రమాణాలు రావు గారికి గ్రాహ్యములా ? స్మృతులను గూడా పాశ్చాత్యులే వ్రాసినారా ? లేక స్మృతులలో ఇట్టివన్నీ ప్రక్షిప్తమంటారా ? వారికంటే ముందుగా నేనె ఈ తీర్మానాన్ని లేవదీస్తాను. ఆమాట అంటారేమో మొదలు వినుకొన్న తర్వాత దానికి సమాధానమిచ్చుకోవలసి యుంటుంది.

వర్ణాంతర వివాహాలు ప్రకృతి ధర్మంలో గాఢంగా చేరినట్టివి. ప్రేమకు వేదాలు, శాస్త్రాలు పురాణాలు గిరాణాలు అడ్డము రానేరవు. అందుచేత అనంత కాలముతో ఈ విపులమైన పృథివిలో ఎందరేమి శాసించినను వాటిని లెక్కపెట్ట కుండా నూర్లుకాదు వేలుకాదు లక్షలుకాదు కోట్లకొలది జనులు వర్ణాంతర వివాహాలు చేసుకొనుచు వచ్చిరి. చేసుకొను చుందురు ఎవరేమన్నా చేసుకొని తీరుదురు. ఈ అవస్థను చూచియే శాస్త్రకారులు ఒక సిద్ధాంతాన్ని లేవదీసిరి. అది అనులోమ ప్రతిలోమ వివాహపద్ధతి. నెత్తినున్నగా గొరిగిన తర్వాత జుట్టునుండి నొసటి వరకు ఎదురుగా చేయి నిమిరిన కరుకు కరుకుగా తగులును. అది ప్రతిలోమ పద్ధతి. అంటే పైజాతి పురుషులు క్రిందిజాతి స్త్రీలను పెండ్లాడితే అంతగా తప్పు లేదట.

కాని క్రిందిజాతి పురుషుని పైజాతి స్త్రీలను వివాహమాడితే అది తప్పట. అందులోను శూద్రపురుషుడు బ్రాహ్మణస్త్రీని వివాహమాడితే ఇంకేముంది కొంపమునిగింది. వారికి పుట్టినవాడే చండాల సోదరుడు. మన అస్పృశ్యుల తల్లు లంతా బ్రాహ్మణస్త్రీలు !! శాస్త్రకారుల పక్షపాతం చూడండి. పైజాతులు ఇతర

జాతుల స్త్రీలపై చేయి వేయవచ్చునట, తమజాతి స్త్రీలను మాత్రం ముట్టితే ఘోర మగు పాపమట! దీనికిని అమెరికాలోని తెల్లవారు నీగ్రోలను ''లించింగ్'' చేసిన దానికి ఏమి భేదము ?

గౌతముడు అనులోమాన్ని గురించి యిట్లన్నాడు:
వర్ణాంతరగమన ముత్కర్షా
పకర్షాభ్యాం, సప్తమే
పంచమే వేత్యాచారః
..................1,4,19.

అనులోమ వివాహిత స్త్రీ సంతానం అట్లే ఏడు లేక అయిదు తరాలు జరిగిన తర్వాత పతికులంలో ఆ సంతానం చేరిపోతుంది.

సృష్ట్యంతర జాతానాంచ 1,4,19.

మను గౌతమాది ధర్మ శాస్త్రాలలో క్షేత్రము ప్రధానమా బీజం ప్రధానమా అని చర్చచేసి ఒకని భార్యయందు పరుడు వీర్యమించిన ఆ సంతానం క్షేత్రపతికే చెందునని నిర్ణయించినారు,

భారతములోని ఉద్దాలక శ్వేతకేతూపాఖ్యానం చాలా మందికి తెలుసును కదా ! అతని కాలములోని సాంఘిక స్థితి యెట్టిదో అందు స్పష్టంగానే నిరూపించినారు. ఇంకను ఇట్టి అంశాలు వెదికేకొలది బావి త్రవ్వితే బేతాళాలు బయటికి వచ్చినట్లు కావలసినన్నీ బయటపడగలవు.

చారిత్రకముగా వర్ణాంతర వివాహాలు ఎట్లు జరుగుచు వచ్చెనో తెలిపి యీ చర్చను ముగించుదును.

బుద్ధుని కాలమునుండి నేటివరకు తక్కువ వర్ణాలవారు పెద్ద వర్ణాలుగా మారిపోవడం, పెద్ద వర్ణాలవారు తక్కువ వర్ణాలుగా మారిపోవడం జరుగుచు వచ్చుచున్నది. నేటివరకును జరుగుచున్నదని అర్థవంతముగానే వ్రాసినాను.

ఏ జాతి వారినైతే 50 ఏండ్లనాడు రెడ్లు మున్నగు వారు తాకజాలకుండిరో అట్టి జాతి ఈనాడు బ్రాహ్మణులతో బాంధవ్యము చేయుచున్నది. అది ఈ నిజాం రాష్ట్రములోనే తెలంగాణాలోనే ఉన్నది. బౌద్ధులు, జైనులు హిందువులైరి. ముసల్మానులు వచ్చిన తరువాత ముసల్మానులైన హిందువులు మరల హిందువులైరి. ఇదంతయు వర్ణాంతరముల సంబంధ చర్చయేయగును. మతాంతరులను తమ మతములోనికి చేర్చుకొని వారిని తనలో లీనము చేసుకొన్న హిందూ మతములో వర్ణాంతరములు కూడవని ఈనాడు చర్చించు శుద్ధ పూర్వాచార ఛాందసత్యమునేమనవలెను.

ముసల్మానులు హిందువులైరని అంటిని కదా. అంతే కాదు ముసల్మానుల స్త్రీలను హిందువులు పెండ్లాడిరి. ఎట్లనగా :

1. అల్లావుద్దీను బిడ్డలు ద్వార సముద్ర రాజైన బల్లాళ రాజును మోహించి పెండ్లాడిరి. (**Hist. and Discri. of N S Domin**. Vol 1-P. 50.

2. బస్వ అను రాజపుత్రరాజు సలీం బిడ్డను పెండ్లాడెను. (టాడ్ రాజస్థాన్).

3. బాజీరావు పేష్వ మస్తాన్ని అను ముస్లిం సుందరిని పెండ్లాడెను.

4. నింబాల్కరు అను మరాఠీ సేనాని బిజాపూరు సుల్తాను బిడ్డను పెండ్లాడెను. తర్వాత ఇతడు శివాజీ బిడ్డనే పెండ్లాడెను. (3-4 విషయాలకు చూ. కింకేడు వార్స్నిక్ష - మరాట చరిత్ర).

5. జస్వంత సింహుడు షాజహాన్ చక్రవర్తి బిడ్డను పెండ్లాడెను. (టాల్బాయి, వీలర్)

ఇట్టి యంశాలను యింకను కావలసినన్ని చూపించవచ్చును.

కాశ్మీర రాజైన చక్రవర్మ అనువాడు చండాల స్త్రీని పొందెను. (కల్హ. రాజ తరంగిణి 5-354).

"పూర్వము వైశ్యులకును, శూద్రులకును భేదము లేకుండెను. ఉభయ జాతులును నియమరహితముగా వివాహమాడుచుండిరి. వైశ్యులు కాని శూద్రులు కాని వేదాలు చర్చించితే వారి నాలుకలు కోయుచుండిరని అల్టేకరని వ్రాసెను." (అల్టేకర్-రాష్ట్ర కూటులు).

"బాణుడను సంస్కృత మహాకవియొక్క తండ్రి ఒక శూద్రస్త్రీని కూడ పెండ్లాడెను." (హర్షచరిత్ర - 2 వ ఉల్లాసము)

చంద్రగుప్త మౌర్యుడు గ్రీకు జాతి వాడైన సెల్యూకను బిడ్డను పెండ్లాడెను.

అనేక మంది గ్రీకులు హిందువులై హిందువులలో కలసిపోయిరి.

అదే విధముగా అనార్యులై కషాణహూ, సికమెచ్చ సహళర బర్బరాది జాతులవారు హిందువులై పోయిరి. హూణజాతి రాజులైన కనిష్క హువిష్క రాజులు సూర్యవంశ క్షత్రియులైరి. (వివరాలకు ఇండియన్ ఆంటిక్వారీ 1911 లో డా॥ భండార్కరు గారు వ్రాసిన హిందువులలో విజాతీయులు అను వ్యాసము చూడుడు)

టిబెటు రాజైన గంపరాజు నేపాళ రాజకుమారిని పెండ్లాడెను. క్రీస్తు శకాదిలో కౌండిన్యుడను బ్రాహ్మణుడు కాంభోజ (కాంబోడియా) దేశమునకు రాజయ్యెను. కాంబోడియా రాణిని కౌండిన్యుడు పెండ్లాడెను. (వివరాలకు **Greater India** గ్రంథాలను చూడుడు)

ఒక క్షత్రియుడు కుమ్మరి దానిని, మేదర దానిని, పుష్పలావికను, వంటల దానిని పెండ్లాడెను.

ఒక బ్రాహ్మణుడు క్షత్రియుడు వదలిపెట్టిన భార్యను వివాహమాడెను. (చూ. రిస్‌డేవిడ్ బు. డిస్టిల్ ఇండియా)

"వివాహములోని నిషేధాలన్నింటిని బ్రాహ్మణులు స్వార్థపరత చేతనే నిర్మించి పెట్టిరి". (సెన్‌ఫీల్డ్)

ఆర్యులు ఆటవికుల పిల్లల వివాహమాడిరి. (రిస్లీ)

"ఆటవికులలో చాలమంది బ్రాహ్మణులును, క్షత్రియులును అయిపోయిరి." (రిస్లీ). యు. పి. లోని సనాఢ్యీ బ్రాహ్మణులు ఉదంబరులు, తలాజియాలు, పుష్కరణ బ్రాహ్మలు, నిజమైన బ్రాహ్మణులు కారు. తక్కువ జాతుల నుండి బ్రాహ్మణులలో చేరిపోయినారు. (షెర్రిగ్ హిందూ కాస్ట్సు పు. 32 మరియు బరోడా సెన్సస్ రిపోర్టు 1931) అదే విధముగా చిత్పావన బ్రాహ్మణులు, నాగార్ బ్రాహ్మలు విదేశమునుండి వచ్చిన జనులు. (భండార్కరు ఇండియన్ ఆంటిక్వారి 1911)

ప్రతాపగడీతో కుంద బ్రాహ్మణులలో నొక తెగగలదు. రాజామానిక చందు సవాలక్ష బ్రాహ్మణులకు విందు చేస్తానని మ్రొక్కుకొని యుండెను. అందరు బ్రాహ్మణులతనికి లభింపక పోయిరి. అప్పుడు ఆహీరు (గొల్ల) కూర్మి, భట్టు మున్నగు శూద్ర జాతి వారిని బ్రాహ్మణులనుగా జేసవేసెను. నేటికిని వారికిని ఇతర బ్రాహ్మణులకు భేదం లేకుండా సబంధ బాంధవ్యాలు జరుగుచున్నవి (ఔదుగటిటియర్ 1-305). తిరుగు రాయకులు, పాఠకులు, ఫాండే పర్వారాలు, సవాలాఖీలు, వీరంతా శూద్రులనుండి ఏర్పడ్డ బ్రాహ్మణులు కాని, తమ లోపం దాగిపోవుటకు గాను వారు తమ పేరుల తుదిలో దూబే, ఉపాధ్యాయ తివారీ, మిశ్ర, దీక్షిత, పాండే, అశ్వత్థి, పాఠక్ అను లావు లావు పదాలు వ్రాసుకొంటారు. (N.W.P. VI-351-2)

నిన్న మొన్నటి మాట చూడండి. 100 ఏండ్ల క్రిందట రాజా భగవంత రాయి అను, ఆశోక్తరు రాజా, ఉప్పుచేయుటానిమా జాతివారిని బ్రాహ్మణులనుగా జేసివేసెను. (**N.W.P. - VIII**)

దక్షిణములో కూర్గులోని తౌ అన బ్రాహ్మణులు చేపలు పట్టువారి నుండి వచ్చిన వారు. (వివరాలకు శరశ్చంద్ర రాయిగారు వ్రాసిన వ్యాసం 1943 లోని "**Man in India**" అను దానిలో చూడుడు).

క్రీ. శ. 12 వ శతాబ్దములో బెంగాలు రాజైన బళ్ళాలసేనుడు కైవర్తులు అను బెస్త వారికి ఉత్తమ కులము నిచ్చెను. క్రీ. శ. 17 వ శతాబ్దములో జైపల్మెరు రాజగు అమరసింగు మహారాజుగారు తురకలైన భట్టే రాజపుత్రు లందరినీ శుద్ధిచేసి హిందువులను చేసివేసెను. (**Hindu Superiority**).

మలబారు ప్రాంతములో పరశురాముడు శైవర్తాదులను బ్రాహ్మణులనుగా జేసెను. (సహ్యాద్రి ఖండము).

తెనుగు దేశములో బెస్తవారు మున్నగు క్షుద్రజాతుల వారినుండి నియోగి బ్రాహ్మణులు కొందరు ఏర్పడిరి. (రాజరాజ నరేంద్ర సంచిక - చిలుకూరి వీరభద్రరావు గారి వ్యాసం).

ఈ విధముగా హిందువులలో ప్రతి శాఖలోను కులాల మార్పులు జరుగుచు వచ్చెను. తత్ఫలితంగా వర్ణాంతర వివాహాలు ప్రబలుతూ వచ్చెను. చరిత్ర పరిశోధనలు చేయువారికి అడుగడుగు కిట్టి విషయాలు గోచరించుచునే యున్నవి.

# హిందూ ధర్మశాస్త్రమందు స్త్రీల స్థానము

ప్రాచీనము నుండియు హిందూ స్త్రీ చరిత్రయే హిందూ సంఘ చరిత్రయై యున్నది. స్త్రీ హక్కులు, బాధ్యతలెట్లెట్లు మారుచు వచ్చెనో అట్లట్లు సంఘము కూడ మారుచు వచ్చెను. హిందువుల "ధర్మ శాస్త్రము"లో స్త్రీకి సంబంధించని విషయములు లేనే లేవనవచ్చును. వివాహము, విభాగము, వారసత్వము, స్త్రీ ధనము, దత్తత, మున్నగు విషయములలో స్త్రీ స్థానమెట్టిదో గుర్తించవలెను.

పూర్వము వేదకాలమందు, స్మృతి కాలమందు, తర్వాత నిబంధనకారుల కాలమందు ఆటు తర్వాత ముసల్మాను ప్రభువుల కాలమందు, మరియు నేడు బ్రిటిషు వారి సామ్రాజ్యములో స్త్రీ స్థాన మెట్లుండుచు వచ్చెనో ఆ చరిత్ర యంతయు మనకిప్పుడవసరములేదు. వేదకాలములో స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్య ముండెననియు స్మృతి కాలములో స్త్రీ స్వాతంత్ర్యము సన్నగిల్లెననియు; ముసల్మానుల కాలములో నిబంధనకారులు తమ కిష్టమువచ్చినట్లు శాసించిరనియు మనము గ్రహింపవచ్చును. బ్రిటిషు కోర్టులు మనదేశములో నెలకొనిన తర్వాత స్త్రీ హక్కులలో గల్గిన మార్పులే యిచ్చట చర్చనీయాంశములు.

## ధర్మ శాస్త్రములు

హిందువులకు వర్తించు ధర్మ శాస్త్రములలో బ్రిటిషు కోర్టులొప్పుకొనిన వానిలో ముఖ్యమైనవి, మనుస్మృతి యాజ్ఞ వల్క్యస్మృతి. మనుస్మృతి శ్లోక మొక్కటి అన్నిటికి మూలాధారము.

శ్లో॥ "శ్రుతి స్స్మృతి స్సదాచారః స్వస్య
చ ప్రియ మాత్మనః.

ఈ శ్లోక ప్రకారము "సదాచారము" ప్రధాన సూత్రమైనది. ఏ జిల్లాలో విశేష జనులచే నెట్టి పద్ధతి (రివాజు) యాదరింపబడునో అదియే సదాచారము; దానిని కోర్టు వారొప్పుకొందురు. ఒక మారు సిద్ధించిన ఆచారము (custom)

ఎన్ని శాస్త్రములకు విరుద్ధమైనను త్రిప్పబడజాలదు. "వచన శతేనాపివస్తు నాన్యథా కరణే శక్తిః" అను ప్రాచీన సిద్ధాంతమును బ్రిటిషుకోర్టు లొప్పుకొనినవి. అనగా ఒక మారు ఒక విషయము ఆచార సిద్ధమయ్యెనా దానికి విరుద్ధముగా నూరు శాస్త్రాధారములున్నను అంగీకరింపబడవు. ఈ సిద్ధాంతరీత్యా బిడ్డ కొడుకుల దత్తును, ఇల్లటమును అంగీకృతమయ్యెను. కావున బ్రిటిషు కోర్టులలో ఈ 40-50 ఏండ్లనుండి కావింపబడిన హిందూశాస్త్ర సంబంధమగు తీర్మానములు సక్రమమైనవా యను సంశయము బాధింపక మానదు. ఇక స్త్రీ సమస్యను గురించి విచారింతము.

మనువు స్త్రీ విషయములో చాల అన్యాయము చేసినాడు. అయినను యాజ్ఞవల్క్యస్మృతిలో కొంత న్యాయము చూపింపబడెను. అదియు కాలము మారు కొలది జనుల కుపకరింపక పోయెను. అప్పుడు విజ్ఞానేశ్వరుడు అను మహాత్ముడు యాజ్ఞవల్క్య స్మృతిపై "మితాక్షర" వ్యాఖ్యానము వ్రాసి పుణ్యము కట్టుకొనెను. మన అదృష్టమువలన ఈ మితాక్షరన్యాయమే బ్రిటిషు కోర్టులలో వర్తించుచున్నది. విజ్ఞానేశ్వరుడు స్మృతిలోని మూల సూత్రమును ఆధారముగా నిమిత్త మాత్రముగా చేసికొని, దానిపై తన కాలములో నుండిన ఆచారములను, లేదా న్యాయముగా నుండవలసిన పద్ధతులను, విశదపరచి పెంచి వ్యాఖ్యానము చేసెను. మొత్తము హిందూ స్థానములో నిప్పుడు రెండు శాఖలేర్పడినవి. బెంగాలులో దాయ భాగమనియు తక్కిన దేశములో మితాక్షర అనియు, ధర్మ శాస్త్రము వర్తించు చున్నది. దాయ భాగముతో మనకిప్పుడవసరము లేదు. ఒక ముఖ్య సూత్రము మాత్రము గమనింపవచ్చును. దాయ భాగము ప్రకారము యజమాని చచ్చిన తర్వాత వారసుల కాతని యాస్తిపై హక్కు ఉత్పత్తియగును; మితాక్షరలో యజమానికి కొడుకు పుట్టిన వెంటనే ఆ పుట్టిన వానికి ఆస్తిలో హక్కేర్పడును. ఇక మితాక్షర ప్రకారము బ్రిటిషు కోర్టులెట్లు స్త్రీల హక్కులను గురించి నిర్ణయించెనో విచారింతము.

## విభాగము

విభాగములో నించుమించు స్త్రీకి హక్కే లేదనవచ్చును. అవిభక్త కుటుంబములోని స్త్రీకి ఎట్టి హక్కులును లేవనవచ్చును. ఒక సమిష్టికుంటుంబము

విభజించుకొనినప్పుడు, తల్లిదండ్రులు జీవించి యుండినచో వారిద్దరికిని పుత్రులతో సమానమగు భాగము దొరకును తల్లిదండ్రులనుటచే, భర్తయున్నందున భార్యకు ప్రత్యేక భాగము లేదు. తండ్రి చనిపోయి తల్లి మాత్రమే జీవించియుండినచో నామెకు ఒక యంశ మీయవలెనని యాజ్ఞవల్క్యుడు సెలవిచ్చినాడు.

"పితురూర్ధ్వం విభజితాం
మాతాప్యంశం సమంహరేత్"

కాని యీ భాగముపై ఆమెకు సంపూర్ణాధికారము లేదు. ఆమె దాని నిష్టము వచ్చినట్లు వ్యయము చేయజాలదు.

మరియు పెండ్లికాని బిడ్డకును, చెల్లెలికిని విభాగసమయములో పురుషుని భాగములో నాల్గవ భాగము విధింపబడినది. కాని వివాహితలైన భగినీదుహితల కేమియు భాగములేదని మితాక్షరమందే శాసింపబడినది. అదేవిధముగా నిముడు బ్రిటిషిండియాలో తీర్పులు చేయబడినవి. కాని ఆచారములో నిట్లు వర్తించుట కన బడదు. పెండ్లికాని చెల్లెండ్రకు, బిడ్డలకు వివాహము చేయు బాధ్యత మాత్రమే యితర భాగస్థులపై యున్నది.

ఒక యజమాని పురుష సంతతి లేక చనిపోయినట్లైన, యతని భాగము మొదలు భార్యకును, తర్వాత బిడ్డకును, చెందునని యాజ్ఞవల్క్యస్మృతి చెప్పు చున్నది. కాని బిడ్డలవిషయమై మితాక్షరములో కొన్ని సూక్ష్మభేదములు కల్పించి నారు. పెండ్లియైన బిడ్డలకు మారుగా పెండ్లికాని బిడ్డలకే భాగమయ్యవలెననియు, బిడ్డలకందరికిని పెండ్లియైనట్లైన ధనికుల యింటికీయబడిన బిడ్డలకు మారుగా బీదల యింటికీయబడిన బిడ్డలకే యియ్యవలెననియు నిర్ణయించినారు.

## స్త్రీ ధనము

స్త్రీ ధనమును 7-8 విధములుగా విభజించినారు.

1. పితృమాతృపతి భ్రాతృదత్తము

2. ఆధ్యగ్ని-పెండ్లివేళ మామ మున్నగు వారిచ్చినది.

3. అధివేదనికము - భర్త రెండవ భార్యను చేసికొని నప్పుడు మొదటి భార్యకోదార్పుగా నిచ్చుకొనిన ధనము. యాజ్ఞవల్క్యుడు పై విశాసించుచు "ఆద్యం" ఇత్యాదులు అన్నాడు. ఇంతమాత్రమాధారము విజ్ఞానేశ్వరునికి దొరకిన చాలును; "ఆద్యం"లో యివన్నియు చేరినవన్నాడు.—

1. అధ్యావాహనికం - అత్తగారింటికి వధువును తీసికొని పోవునప్పుడిచ్చు ధనము.

2. ప్రీతిదత్తం - బంధువులచేత, భర్తచేత ప్రీతితో నప్పుడిచ్చునది.

3 పాదవందనికం-పెండ్లిలో పెద్దలకు వమస్కారము చేసినప్పుడిచ్చినది.

4. సౌదాయికం - కన్యకకైనను. వివాహితకైనను. పతి యింటిలోగాని, తండ్రియింటిలో గాని యియ్యబడినది.

ఇవన్నియు ఎన్నికలిగినను చిల్లర బాబతువే. ఇట్టి స్త్రీధనముపైనను కొన్ని సమయములలో భర్తకధికారమిచ్చినారు.

## దత్త స్వీకారము

ప్రాచీనములో 72 విధముల పుత్రులను శాస్త్రకారు లంగీకరించిరి. ఇప్పుడు ప్రధానులు ఔరసుడు, దత్తుడు, పుత్రీపుత్రకుడు రౌహిత్ర బాధ్యతలో వచ్చును. కృత్రిముడనువాడు మాళవ దేశములో మాత్రమే. ధ్వ్యాముష్యాయనుని ప్రశంస అరుదుగా వచ్చును తక్కిన కానీన, గూఢోత్పన్న, పౌనర్భవ, కుండగోళకాదు లిప్పుడు లేరు.

సంతానంలేని వితంతువునకు దత్తస్వీకార విషయముతో నొక్కొక్క రాష్ట్రములో నొక్కొక్క విధమగు తీర్పును బ్రిటిషు హైకోర్టులు చెప్పియున్నవి. వసిష్ఠస్మృతిలో పత్యాజ్ఞలేనిది భార్యకు దత్తస్వీకారాధికారము లేదనియున్నది. కాని మిథిలలో వితంతువు కేవిధముగను గూడ దత్త స్వీకారాధికారములేదు, చని పోవునపుడు భర్త ఆజ్ఞ యిచ్చినను వితంతువున కధికారములేదట-కాశియందును, వంగదేశమందును భర్త్రాజ్ఞ యుండినచో అధికారము కలుగును. మద్రాసులో భర్త గాని, అతడు లేనిచో సపిండులుగాని యంగీకరింపవలెను. బొంబాయిలో భర్త తన జీవితకాలమందు ప్రత్యేకముగా నిషేధించినచే తప్ప వితంతువునకు అధికార మిచ్చినారు.

పూర్వము స్త్రీలను దత్తు తీసుకొనుచుండిరని పురాణ ప్రమాణములుకలవు. నంద పండితుడు తన "దత్తక మీమాంసము" లో లోమపాదుడు 'శాంత' అను బాలికను దత్తుగా తీసికొనెననియు, వధ్రీమతి యను వాడు 'హిరణ హస్త'యను బాలికను దత్తుగా స్వీకరించె ననియు రామాయణాది పురాణ ప్రమాణముల నిచ్చి విపులముగా నీ విషయమును సమర్థించినాడు. దత్తు విషయములో నీ గ్రంథము ముఖ్య ప్రమాణము. కాని, బ్రిటిషు కోర్టులలో నిప్పుడు స్త్రీలను దత్తుగా నంగీకరించుటలేదు.

## వ్యవహారములు

స్త్రీలు చేయు వ్యవహారములు (కంట్రాక్టులు - మొఆహిదాలు) సాధారణముగా చెల్లవు. కారణమేమన "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అని మనువు శాసించి యుండలేదా? యాజ్ఞవల్క్యుడు భార్యకు, బిడ్డలకు వారసత్వపు హక్కులిచ్చినను, అట్టి వారసత్వము వలన వచ్చిన ధనముపై స్త్రీలకు సంపూర్ణాధికారము లేనట్లుగా వారు స్థిరాస్తులను ట్రాన్స్‌ఫర్ చేయజాలనట్లుగను, అట్టి వ్యవహారములు చెల్లనేరనట్లుగను హైకోర్టులు తీర్మానించెను. ఒక బొంబాయి రాష్ట్రములో మాత్రమే స్త్రీ వ్యవహారముల సాధుత్వము నంగీకరించినారు.

కొన్ని చిల్లర సందర్భములలో స్త్రీ తనకు సంక్రమించిన ఆస్తిలో చాలా కొద్ది అంశమును మాత్రమే అమ్మ వచ్చునని తుదకంగీకరింపబడినది. ఆ యంగీకరణముకూడ తల తోక లేని పద్ధతిగా నున్నది. గయకు తీర్థ యాత్రకై పోయిన దాని నంగీకరింతురట! కాని కాశీ యేమి పాపము చేసినదో; కాశీకి పోయిన ఖర్చుల నంగీకరింపరట! చెరువులు, సత్రములు కట్టించుట అంగీకరింపరట!

## ప్రత్యేక శాసనములు

బ్రిటిషిండియాలో స్త్రీల సంబంధమగు కొన్ని ప్రత్యేక శాసనములు కావింపబడినవి. అవి మాత్రము విశేషముగా స్త్రీలకు సహాయపడిన వనవచ్చును.

క్రీస్తు శ. 1856 లో వితంతూద్వాహ శాసనము కావించిరి. దాని ద్వారా యువతులైన వితంతువులు తమ యిష్టముతో వివాహము చేసుకొని అట్టి వైవాహిక ధర్మముచే సంతానము కనినచో, ఆ సంతానమునకు తల్లిదండ్రుల యాస్తిపై అధి

కారముండునని శాసింపబడెను యిది చాల న్యాయబద్ధమైన శాసనము. యిట్టి శాసనము పుట్టిన సుమారు 80 ఏండ్ల తర్వాత కూడ నిజాము రాష్ట్రములో నిట్టి శాసనమునే కావించుటకు ఆటంకములు కలుగుచున్నవి !

ఈ శాసనాత్పూర్వమే క్రీ. శ. 1829 లో సహగమన నిషేధ శాసనము గావింపబడెను. దానివలన బలవంతముగా భార్యలను భర్తల చితులపై కట్టి కాల్చునట్టి ఘోరమును, నమానుషమును నగు ఆచారము ఆపి వేయబడెను.

క్రీ శ. 1850 లో మత స్వాతంత్ర్య శాసనము (**Caste Disabilities Removal Act**) కావింపబడెను. ఇది మాత్రము హిందువులకు చాల నష్టదాయకమే ! ఇది క్రైస్తవులకు చాల లాభదాయక మయ్యెను. హిందూ భర్త క్రైస్తవుడైన, వాడు భార్యను వదలి యింకొకతెను వివాహము చేసికొనవచ్చును, లేకున్నచో భార్య కూడ క్రైస్తవ మత స్వీకార మొందవలెను. ధర్మ శాస్త్ర ప్రకారము మత భ్రష్టుడు, పతితుడు. పతితునికి ఆస్తిలో భాగము లేదు. కాని యీ మత స్వాతంత్ర్య శాసనము ప్రాతశాసనమును ఖండించివైచి వానికి ఆస్తిలో భాగమిప్పించెను. అట్టి పతితుడు హిందువులకు చచ్చిన వానితో సమానుడు - ఒక వితంతువున కొకే కొడుకుండి వాడు క్రైస్తవుడైనచో వాడామెకుత్తరోత్తర కర్మాదులకు చచ్చినవాడే ! అట్టిచో ఆమె యింకొకని దత్తు తీసుకొన వచ్చునా ! కూడదని తీర్పులయ్యెను.

ఇటీవలనే, బాల్య వివాహ నిరోధక శాసనము గావింపబడినది. ఇది లాభకారియే; కాని మన రాష్ట్రములోకూడ నిట్టి శాసనము లేనందున బ్రిటిషిండియాలో పై శాసన ధిక్కారుల కిది శరణ్యమైన పుణ్యభూమియై పోయినది.

## వైవాహిక శాసనములు

బ్రిటిషిండియాలో కూడ సివిల్ మ్యారేజ్ శాసనము లేదుకాని బరోడా రాజ్యములో 1908 లోను, ఇందూరు రాజ్యములో 1916 లోను, కొల్లాపూరు లోను, మరికొన్ని యితర దేశీయ సంస్థానములలోను సివిల్ మ్యారేజ్ శాసనములు గావించిరి; అనగా వివిధ మతములకు చేరిన స్త్రీ పురుషులు వివాహము

చేసికొనుట కంగీకరింపబడినది. బ్రిటిషిండియాలో నిట్టి శాసనము లేకున్నను 1832 లో స్పెషల్ మ్యారేజ్ శాసనము (హిందూ, బౌద్ధ, సీక్కు, జైనుల కొరకు) గావింపబడెను. తద్వారా వివిధ మతముల స్త్రీ పురుషుల వివాహము కొన్ని నియమములతో నంగీకరింపబడెను.

మన రాష్ట్రములో నీరెంటిలో నొక శాసనమైనను లేదు. పూర్వము అష్ట విధ వివాహములను శాస్త్రకారులంగీకరించిరి. ఇప్పుడు బ్రిటిషిండియాలోనేమి, రెండు విధముల వివాహములే యంగీకరింపబడినవి.

వివాహితయైన హిందూస్త్రీ సాధారణముగా యజమానుని చరాస్థివలె చూడబడినను బాధకము లేనిస్థితి యేర్పడినది. ఎట్టి కారణము లేకయే, భర్త భార్యను వదలివేయవచ్చును. లేక భర్త యెందరినైన వివాహమాడవచ్చును. అట్టి సందర్భములలో భార్యకు విడాకులు పొందు (Divorce) అధికారము లేదు. రెండవ వివాహము చేసుకొనకుండ భర్తను నిరోధించు (injunction) అధికార మునులేదు. ఎమైనను భరణార్థము దావాచేసి,కోర్టువారను గ్రహించి డిక్రీ యిచ్చిన తృణమునకో పణమునకో మాత్రను ఆమె యధికారి, ఆమెకు రెండివవివాహమున కధికారము లేదు, మరి భర్త ఆస్తిలో భాగమడుగుట కధికారమును లేదు.

కాని భార్య నకారణముగానైనను, నిష్కారణమగాచైనను భర్తతో నుండుట కంగీకరింపని యెడల భర్తకు (Restitution of conjugai rights) ఆమెను పూర్తిగా స్వాధీన పెట్టుకొనుట కధికారము కలదు. మొదలు మొదలు బ్రిటిషు కోర్టులో భార్యను స్వాధీనము చేయ డిక్రీనిచ్చి, దాని తామీలులో భార్యను పట్టి (arrest) భర్తకిప్పించుచుండిరి. ఒక బొంబాయి కేసులో (44 బొంబాయి 932) నీ విషయమును న్యాయాధిపతి తీవ్రముగా ఖండించెను. క్రమేణ కోర్టువారది మొరటుపని యని కాఠిన్యము తగ్గించుచు వచ్చిరి. తుదకు 1923 సం॥ 28 వ శాసనము ప్రకారము అరెస్టు పద్ధతి తీసివేయబడెను

## సూచనలు

ఇంతవరకే విషయ బాహుళ్యమైనది. పై యంశములను గమనించి చూచిన ఈ కాలములో పూర్వపు ఋషుల స్థానమును హైకోర్టు జడ్జీలు, ప్రీవీ కౌన్సిలు మెంబర్లు వహించినారు.

"శృత యశ్చభిన్నాః ఋషయశ్చభిన్నాః
నైకోము నిర్యస్యమతం విభిన్నం"

అన్న రీతిగా కోర్టు ఋషులలో గూడ భిన్నాభిప్రాయము లేర్పడినవి. మొత్తముపై హిందువులకు ప్రాచీనకాలములో (అనగా రెండుమూడువేల యేండ్ల నాడు) మనువు మున్నగు ఋషులు వ్రాసిన శాస్త్రములనే హిందువులకు అంట గట్టి తీరుదుమన్న పట్టుదల వీరికి మెండుగా కనబడుచున్నది. ఇంగ్లీషు వారికి "ఈక్విటీ" అను "లా" కలదు. అట్టిదానినైనను క్లిష్టమగు కేసులలో వర్తింప జేయవలసి యుండెను.

మన రాష్ట్రములో కావలసిన హిందూశాస్త్ర మందలి మార్పులనిక సూచింతును.

1. బ్రిటిషిండియాలో 1930 సంవత్సరములో వారసత్వపు సిల్సిలాలో తండ్రితండ్రికి పూర్వము కొడుకు బిడ్డ, బిడ్డ బిడ్డ, సోదరి, ఆమె కుమారులు క్రమముగా వారసులగునట్లు శాసించిరి. అది మనకు లేకపోయినది.

2. వితంతువునకు వారసత్వరీత్యా సంక్రమించిన ఆస్తిపై ఆమెకు సంపూర్ణాధికారము లేదు. (Limited estate) ఈ యన్యాయమును తొలగించు టకై శాసనము కావలెను.

3. అనులోమ వివాహములు శాస్త్ర సమ్మతములు, ప్రతిలోమ వివాహ ములు అట్లు కావని నిర్ణయించిరి. ఈ శాసనములు చేసినవారు పూర్వములో చాల సంఘ దౌర్జన్యము చేసినవారు

ఉత్తమ జాతునవారు తమకన్న తక్కువ జాతి స్త్రీలను పొందవచ్చునట కాని తమ స్త్రీలను తక్కువ జాతి పురుషులు పొందకూడదట. కామములో కూడ (ఇతర విషయము లందువలె) వారు శాశ్వతపు గుత్తా తీసికొనిరి; ఇప్పుడు ప్రతిలోమ వివాహములు అందందు జరుగుచున్నవి. అవి సక్రమమైనవే (Valid) అని నిర్ణయము కావలెను.

4. పిచ్చివాడును, మెదడులేనివాడు (Idiot, Lunatic) చేసుకొనిన వివాహములు చెల్లునట! ఇట్లు బ్రిటిషిండియాలో తీర్పులయ్యెను. శాస్త్రప్రకారము వివాహములో కన్యను "దానము" చేయుదురు. ఈ దానమును వరుడు "ప్రతి గృహీత"గా గ్రహించవలెను. పిచ్చివాడు, మెదడు లేనివాడేపని చేయగలరా! మనువుకూడ,

> "ఉన్మత్తం పతితం క్లీబమ
> బీజం పాప రోగిణం
> సత్యాగోస్తి దిషంత్యాశ్చ
> నచదయాస వర్తనం"

ఉన్మత్త నపుంసంకాది భర్తలను ద్వేషించిన స్త్రీలను ఇంటినుండి వెళ్ళ కూడదనినాడు. అట్టి స్త్రీల వివాహము దాన గ్రహణ లోపముచేతను, నపుంసకు నికి సంభోగమున కవసరమగుట చేతను రద్దు కావింపదగినవిగా నిర్ణయింప బడవలెను.

5. హిందూ స్త్రీకి కొన్ని సందర్భములలో విడాకులు (Divorce) అవసరమగుచున్నది. భర్తయొక్క అమానుష కృత్యముల చేతగాని, మరియెట్టి యితర హింసాదుల చేతగాని ఆమెకు అవసరమగుచున్నది. కాని చిల్లర జాతులన బడు వారిలో నొప్పుకొనిన విడాకుల పద్ధతిని పై వర్ణ స్త్రీల కంగీకరించుట లేదు-

ఎట్లన

(అ) నపుంసకుని భార్య యేమి చేయవలెను. రెండవ వివాహము, లేదా వ్యభిచారము, లేదా ఆమరణ బ్రహ్మచర్యము. ఇవియే ఆమెకు శరణ్యము.

(ఆ) భర్త మతాంతరుడైనప్పుడు మాత్రము ఆమెకు రెండవ వివాహమును కోర్టులు అంగీకరించినవి.

(ఇ) పూర్వము వియోగముండెడిది ఇప్పటికిని అది ఒరిస్సాలో మాత్రము ఆచారముగా నున్నది. కాని దానిని కోర్టు వారంగీకరించారు. కాని దానిని కుష్ఠ రోగాదులచే బాధపడునట్టి భర్తల యొక్క భార్యలకు విడాకుల అధికారముండ వలెను.

(ఈ) ఒక స్త్రీని బలవంతముగాగాని, మోసముచేగాని (force or fraud) వివాహమాడిన ఆ వివాహము చెల్లదని కోర్టులు నిర్ణయించినవి. కాని సంఘ మొప్పు కొనక పోయెను. ఇది సంఘము యొక్క దౌర్జన్య నిదర్శనము.

(ఉ) సగోత్ర స్త్రీనిగాని, వరుసగాని స్త్రీనిగాని (Prohibitted degree) వివాహమాడిన ఆ వివాహము చెల్లదట చెల్లనప్పుడు పురుషుడు రెండవ వివాహ మాడవచ్చునట, కాని భార్య అట్లే యుండవలెనట. భార్య భరణార్థమునకే యధి కారియట. ఇది చాల అన్యాయము. ఇట్టి ఒక బెంగాలు కేసులో న్యాయాధికారిట్లు సెలవిచ్చిరి. ఆ స్త్రీ ప్రతివాదితో వ్యభిచారిణిగా నుండవచ్చును. డైవర్సు (విడాకులు) లేనందున విడాకులు పొందగోరు స్త్రీలకు ఒక మార్గము మాత్రము దొరకుచున్నది. ఆ స్త్రీ హిందూమతమును వదలి ముసల్మాను లేక క్రైస్తవ స్త్రీ యైన ఆమెకు రెండవ మతము ప్రకారము వేరు భర్తను వివాహమాడుట కవకాశ మున్నది. ఒక కేసులో నొక హిందూ స్త్రీ ముసల్మానై రెండవ వివాహమాడిగా ఆమెకు హిందూమతమింక వర్తింపనందున ఆమె చేసిన దానిలో తప్పులేదని నిర్ణయించిరి. మరియు మన రాష్ట్రములో సివిల్ మ్యారేజి శాసనముగాని, స్పెషల్ మ్యారేజి శాసనముగాని లేనందున హిందువులు సికిందరాబాదులో 21 దినములు నివాసము చేసి పెండ్లిచేసికొని వచ్చిన మన రాష్ట్రములో కూడ అవి చెల్లును. (వివాహము అంతర్జాతీయ శాసనము (international law) లో చేరి నది. కాని ఏదేశమందే పద్ధతులున్నవో ఆ పద్ధతులు లేకున్నను చెల్లవలసి యుండును.)

కావున మన రాష్ట్రములో సివిల్ మ్యారేజి శాసనము చేసిన తప్పుకాజా లదు. ఇట్టి యవకతవక లెన్ని యేని మన నేటి "హిందూలా" లో ఏర్పడు చున్నవి. హిందూ సంఘమువారు ఇట్టి సమస్యలపై శాంతబుద్ధితో, సమబుద్ధితో, దూరదృష్టితో, ఆధునిక పరిస్థితులను దృష్టి పథమున నుంచుకొని ఆలోచించి ఆందోళనము చేసి, మార్పులు గావించి, తమ సంఘమును, తమ స్త్రీలను వారి గౌరవమును, తమ గౌరవమును సంరక్షించుకొందురని యుద్బోధించుచున్నాను.

# ఆయుర్వేదము

"ధర్మార్థకామ మోక్షాణాం
ఆరోగ్యం మూలకారణం"
"సర్వమన్యత్పరిత్యజ్య శరీరమనుపాలయేత్".

ఆర్యులారా !

నన్నీ మహాసభకు అధ్యక్షునిగా ఎన్నుకొనినందులను కృతజ్ఞుడను.[1] నేను వైద్యుడను కానని మొదలే మనవి చేసుకొనుచున్నాను. అయితే వైద్య మహాసభ కధ్యక్షుడనగుట కేమికారణమని విచారింపవచ్చును. అది నాకు మాత్రము తెలియదు. ఆహ్వాన సంఘము వారేకగ్రీవముగా తీర్మానించి నన్ను అంగీకరించుటకై ప్రోద్బలము చేసినది మాత్రమే నాకు తెలియును. ఏది యెట్లున్నను నేను ఆయుర్వేదమం దత్యంతాభిమానము కలవాడ నగుటచేతను చారిత్రిక విమర్శనమందు ఒక విద్యార్థి నగుటచేతను, ప్రపంచమందంతటను అత్యంత ప్రాచీనమైనదియును, ఉత్కృష్టమైనదియును, రాజులకే కాక బీదలకును సులభముగా లభ్యమైనదియును నేటి ప్రపంచములో నుండునట్టి యూనానీ, అలోపాతిక్ వంటి వైద్యముల కన్నింటికిని మాతృ స్థాన మైనట్టిదియునగు ఆయుర్వేద వైద్యమును గురించి నాకును కొంత కొంతయైనను మాట్లాడుటకు స్వత్వము కలదని తలచుచున్నాను.

పాశ్చాత్యులకు అందు ముఖ్యముగా—ఇంగ్లీషు వారికి గ్రీకులు (యవనులు) అనిన చాల అభిమానము. గ్రీకులే యావద్యూరపు ఖండమునకు జ్ఞాన భిక్ష పెట్టిన వారని వారి యభిప్రాయము. కాని యీ గ్రీకులకు మొదలు జ్ఞానభిక్ష పెట్టిన హిందూస్థానపు హిందూ బౌద్ధులనెవ్వరును స్మరింపరు. గ్రీకుల రేఖా గణితమునకు మూలము హిందూ శాస్త్రములే! అదేవిధముగా గ్రీసుదేశమందు

---

1. నిజాం రాష్ట్ర ప్రథమాంధ్ర ఆయుర్వేద మహాసభ (నిజామాబాదు)లోని అధ్యక్షోపన్యాసము.

బౌద్ధులచే మత ప్రచారము బాగుగా గావింపబడెను. గ్రీసుదేశములో క్రీస్తునకు 450 సంవత్సరముల పూర్వమందుండిన హిప్పోక్రటీసు అనునతడు "వైద్యపితామహుడు" (Father of medicine)గా పరిగణింపబడెను. ఈ హిప్పాక్రటీసు స్వయముగా భారతదేశమునకు వచ్చి ఆయుర్వేదవైద్యము నభ్యసించి తిరుగా తన దేశమునకు వెళ్ళి వైద్యమందు మహా ప్రసిద్ధుడయ్యెను. అలెగ్జాండరు క్రీ పూ. 330 సం. ప్రాంతములో హిందూస్థానముపై దండెత్తి వచ్చినపుడు హిందువుల నాగరికతను వారి యద్వితీయ శాస్త్ర ప్రతిభనుగాంచి దిగ్భ్రమ జెందెను. అతడు తన గుడారములలో హిందూ వైద్యులనే తన గ్రీకు వైద్యుల చేతగానట్టి జాడ్యముల చికిత్సలకై నియోగించెను.

ఈజిప్టు దేశము (మిశ్రదేశము) లో ఇమోతెప్ (Imothep) అను నతడత్యంత ప్రాచీన కాలములో (God of Healing) వైద్యనాథుడుగా ప్రఖ్యాతుడయ్యెను. ఇతడును ఆయుర్వేదమును అభ్యసించినందుననే యట్టి ఖ్యాతిని గాంచగలిగెను.

హిందువులకు అత్యంతముగా బాకీపడిన జాతులలో ముఖ్యమైనట్టిది అరబ్బీ జాతి. అరబ్బీ స్థానములో ఇస్లాం మతము వ్యాప్తినొందిన తర్వాత అరబ్బులందు జ్ఞాన దృష్టి యతిశయించెను. అట్టి పిపాసులను జ్ఞాన దాన ధారలందు నోలలాడించినది భారతీయార్యులు. అరబ్బులు హిందువులనుండి గణిత శాస్త్రములను, జ్యోతిశ్శాస్త్రమును నేర్చుకొనుటయే గాక ఆయుర్వేద వైద్యమును పూర్తిగా నేర్చుకొనినట్లు అరబ్బుల చేతనే వ్రాయబడిన చారిత్రకాధారములు కలవు. కితాబుల్ ఫెహిరిస్త్ అను గ్రంథమును నదీం అను మౌల్వీ క్రీ.శ. 950లో వ్రాసెను. అందు అరబ్బీ భాషలోనికి హిందూ వైద్యశాస్త్రములు మన్సూర్ ఖలీఫా కాలములోనుండి మామూన్ ఖలీఫాకాలము వరకును (750-850 క్రీ.శ.) అనువదింపబడెనని వ్రాసినారు. మరియు క్రీ శ. 1300 ప్రాంతములో నుండిన హాజీఖలీఫా అనుపండితుడును అరబ్బులు హిందువులవద్ద వైద్య శాస్త్రముల నభ్యసించిరని అంగీకరించియున్నాడు. ఈ అరబ్బుల ద్వారానే యూరోపు ఖండమంతటను ఆయుర్వేదౌషధ పద్ధతులు విశేషముగా వ్యాపించిపోయెను. ఖలీఫా హారూరుల్ రషీద్ అరేబియన్ నైట్సు కథలకు కారకుడని మాత్రము జగత్తులో ప్రసిద్ధిగాంచెను. కాని యతడే ఆయుర్వేదవ్యాప్తికిని ముఖ్యకారకుడని ప్రపంచ

మంతగా నెరుగదు ఈ ఖలీఫాకు ఒకతడవ గొప్ప జాడ్యము సంభవింప తన యాస్థానపు హకీములచే కుదరింపరానిది కాగా "మంఖుడు" అను హిందువు అతని చికిత్సచేసి బాగుచేయగలిగెను. అటుతర్వాత ఈ మంఖుడు రాజ వైద్య శాలకు (Royal Hospital) ప్రధానాధికారిగా నేర్పాటు చేయబడెను. ఈ మంఖుడే సుశ్రుతమును అరబీభాషలోనికి పరివర్తనముచేసెను. ఇతనివంటి పండితు లెందరో ప్రీతి పూర్వకముగా ఖలీఫాలచే ఆహ్వానింపబడి వారి యాస్థానమందు గౌరవింపబడు చుండిరి. వాగ్భటము క్రీ. శ. 8 వ శతాబ్దములో అరబీలోనికి అనువదింపబడెను.

ఈనాడు భారతీయులు తమ విద్యాభ్యాసము ముగిసిన తర్వాత అధిక జ్ఞానార్జనార్థమై ఇంగ్లాండు దేశమున కెట్లేగుదురో ప్రాచీనకాలములో అరేబియా నుండి, బాగ్దాదునుండి, గ్రీసునుండి, పర్షియానుండి, చీనానుండి, కాంబోడియానుండి, జాఫా (యవ), బోర్నియో, సుమిత్రా ద్వీపములనుండి విద్యార్థులును, పండి తులును భారతభూమిలో కొంతకాలము నివసించి జ్ఞానార్జనము చేసుకొని వెళ్ళు చుండిరి. విజయనగర సామ్రాజ్య కాలములో ఆంధ్రులు వైద్యశాస్త్రమును అపారముగా వృద్ధిపరచియుండిరి. అట్టి యాంధ్రులవద్ద వైద్య విద్యాభ్యాసము చేయుటకై అరబ్బులనేకులు వచ్చియుండినది సులేమాన్ అను అరబ్బువర్తకుడు కన్నులార చూచి వ్రాసియున్నాడు.

మహమ్మద్ ఘజనీ 17 మారులు హిందూస్థానముపై దండెత్తి వచ్చి ఎదుటపడినవారిని చంపి, దొరికినదంతయు దోచుకొని పోయినవార్త చరిత్రలో వ్రాసిరి కాని అతడు హిందూ శిల్పులను, పండితులను, వైద్యులను, బలవంతముగా పట్టుకొని తన వెంట తీసుకొనిపోయి తన దేశములో నిలిపిన విషయము చరిత్రల కెక్కకపోయెను.

చీనా దేశమునుండి మనదేశమునకు వచ్చిన హ్యూన్‌సాంగ్ మున్నగు యాత్రికుల పేరులు సుప్రసిద్ధమే కాని వారివలెనే చీనాకు దక్షిణా పథమందలి కాంచీ నగరమునుండి క్రీ శ. 648 లో వెళ్ళిన నారాయణస్వామి అను బౌద్ధ వైద్యుని పేరెవ్వరును ఎరుగరు. అతడు తన మాతృదేశమునకు వచ్చి మరల రెండవమారు చీనాకు క్రీ శ. 657 లో వెళ్ళనని ఇటీవలనే గంగూలీగారు పరిశో

ధించి వ్రాసిరి. ఇదే విధముగా క్రీ.శ. 665 లో "లోకాదిత్యుడు" అను వైద్యుడు చీనాకు వెళ్ళెను. ఈ యిరువురును దీర్ఘాయుష్యము నిచ్చు నౌషధములను కనిపెట్టుటకై చీనాకు వెళ్ళినట్లు తెలిసెడి పై యిరువురును ఆంధ్రులేనో యేమో!

క్రీస్తు శకారంభమందుండిన సుప్రసిద్ధుడగు నాగార్జునుడు ఆంధ్రబౌద్ధుడు. అతడు యావద్భారతమందు అద్వితీయుడని ప్రతీతిగాంచిన పండిత ప్రకాండుడు. మంత్రశాస్త్రములో అతనిదే పేరు. వైద్యములో నతడు ప్రచండుడని భారత దేశమందే కాక చీనా దేశమందును కీర్తి వ్యాపించి పోయెను. చీనావారతని వైద్య గ్రంథములను తమ భాషలోనికి (క్రీ శ. 589, 618) లో తర్జుమా చేసుకొనిరి. నాగ, అర్జున, అను పదములకు సమానార్థములనిచ్చు లూంగ్‌షూ (అనగా ఏనుగు వృక్షము) అను పదముచే నీతని సంబోధించిరి. తాంత్రికుల రస వాదమును గూడ చీనావారు "చిపో" (శివ) ప్రోక్తమగు వైద్యము" అనుపేరుతో గ్రహించిరి.

ఇట్లు పడమట యవన (గ్రీసు) ద్వీపము వరకును తూర్పున యవ (జావా) ద్వీపము వరకును ఉత్తరమున చీనా సామ్రాజ్యమువరకును ఆయుర్వేద వైద్యము తన చల్లని చంద్రికల వ్యాపింపజేసి తమోనాశనమును గావించి ప్రపంచ కల్యాణమున కత్యంతముగా తోడ్పడెను.

ఆయుర్వేదమేనాడు సృష్టిచెందెను? అను ప్రశ్నకు సమాధానమిచ్చుట కష్టము. ఏలన ఋగ్వేదమందే ఆయుర్వేద వైద్య ప్రశంసలు కలవు. అశ్వినీ దేవతలు నానావిధ చికిత్సలు చేయుచుండినట్లు వర్ణనలు వేదములందు గలవు. మరియు ఆయుర్వేదము ఋగ్వేదముయొక్క యుపాంగముగా పరిగణింపబడి యున్నది. ఎందరో ఋషులు వైద్యాభివృద్ధికి తోడ్పడి పరిశోధనలుచేసి నూతన చికిత్సను వ్యాప్తిలోనికి తెచ్చిరి. తర్వాత ధన్వంతరియనువారు దేవదానవుల యమృత మథనమందు అమృత కలశ హస్తుడై పాలసముద్రమం దుద్భవించెనని భాగవత పురాణము చెప్పుచున్నది. ఈ ధన్వంతరి ఆయుర్వేదమునకు ప్రధాను లలో నొకరని మాత్రము చారిత్రకులును అంగీకరింతురు. కాని వీరి కాలమును నిర్ణయించుట కష్టము. కొందరి చరిత్రకారుల యభిప్రాయమున సుశ్రుతుడు ఈ ధన్వంతరికి శిష్యుడు. ఆయుర్వేదములో ధన్వంతరికి పిమ్మట చరకునికిని,

సుశ్రుతునికిని అగ్రస్థానము నిచ్చియున్నారు. ఆయుర్వేదములో ప్రత్యేకాభిమానముతో పరిశోధనలు చేసినట్టి కెప్టన్ జాన్‌సన్ సెయింట్ అను పండితుడు చరక సుశ్రుతులను గూర్చి యిట్లు సెలవిచ్చెను.

"బహుశా వీరు క్రీస్తుకు పూర్వమే 2000 ఏండ్లనాటి (B C.) వారేమో! వీరి యనంతరము యెన్నియో శతాబ్దముల తర్వాత నుండిన యూరపు ఖండ వైద్యులు జాడ్య చికిత్సలకు మంత్రతంత్ర ప్రయోగములను చేసి మూర్ఖ విశ్వాసములకు లోనై యుండగా ఈ చరక సుశ్రుతులు తమ తమ గ్రంథములలో అట్టి వాని కేమియు తావీయక యుత్తమ విషయ పరిజ్ఞానముతో కూడిన వైద్యమును ప్రపంచమున కర్పించిరి."

**"The knowledge they displayed in their works is amazingly orthodox in view of modern research and was singularly free from the superstition and magic, two heresies which characterised the writings of the European so called physicians many centuries after-wards."**

మరికొందరి యభిప్రాయమున చరకుడు క్రీ. పూ. 600 ఏండ్లనాడును, సుశ్రుతుడు క్రీ. శ. 100 ఏండ్లనాడును నుండిరని నిర్ణయింపబడినది. వీరిరువురు పాంచాల (పంజాబు) వాసులనియు చారిత్రికులు నిర్ణయించినారు వీరి తర్వాత ప్రసిద్ధిగన్నవారిలో సింధు ప్రాంతీయుడైన వాగ్భటుడును (క్రీ.శ. 700) రాజపుత్రస్థానీయుడగు శార్ఙ్గధరుడును (క్రీ శ. 13E0) విజయనగర సామ్రాజ్యమందుండిన విష్ణుదేవుడును (క్రీ శ. 1350) ముఖ్యముగా పేర్కొనతగినవారు.

అశోక చక్రవర్తి కాలమునకు పూర్వమే (క్రీ. పూర్వము మాడుశతాబ్దములకు ముందే) భారత దేశములో మనుష్యులకేకాక జంతువులకు సహితము వైద్యాలయము లుండెను. ప్రపంచములో మొట్టమొదట ప్రజోపయోగార్థమై ఉచిత వైద్యాలయములు భారతదేశమందే హిందువులచేతనే స్థాపింపబడెను. ఏనాడు హిందూస్థానములో పశువులకును వైద్యాలయములుండెనో ఆనాడు యూరోపులోని రోము, గ్రీసు దేశములుతప్ప తక్కిన దేశములం దంతటను జనులు అర్ధనగ్నులై, అటవికులై, మొరటువారై, పశుప్రాయులై సంచరించు

చుండిరి. యూరోపుదేశములో మొట్టమొదటి ఆసుపత్రి (Hospital) క్రీస్తుశకము నాల్గవ శతాబ్దమందు కాన్‌స్టంటైన్ పోపుకాలములో స్థాపింపబడెను.

శస్త్రచికిత్సను (Surgery) మన వారు శల్యతంత్రమనిరి! దీనిని కనిపెట్టినది మొట్టమొదటివారు హిందువులే. సుశ్రుతుడు గొప్ప శల్యతంత్రవేత్త. మన వైద్యములో 127 చికిత్సా శస్త్రములను పేర్కొనియున్నారు. క్రీస్తు శకారంభమువరకే శల్యశాస్త్రము పరిణతినొందియుండెను. భారత యుద్ధమునాటికే యాశల్యతంత్రము సుప్రతిష్ఠితమై యుండెననిన తప్పుకానేరదు. కాని బ్రాహ్మణులలో వర్ణాశ్రమాచారములు ముదిరినప్పటినుండియు బౌద్ధుల యహింసాసిద్ధాంతము వ్యాపించిపోయిన నాటినుండియు నీశల్యతంత్రము మూలబడిపోయెను

పాదరసమును ఔషధముగా సేవించుటను మొట్టమొదట కనిపెట్టినది హిందువులే. పాదరసమును ఇతరలోహములను కడుపులోనికి మందుగానిచ్చు హిందువుల పద్ధతులను అరబ్బులుచూచి అబ్బురపడిరి.

త్రిఫలములను గ్రీకులు అమాంతముగా త్రిఫర (Tryphara parva) అనుపేరుతో తమ వైద్యములోని కెక్కించుకొనిరి.

హిందూ రసాయనశాస్త్రమును క్రీ.శ. 800 ప్రాంతమందుండిన అరబ్బీయుడగు గెబిర్ అనువాడు బాగుగాసాధించెను. హిందువుల సజ్జక్షారమును లేక సజ్జమిత్తిని (carbonate of soda) సజిమన్‌విత్రి అని పేరిడెను.

క్రీ.శ. 1374 లో వ్రాయబడిన మదనపాల నిఘంటులో సత్తును (zinc) ఒక ప్రత్యేక లోహముగా పేర్కొనియున్నారు. ఈ గ్రంథము వ్రాసిన 200 ఏండ్ల తర్వాత పుట్టిన పారాసెల్సస్ (Paracelsus) అను యూరోపియన్ ఈ లోహమును మొట్టమొదట కనిపెట్టెనని పాశ్చాత్యులు పొగడజొచ్చిరి.

ఇట్లు ఇంచుమించు 4000 ఏండ్లనుండి ఆయుర్వేదవైద్యము ప్రపంచమందు—అందుముఖ్యముగా — భారతదేశమందు చెల్లివచ్చుచుండగా ఈనాడు దీనికి విదేశములందే కాక స్వదేశములోను నిరాదరణ మధికమైయున్నది. ఏమి చిత్రమోయేమో జాతి మత దేశ కాలభేదము లెరుగని "అమ్మలగన్న

యమ్మ"యగు ఆయుర్వేదవైద్యము ఈనాటి మతభేదవాదుల (communal) గురికి లోనైయున్నది. బ్రిటిషిండియాలో యూనానీ, ఆయుర్వేదములు రెండును సమానముగా నిరాదరణమునకు పాత్రములై యుండగా నిజాం రాష్ట్రములో ఆయుర్వేదము మాత్రమే సంపూర్ణనిరాదరణమునకు లోనై యున్నది. ఈ సంవత్సరమే ప్రభుత్వమువారు తమ అంచెనాపట్టికలో ఆయుర్వేదానికి 35000 రూపాయలు మాత్రము ప్రత్యేకించినారు. పాశ్చాత్యవైద్యముపై సాలీనా సుమారు 40 లక్షలు వ్యయము చేయుచున్నారు. యునానీ వైద్యముపై అపారముగా వ్యయము చేయుచున్నారు. ప్రతి తాలూకాలో యునాని వైద్యాలయముల స్థాపించి హకీముల నేర్పాటుచేసినారు. కాని ఆయుర్వేద వైద్యమో! అది అనాథయైపోయినది. కావున యీ 35000 రూకలు మాత్రము ఏ పాటిసాయము చేయగలవు. ఇది కన్నీటి తుడుపుగానున్నది.

యూరోపు ఖండములో నిన్న మొన్నటివరకు అనగా 19 వ శతాబ్దారంభమువరకు వైద్యము వట్టి మొరటుపద్ధతిపై నుండెను. పెట్టిగ్రూ Pettigrew అనునతడు క్రీ. శ. 1844 లో తాను వ్రాసిన గ్రంథములో నిట్లు వ్రాసినాడు.

> "In Europe so late as the 15th and 16th centuries diseases were regarded as punishment of God and the intervention of Priests was requisitioned instead of a doctor."

క్రీ.శ. 15· 16 శతాబ్దములలో సహితము యూరోపులో జాడ్యములు అధిదైవికములని భావింపబడుచుండెను. తచ్చికిత్సలకై వైద్యుల బిలుచుటకు మారుగా పూజారులను బిలుచుచుండిరి.

అట్టి యూరోపులో ఒక నూరు సంవత్సరములలోపలనే గావింపబడిన వైద్యాభివృద్ధి అద్వితీయము, అనిర్వచనీయము. వైద్యమొక ముఖ్యశాస్త్రముగా (science) పరిగణింపబడి, క్రొత్తక్రొత్త పరిశోధనలను పాశ్చాత్యులు ప్రతిదినము చేయుచున్నారు. ఇప్పుడు మన మీ శ్రద్ధను వారినుండియే గుణపాఠముగా గ్రహించవలసియున్నది.

కావుననే నీ సందర్భమున ఆయుర్వేదవైద్యులతో నాకు తోచిన కొన్ని సలహాలను మనవి చేసుకొనుచున్నాను. అందు తమదృష్టిలో మంచివని భావించిన వానినే గ్రహింతురుగాక.

1. మధ్యకాలములో ఆయుర్వేదమునకు క్షీణదశ ప్రాప్తించెను. ఓషధీ పరిశ్రమలు తగ్గిపోయెను. నూతన పరిశోధనలు చేయువారలు లేరైరి. ఇందుకు తోడుగా జోతిశ్శాస్త్రము, భూతవైదము, మంత్రశాస్త్రము బయలుదేరెను. జాడ్యములకు మందులే ప్రధానముగాని నక్షత్రములు వక్రించుట, మంత్రోచ్చాటనము చేయుట పూర్తిగా అప్రధానములని గ్రహించవలెను. ఆధునికుల కందలి విశ్వాసములు పోయినవి. కావున వైద్యులు చికిత్సనే ప్రధానముగా నెంచవలెను.

2. పాశ్చాత్యులు మన ఔషధములను విశేషముగా తమ వైద్యములోనికి తీసికొనినారు. అదేవిధముగా మనమును పాశ్చాత్య వైద్యములోనేకాక యూనానీవైద్యములోను, ఏయేవిషయములు విశిష్టత నొందినవో వానిని తప్పకుండ గ్రహించవలెను. పాశ్చాత్యవైద్యములో శస్త్రచికిత్స అపారముగా వృద్ధినొందినది. ఆయుర్వేదవైద్యులు తమ శస్త్రవైద్యములో లేని విషయములను పాశ్చాత్యులవద్ద నేర్చుకొనవలెను. ప్రభుత్వానుమతిని బొంది శవములపై శస్త్రవిద్య నభ్యసించవలెను. ఆయుర్వేదపాఠశాలలు పాశ్చాత్య యూనానీ వైద్యములలోని ముఖ్యవిషయములను పాఠ్య ప్రణాళికలో చేర్పించవలెను.

3. అరబ్బు లే ప్రకారముగా మన వైద్యగ్రంథములను తర్జుమాచేసికొనిరో ఆదే విధముగా ఆయుర్వేదవైద్యములోనికి అలోపాతిక్, యూనానీ వైద్యములలోని యుత్తమ విషయములనన్నింటిని పరివర్తనము చేసికొనవలెను. సంస్కృతములోనుండు ఉత్తమ వైద్యగ్రంథములను దేశభాషలలో ననువదింపజేయవలెను. మరియు పరస్పర భిన్నముగానుండు చికిత్సలలో నేది సత్యమో యేది అప్రతిష్ఠితమో నిర్ణయించి వ్యాఖ్యానములు వ్రాయవలెను.

4. అనేకులు కొన్నికొన్ని ప్రత్యేకచికిత్సల నెరిగియున్నారు. కాని వారనిపరమ గోప్యములుగా నుంచుకొని యెవరికిని జెప్పక తాము నష్టపడుచున్నారు.

దేశమునకును నష్టము కలిగించుచున్నారు సర్వోపయోగార్థము వైద్య సంఘమువారు అట్టి చిట్కాలను బయలు పరచుచుండవలెను.

5. వైద్యము రానివారును సంగీతము రానివారును లేరని యొకసామెత. మన దేశములోపల్లెలలో నేటికిని ఆయుర్వేద వైద్యమందు జనులకున్నంత యభిమానము విశ్వాసము యితర వైద్యములపైనలేదు అట్లుండినను అనేకులు ఆయుర్వేద వైద్యులు సరియైన వైద్యజ్ఞానమును సంపాదించుకొనకపల్లెలలో తప్పుడు చికిత్సలు చేయుచు జనులకు నష్టముకలిగించు చున్నారు. తత్ఫలితముగ వారమందు లేకున్నను వారి దౌర్బల్యముచేత ఆయుర్వేద వైద్యము నిందులకుపాలైనది. పూర్వమందును ఇట్టి అడ్డాదిడ్డి వైద్యులను (Quacks) గురించియే సంస్కృత వాఙ్మయములో అనేక చాటూక్తులు బయలుదేరెను.

"వైద్యోహం వైద్య రాజోహం సర్వవ్యాధి సమన్వితః
యంయం స్పృశామి హస్తేన క్షణార్థం సనజీవతి"
"చితాం ప్రజ్వలితాం దృష్ట్వావైద్యోవిస్మయ మాగతః
నాహంగతో నమేభ్రాతా కస్యేదం హస్తలాఘవం"
"వైద్యః క్రూరోయమః క్రూరోవైద్యః క్రూరో యమాదపి
యమోహరత్య సూనేవ వైద్యస్తు సవసూనసూన్"

కావున అనుభవములేనట్టియు శాస్త్రపరిజ్ఞానము లేనట్టియు ఉదరంభరులగు మోటువైద్యులు ఇక మీదట నాటు వైద్యము చేయకుండినట్లుగా వైద్య సంఘమువారు ఆలోచనలుచేసి మార్గము లరయవలెను.

6. అనాదృతమైన వైద్యము నుద్ధరించుటలో మన వైద్యులపై అత్యంతమగు భారము కలదు. ఈ భారము నిర్వహించుకొనుటకు వివిధ వైద్య సంఘములలో ఐకమత్యత చాల అవసరము. ఈర్ష్య, అసూయ, ద్వేషములు ప్రబలిన ఆయుర్వేద వైద్యమునకు నష్టమగుటయేం కాక వైద్యులును చాల నష్టములకుగురియగుదురు.

బ్రిటిషిండియాలో ఆయుర్వేద వైద్యులు పట్టుదలతో శ్రద్ధతో కృషిచేసి ఆయుర్వేదాభివృద్ధికి తోడ్పడుచున్నారు. నిజాం రాష్ట్రమందలి ఆయుర్వేద వైద్యులిప్పుడిప్పుడు మేల్కొనుచున్నందులకు సంతోషము. వీరియుద్యమము దినదినాభివృద్ధినొంది లోకకల్యాణమున కుపయోగపడు గాక అని పరమేశ్వరుని ప్రార్థింతును.

# గుర్రము

తెనుగుకవులు కొందరు స్రామాణితేజీ లేక సాంబ్రాణితేజి అని గుర్రానికి పర్యాయపదముగా వాడినారు. ఇది శ్రీనాథుని కాలమునుండి మన సారస్వతములో కానవస్తున్నది. అంతకుపూర్వపు కవుల రచనలలో లేనట్లు నాకు జ్ఞాపకం. తిక్కన ఎక్కడా ఈ పదాన్ని వాడినటుల నాకు తెలియదు. క్రీ. శ. 1450 ప్రాంతము వాడగు గౌరన "రవణించి దాటు సాంబ్రాణితేజీలు" అని గ్రంథాదిలోనే వర్ణించినాడు. ఈ స్రామాణి పదమెక్కడిది ? ఇదియు ఖురాన్, తుర్క్, గుజ్జరి (గుజరాత్) సింధువంటి అశ్వోత్పత్తి స్థానమైయుండునని యూహించినాను. ఈరాన్, (పర్షియా) దేశము గుర్రాలకు చాలా ప్రసిద్ధి కలదై యుండెనని తెలుపనయినది. ఆ దేశమందే "సమరాన్" అను నొక ప్రదేశముకలదు. అది యీరాన్‌లోని దగుటచే విజయనగర స్రామాజ్య కాలములో ఆ సమరానునుండి విశేషముగా గుర్రముల దిగుమతియై యుండును. సమరాన్ సంబధ హయము లగుటచే వాటికి స్రామాణిలను పేరు వచ్చెను. స్రామాణితేజీలు అనుటచే తేజీ పదమును గూడ తెలుసుకోవలెను. తేజ్‌గా వేగముగా పోవునవి తేజీలై యుండుననవచ్చును. "తాజీ" అనుపదము అరబీలో కలదు. ఉత్తమాశ్వమును అరబీలో తాజీ గుర్రమందురు. సాదీగులిస్తాన్ చదివినవారికి "అస్పెతాజీ గర్‌జయీాఫ్ బువద్" అనే పద్యము స్ఫురణకు రాగలదు. "అస్పెతాజీ" అన అశ్వోత్తమము అని యర్థము, కావున తాజీ పదము మనలో తేజీ యయ్యెనేమో !

నా వద్ద "ఫరస్‌నామా'' అను అముద్రిత లిఖిత పార్సీ ప్రాచీన గ్రంథ ఈ మున్నది. దాని పీఠికలో ఇట్లు వ్రాసినారు.''సుల్తానుమహమూదు గజనవీకాలానికే సంస్కృతాశ్వశాస్త్రము ప్రసిద్ధి నొందినది. హుమాయూన్ చిత్తోడును ధ్వంసించినప్పుడందు కొన్ని పెట్టెల పుస్తకాలు ''మాలెగనీమత్'' లూటీగా దొరికెను. అందు సంస్కృతాశ్వశాస్త్ర మొకటి యుండెను. అది చాలా యుత్తమ గ్రంథము. దానినే యిప్పుడు షాజహాను చక్రవర్తికొరకు భాషాంతరీకరిస్తున్నాను.'' ఈ పార్సీ

గ్రంథానికి పీఠిక చాలా విపులముగా కలదు అందు గుర్రము జంతుజాతిలో ఉత్తమ మనియు, "గాజీ" లకు గుర్రమే ఉత్తమ వాహనమనియు, రాజులకు గుర్రాలే జయమునిత్తువనియు, అవి లేని రాజు నాశనమగుననియు, గుర్రాలు కచ్ఛ (గుజరాతువద్ద) దేశమందును, అరబ్, ఈరాక్, తుర్కీదేశాలలోను లభించు ననియు, ఇంకా చాలాచాలా విషయాలు వ్రాసినాడు. ముసల్మానులు గుర్రము యొక్క ప్రాముఖ్యమును బాగా యెరిగినందుననే హిందువులను జయింప గలిగిరను నాభావమా గ్రంథము చూచినతర్వాత స్థిరపడినది. ఈ గ్రంథాన్ని పూర్తిగా తెనుగులో తర్జుమాచేసి మంచి పీఠికతో ప్రచురించిన చాలా యోగ్యముగా నుండును. ఆ విధముగా చేయించు దాతలు దొరకుదురా ? ఈ గ్రంథాన్నిగురించి ప్రత్యేక వ్యాసమవసరమగును. కాని సూచించి విడిచినాను.

ఆంధ్ర మహాభారతములోని ఆదిపర్వాష్టమాశ్వాసములో "చిత్రలలిత గతి నొప్పు నేనూరుగాడిదలను, సింధుబాహ్లిక కాంభోజ, పారసీక జాతమైన తురగ శతసహస్రము" అన్నారు. సంస్కృత మూలములో ఒక బాహ్లికమే కలదు. తక్కిన పదాలన్నీ నన్నయ సృష్టియే. వారి కాలములోని గుర్రాల దిగుమతులను వారు సూచించినారనుకోవచ్చు. ఈ యుదాహృతపంక్తి బహువిశిష్టతకలది. భారత మును సంస్కరించిన పెద్దలు తాళ్ళపాకవారి కవిత్వం కొంత, నా పైత్యంకొంత అన్నట్లు తమకిష్టమువచ్చినట్లు దిద్ది అపచారము చేసినారు. ఈ యుదాహృత పంక్తిలో గాడిదలు అన్న పదము అంటరానిదగుట చేత అర్జునుని పెండ్లిలో గాడిదలను కానుకలిచ్చినట్లుగా చెప్పితే తప్పగునని గాడిదలను "గాడీలు"గా మార్చి అచ్చువేసిరి. సంస్కృతమూలములో గాడిదలకు "అశ్వతరి" కంచర గాడిద అను పదం వాడిరి. అది మన సనాతనభారత సంస్కర్తలకు కొద్దిగా మేలు రకమగు మాటకదా! "ఏనూరు" అను పదమునుగూడ గమనించండి. నూరు అనే మాట మోటని ఉత్తర సర్కారీ సోదరులు తెచ్చిపెట్టిన "వంద" అనే ప్రాచీనులు వాడని మాటనుపలువురు మంచిపదమనుకొని అదేపనిగా వాడుతారు. నాకు తెలిసి నంతవరకు మహాభారతములో ఎచ్చటనూ "వంద" అను పదము వాడలేదు. ఇతర ప్రాచీన కవులును వాడినట్లు కానరాదు.

ఇంత వ్రాసినను గుర్రము అనే పద మెట్లేర్పడెనో తెలిసినది కాదు. అశ్వశాలకు తబేలాకు పేరులు యిట్టివి కలవు.

"సాహిణమన, బాగాయన, వాహోగారంబునకును వర్తిలు పేళ్ళు" గుఱ్ఱపు సాలెలకు (సాహిణములకు) అధికారి సాహిణి. పూర్వము కొందరు రెడ్డిముఖ్యులు సాహిణులై యుండిరి. ఆంధ్రులలో రెడ్లు, తర్వాత విజయనగర రాజులు గుఱ్ఱాల సైన్యమును దిట్టముగా నిలిపినట్టివారు.

"జక్కి, మావు, గుఱ్ఱము, తేజి, యెక్కిరింత తత్తడి, రవాలు, నడగడు, కత్తలాని తురికి, బాబా యనగనొప్పు తురగమునకు" అని సాంబ నిఘంటురో తెలిపినారు.

ఇందు జక్కియను పదమును గూర్చి విచారింతము. జక్కి మోర వేలుపు అనగా గుఱ్ఱపు మూతి వేలుపు. అనగా కిన్నరుడు. గుఱ్ఱము మూతివారు ప్రపంచ సృష్టిలో లేరు. అయితే గుఱ్ఱాలెక్కువగా నుండు దేశము వారని యర్థము చేసుకోవచ్చును. జక్కులను యక్షులనియు అందురు. జక్కులు (యక్షులు) కిన్నరులు వేరే కాని ఉభయులును ఈరాను కుత్తర ప్రాంతాల వారను కొందును. పూర్వము అక్షస్ నదికి జక్సార్టీస్ అనియు పేరుండెను. జక్సాశబ్దము నకు కూడా యక్ష శబ్ద సామీప్యము కలదు. యక్షులు ఆ ప్రాంతీయులై యుందురు. గుఱ్ఱాలున్నూ ఆ ప్రాంతమందే హెచ్చు. అందుచే జక్కిశబ్దమేర్పడి యుండును.

గుఱ్ఱాలను గురించి ఇంగ్లీషులో చాలా గ్రంథాలు వ్రాసినారు. గుఱ్ఱపు జాతులు, వాటి పెంపకము, వాటి శిక్షణము, వాటి నడకలు, మున్నగు వాటిని గురించి పటములతో సహా బహుగ్రంథాలు వ్రాసి ప్రకటించినారు. గుఱ్ఱాల రోగాలను గురించి వాటి చికిత్సలను గూర్చియు చాలా వ్రాసినారు. కాని మనలో అట్టి గ్రంథాలు కానరావు. తెనుగులో రెండు అశ్వశాస్త్రిలను పదకావ్యాలుగా వ్రాసినారు. మనవారు చరిత్రలనే వాటిని శకునాలను గణితములను, సాముద్రిక మును, జ్యోతిషమును, శిల్పమును, వైద్యమును, రత్న పరీక్షలను — అన్నింటిని — పద్యాలలో వ్రాసినటులే అశ్వశాస్త్రిన్ని గూడా పద్యాలలో వ్రాసినారు. ఈ రెంటిలో ఒకటి మనుమంచిభట్టు అనునతనిచే ఇంచుమించు 400 ఏండ్ల క్రిందట వ్రాయబడినది. అదియు నసమగ్రమైనది. కర్నూలు జిల్లా వాడు దాన్ని రచించెను. వీటిలో గుఱ్ఱము సుళ్ళు, లక్షణాలు విశేషముగా వర్ణింపబడినవి. వాటివలన కలిగే లాభము కానరాదు. గుఱ్ఱాలకు రోగాలువస్తే

నాటువైద్యులు తమకు తోచిన మందిత్తురు. పూర్వము తెనుగుదేశములో గుర్రాలపై సరకులు మోపి రవాణా చేస్తూ వుండిరి.

పాశ్చాత్య యూరోపు దేశములోను, అమెరికాలోను, ఆస్ట్రేలియాలోను గుర్రాలతో సేద్యము చేయుదురు. ఉత్తర అమెరికాలోని ఉత్తర భాగాన ప్రసిద్ధియైన గుర్రాలు కలవు. పశుల కాపరులు వాటిపై గంతలుకూడా వేయక కళ్ళెము మాత్రమే తగిలించి సవారి చేయుదురు. అవి చాలా పెద్ద గుర్రాలు. పైగా అడవి గుర్రాలవలె సాధనకు ధాక వెనుక రెండు కాళ్ళపై నేటుగా ముందరి కాళ్ళెత్తి నిలబడుటయో లేక నాలుగు కాళ్ళెత్తి పై కెగురటయో, నేలపై పొరలుటయో, ఎన్నెనియో, దుడుకులుచేసి సవారికి లొంగనిపై యుండినను ఆ కాపరులు వాటి వీపులపై ఉడుములవలె కరుచుకొని యుండి వాటి సాధించి సవారీ చేయుదురు. ఆ కాపరులను ఇంగ్లీషులో కౌబాయిన్ అందురు. ఆస్ట్రేలియా ఖండములోని గుర్రాలు సామాన్యమైనవి కావు. అవి చాలా పెద్దవి, బలిష్ఠమైనవి, చాలా వెల గలవి. ఇంగ్లీషు వారును, ఫ్రెంచి జర్మనులును, రష్యావారును తమ యుద్ధావసరాలకై గుర్రాలపై కోట్లకొలది ధనమును వ్యయముచేస్తూ వుందురు. విమానములు, మోటారులు, ట్యాంకులు, వచ్చినను గుర్రాల ప్రాముఖ్యము తగ్గలేదు.

గుర్రముల యుద్ధ ప్రాముఖ్యమును గురించి ఫిర్దౌసీషాహ్నామాలో చాలా వర్ణనలు కలవు. జగత్ప్రసిద్ధి గాంచిన రుస్తుం మహావీరుని గుర్రము పేరు 'రక్ష్' ఆ గుర్రము పెద్దపులులతో కలబడి వాటిని చంపెడి దని షాహ్నములో వర్ణించినారు. ఫిర్దౌసీ కాలములో ముసల్మానుల విజృంభణము ముల్లోకములలో అనగా ఏషియా, యూరోపు, ఆఫ్రికా ఖండములలో విస్తరించుతూ వుండెను. వారిధాటి పెద్ద తుఫాను వంటిది. వారి జయము పరాజితులకు భూకంపము వంటిది. వారి మత సంస్కృతి ఇతర సంస్కృతులనెల్లను తుడిచివేస్తూ వేలాతిక్రమణముతో ప్రవహించెను. అట్టి కాలానికి వీరులగాథ అవసరమై యుండెను. ఆ యవసరములో ఫిర్దౌసీ పైకి వచ్చెను. షాహ్నామా రచించెను. రాజులు దానిని పురాణముగా పఠింపజేసిరి. సాధారణులు ఖహ్వాఖానాలలో (చా కాఫీ క్లబ్బుల వంటి వాటిలో) పాడించి వింటూ వుండిరి. ఆ కథలలో ఘోటీధాటి వర్ణన పరిపాటి విశేషముగా నుండెడిది. అట్టి వాతావరణమందు పెరిగి, అట్టి వీరావేశము

నెక్కించుకొని, అట్టి రుస్తుం, ఆదర్శాలతో గుర్రాలపై మన దేశమందు ముసల్మానులు విజయాలు పొందిరంటే దానికింత వెనుకరంగము (**Back ground**) ఉన్నదన్న మాట.

భారతీయ చారిత్రక రంగమున 'న భూతో న భవిష్యతి" అనిపించుకొన్న అసాధారణ మహాపురుషుడగు చాణక్యుడు (కౌటిల్యుడు - కుటల దేశస్థుడు) తన అర్థశాస్త్రమందు అశ్వాధ్యక్ష ప్రకరణమందు సూత్రపద్ధతిలో అనేక విషయాలను సూక్ష్మముగా తెలిపియున్నాడు. అభిలాషులా ప్రకరణాన్ని చదువుకొనవలసినదే. అయినను దానినుండి కొన్ని విశేషాలను మాత్రమిం దుదాహరింతును.

"అశ్వాధ్యక్షుడు గుర్రాల తరములను ఏర్పాటుచేయవలెను. (1) ప్రణ్యాగారికములు (అమ్మదగినవి) (2) క్రయోపాగతములు (కొనబడినట్టివి) (3) ఆహవలబ్ధములు (యుద్ధములో పట్టుకొనబడినవి.) (4) ఆజాతములు (దేశమందు పుట్టినవి) (5) సాహాయ్యకాగతములు (ఇతర మండలాలనుండి యుద్ధావ్యవసర సహాయానికై తీసుకొనిరాబడినవి) (6) పణస్థితములు (గిరవుగా నుంచబడినవి) (7) యావత్కాలికములు (తాత్కాలికముగా లాయములలో నుంచబడినవి)

ఉత్తమాశ్వముల ముఖముల పొడవు 32 అంగుళాలు, గుర్రము పొడవు - ముఖమంత అయిదంతలుండవలెను.

ఉత్తమాశ్వములకు ఈ క్రింది విధముగా తిండి పెట్టవలెను-2 ద్రోణాల దాణ బియ్యము కాని, గోధుమలు కాని, ప్రియంగువుకాని, ముద్గమాషము లుడికించి కాని పెట్టవలెను.

ఒక ప్రస్థము నూనె, 5 పలముల ఉప్పు, 50 పలముల మాంసము, 1 ఆఢకము రసము, 2 ఆఢకముల పెరుగు, 5 పలముల క్షారము (రుచికిగాను) 1 ప్రస్థము లేక రెండు ప్రస్థముల పాలు ఇయ్యవలెను మరియు 1 ప్రస్థము నూనెతో అనుపానము (ఎనిమా) చేయవలెను. 1 కుడుంబము నూనెను ముక్కుపై రుద్ద వలెను. 1000 పలముల నట్టుగడ్డిని, 2000 పలముల తృణమును మేత పెట్టవలెను.

"కాంభోజ, సింధు, ఆరట్టవనాయు, దేశజములగునవి ఉత్తమాశ్వములు. బాహ్లిక, పాపేయ, సౌవీర, తైతల, దేశజములు మధ్యజాతివి. తక్కినవన్నియు అవరములు (సాధారణములు)

"గుర్రాలను యుద్ధాలకే శిక్షణము చేయవలెను. వల్గన, నీచైర్గత, లంఘన, ధోరణ (Gallop) నారోష్ట్ర (Response to Signals) ఇవి గుర్రపు నడకలు. ఒక్కొక్క నడకలో ఔపవేణుక. వర్ధమానక, యమక, ఆలీఢప్లుతాది బహువిధముల రీతులు కలవు.

అశ్వ చికిత్సకులు ప్రత్యేకముగా గుర్రాలను విచారించుకొంటూ వుండవలెను.

"గుర్రాలకి క్రింది నౌకరులు అవసరమైయున్నారు.

1. సూత్ర గ్రాహకుడు - గుర్రాలను పట్టుకొని నడిపించుకొని పోవువారు. సైసులు.

2. యావసికుడు - యవసము (గడ్డి) తెచ్చి మేతపెట్టువాడు.

3. విధాపాచకుడు - గుగ్గిళ్ళు ఉడికించి పెట్టువాడు.

4. స్థానపాలకుడు - గుర్రపుశాలెల కావలి గాయువాడు.

5. కేశకారుడు - గుర్రాల వెంట్రుకలు కత్తరించువాడు.

6. అశ్వబంధకుడు - గుర్రాల కట్టివేయువాడు.

7. జాంగలికుడు - విష చికిత్సలు చేయువాడు.

ఉత్తమ మధ్యమాశ్వాలు లభించు దేశాలను గురించి యిదివరకే తెలిపినాను. అయినను ఇందు కొన్ని కొత్త పదాలున్నవి. వాటిని గురించి తెలుసుకొందము. అరట్ట - ఆరట్ట - దేశము పంజాబులోని మండలము. ఆ రాష్ట్రికశబ్ద భవము. మహాభారత యుద్ధ కాలములో అందలి జనులు దోపిడికాండ్రని ప్రసిద్ధి గాంచిరి. సౌవీరము గుజరాతు దేశములోనిది పాపేయ, తైతల, దేశాలెచ్చటివో నాకు తెలియదు. ప్రాచీన భారతీయ భౌగోళిక నిఘంటులను వ్రాసినవారును వాటిని పేర్కొనలేదు. కావున ఈ రెండును భారతేతర ప్రాంతాలై యుండును. తైతల

అనునది తార్తరీదేశ మనుకొందును. పాంపేయ అయి యుండునా? చాణక్యుని కాలానికే అది రూపుమాసెను. దాని ప్రసిద్ధి విని అతడు దాహరించియుండునా? లేక పంపా (తుంగభద్రా) తీరభూములే పాంపేయమయి యుండునా? వింధ్యకు దక్షిణమున మంచి గుఱ్ఱాలుండినట్లు కానరాదు. నేటికిని అదే లోపమును కాన వస్తున్నది.

తక్కిన దేశాలనుగూర్చి యిదివరకే చర్చించినాను.

చాణక్యుని అశ్వాధ్యక్ష ప్రకరణములో తెలుసుకోదగిన విషయాలు చాలా కలవు. అర్థశాస్త్రమందలి యుద్ధరంగ ప్రకరణములో (పుస్తకము 10వ ప్రకరణము 4) గుఱ్ఱముల వినియోగమును గూర్చి యిట్లు తెలిపినారు".

యుద్ధరంగస్థలమును, విడిదిని, అడవులను శోధించుట, ప్రధాన స్థలము లాక్రమించుట, అనగా నీటిపట్లు, ఘాటులు, మున్నగునవి పట్టుకొనుట, వెనుక వచ్చు సేనకు రక్షణయిచ్చుట, సైనిక వ్యవస్థను సరిచూచుట, సైనిక కక్షలను రక్షించుట, శత్రువులపై మొదటిధాటి సాగించుట, శత్రు సైన్యమును చెదర గొట్టుట, కోశమును, రాజపురుషులను రక్షించుట, శత్రువుల వెనుకభాగముపై బడుట, తరుముట, వెన్నంటుట, వ్యూహరచన, ఇత్యాదులు ఆశ్విక దళములు చేయవలసిన కార్యములు".

ఈ వ్యాసమందు సూచన మాత్రగా తెలిపిన విషయాలు, తెలుపని విషయాలు అన్నియు సమగ్రముగా వ్రాయవలెనంటే భారత గ్రంథమంత కాదా మరి? అట్టి గ్రంథము రచింపదలిచినవారికిది ప్రోత్సాహ హేతువై యుండునని వ్రాసినాను.

# తాంబూల సేవనము

తాంబూలమును సేవించు ఆచారము బహుశా ఒక్క హిందూ స్థానమందే కలదేమో. ఈ యాచారమెప్పు డేర్పడెనో సరిగా చెప్పజాలము.

ఆదిత్యసోదయం, తాత.

"తాంబూలం, భారతీకథా, ఇష్టా భార్యా, సుమిత్రాంచ అపూర్వాసు దినే దినే"

భారత కథ సూర్యోదయము, ఇష్ట భార్య, మంచి స్నేహితుడు, తాంబూలము ఇవన్నియు ప్రతి దినము క్రొత్తగనే రమణీయముగనే ఉండును అని పంచ తంత్రములో వర్ణించినారు.

అమరసింహుడు బహుశా క్రీస్తుశకము 300 ప్రాంతములందుండిన వాడు. అతడు నామలింగాను శాసనములో వనౌషధి వర్గలో తమలపాకుల కీ విధముగ పర్యాయపదములిచ్చెను. "తాంబూల వల్లీ తాంబూలీ నాగవల్ల్యపి" తాంబూలమునకు నాగవల్లి అను పదమొక్కటే అతడిచ్చెను. నాకలోకమునుండి అది మనకు లభించినందున నాగవల్లి అయినదని అమరవాఖ్యాత లింగాభట్టు చమత్కరించెను. కాని నాగుబాము పడగవలెనుండు ఆకులుకల తీగ యగుటచే నాగవల్లి యయ్యెనన వచ్చును.

ఘోంటాపూగ, క్రముక, గువాక, ఖప్పర, ఉద్వేగ అనుపదములు పోకకు పర్యాయ పదములని అమరుడు తెలిపెను. అందు పూగక్రముకములే ప్రచారమందున్నది. పూగ అనగా "పునీతి ముఖమితి పూగః" ముఖమును పవిత్రము చేయునది కాన పూగమయ్యెను అని లింగాభట్టు విచిత్రముగా సమర్థించెను. తెనుగులో పూగ అనునదే పోఁక. ఈ శబ్దములో అరసున్న కలదు కాన పూర్వము దీనిని పొంక అనిరి. పోకనాడు, పూగనాడు అను నాడుకలదు. అచ్చట ఇవి విశేషముగా పండినందున పూగము పోక అయ్యెనేమో అని నా యనుమానము. ఘొంట అను

పదమే తెనుగులో "గొంటు" అయి యుండును. గొంటు పోక అనియు కొరకరాని గొంటు అనియు తెనుగు వారందురు. గట్టి పోక గొంటు పోకయే అయియుండును.

తాంబూలములోని యంగాంగములను మొదలు విచారింతుము. తాంబూలము, తమలము, తమ్ములము, నాగవల్లి అనునవి తమలపాకును తెలుపును. తమ్మ పడిగ అనగా తాంబూల రసమును ఉమియుటకై ఉపయోగించు పాత్ర. కావున తమ్మ అని తమ్ములమున కుపయోగించిరనవలెను. రెడ్డి వెలమరాజులు పరస్పరము తలల కోసి తలపుర్రెలను తమ్మపడిగలుగా ఉపయోగించిన ధీరులు! హైదరాబాదులో వాటికి ఘూక్దాన్ ఉగల్‌దానులందురు. సంపన్నుల యిండ్లలో అవి యుండును. పూర్వము రాజులవద్ద తాంబూలపుతిత్తులను ఉంచుకొనియుండు సేవకులును సేవకురాండ్రును ఉండినందుననె అడపకత్తె అడపకాడు అను పదములు మన వాఙ్మయములో కానవస్తున్నవి. అడపము అనగా వక్కలాకుల తిత్తి. వక్కలను కత్తిరించుట కొక సాధనము కలదు. దానిని అడకొత్తు, పోకొత్తు అందురు. అడకొత్తు అనగా అడకాయ + ఒత్తు అనుపదముల చేరిక అని శబ్దరత్నాకరమందు వ్రాసిరి. కాని అడకాయ అనుపదమును వ్రాయలేదు. కన్నడంలో అడికి అనగా వక్క. దానిని ఒత్తు నది అడకొత్తు. ఒక కాలములో తెనుగు వారు పోకలను అడకఅని పిలుచు చుండిరని ఊహింపవచ్చును. అడకాయ అనునది తప్పని కన్నడ పదములబట్టి చెప్పవచ్చును. అడకత్తును సంస్కృతములో "శంకుల" అనినట్లు శబ్దరత్నాకరములో కానవస్తున్నది. కాని అమరు దేపదము నిచ్చినట్లు కానరాదు. వక్క అను పదము వ్రక్కనుండి తునక అను నర్థములో నేర్పడెనో యేమో? ఉడుక బెట్టిన పోకచెక్క అని దానికి నిఘంట్వర్థము వ్రాసినారు. మన దేశములో ఉడుక బెట్టిన వక్కలను ఉడుకబెట్టని వక్కలను తినువారు కలరు. ఆంధ్రులు, కర్ణాటకులు, తమిళులు ఉడుకబెట్టిన వక్కలనే వాడుదురు. మళయాళీల దేశమందే వక్కలు సమృద్ధి. వారును ఇతర హిందూస్థానము జనులును విశేషముగా పచ్చి పోకలనే వాడుదురు. పోకలను బాగాలు అనియు అందురు. ఈ పదము ఒరంగల్ జిల్లాలో ఎక్కువ ప్రచారములో కలదు. "బాగములు" అను శబ్దమే భాగాలు. భాగములు అను శబ్ధభావమే తునక అను నర్థములో వక్కవలె ఇది యేర్పడెనేమో అని నా అనుమానము. "కట్టెడు తెల్లనాకులను కప్పుర బాగాలు నిచ్చి నిచ్చటన్" అని తారా శశాంకమందును "కర్పూరంబు తోడి బాగాలీరాదో యాకు

మడిచి యీరాదో చెలీ" అని కళాపూర్ణోదయమందును, వాడిరి. ''మంచి మేలైనది దిగు కొమ్మంచు కప్పురంబు సగపాలు నింపి వీడెంబొసంగి" అనియు "బాగా లొసంగె" అనియు చేమకూర వ్రాసిన ప్రయోగాలు కలవు, విడెము, వీడియము, వీడ్యము అను పదములు తాంబూలమునకు వాడిరి. దీనినె ''బీకా'' అని హిందీలో వాడిరి. ''బీడా ఎత్తుట'' అను హిందీ నుడికారములో గొప్ప యర్థము కలదు ఎవరైన సాహస కార్యము చేయదలచినరాజు ఇచ్చిన విడెమును తీసుకొను చుండిరి. అనగా ఆ కార్యమును ప్రాణములర్పించి యైనను సాధించి తీరుదునని బీడా ఎత్తువాడు శపథము చేయుట అగుచుండెను. సంస్కృతమున విడెమును వీటి అనిరి.

ప్రియ దూతిక తెచ్చియిచ్చు కప్పుర విడెము కావలెనని అల్లసాని పెద్దన కోరెను. మన కవులు సాధారణముగా తాంబూలములో కర్పూరమును చేర్చి సేవించుచు వర్ణించినది గమనింపవలెను. నేడు అది మృగ్యమై పోయినది. తాంబూలమును గురించి సంస్కృతములో కొన్ని చాటూక్తులు కలవు. తెనుగులోను కొన్ని కలవు. మాసరకిది యొకటి కనుడు. ''తాంబూలం ముఖ్యరోగ—''

తాంబూలమును వేసుకొనువారు తాంబూలము తిత్తులో లేక పెట్టెలో లేక కరండములో లేక కరంకము లేక జాలవల్లికలో ఉంచుకొనుచుండిరి. కరంక పదమును బాణుడు కాదంబరిలో ప్రయోగించెను. తెనుగులో కరండమని ప్రయోగించిరి. ఆ పెట్టెలపైన సన్నని తీగె పనులుండెడివి. అందుచేత వాటిని జాలవల్లికలనిరి. జాలవల్లికల తోడ బాగాలు, తెల్ల నాకులు కైరవళ్ళు నెదుట పెట్టెను'' అని సారంగు తమ్మయ్య వ్రాసెను. కైరవడి అనగా కాచులో పాలు మొగలిపూల రసము వేసి నూరి గోలీలుగా చేయుట అని యర్థము. ''కప్పురపు వీడియంబును కైరవళ్ళు కొసగె'' అని శృంగార మల్హణ చరిత్రలో వర్ణింప బడినది. తాంబూలపు పెట్టెలు నానా విధములైనవి. ఇత్తడి, రాగి, కంచు, వెండి, బంగారు లోహములతో సిద్ధము చేయుచుండిరి. నెమలివలె, బాతువలె, రాగి రేకువలె, గుండ్రముగను, తీగెల పనులతోను, వివిధ సుందర రూపముల తోను పెట్టెలను సిద్ధము చేయుచుండిరి. పెట్టెలలో అరలు చాలా ఉండెడివి. అందు వేర్వేరుగా చక్కలు, లవంగాలు, జాజికాయ, జాపత్రి, ఏలకులు కర్పూరము, సున్నము, కస్తూరి, కుంకుమ పువ్వు, కైరవళ్ళు, కాచు, సొంటి

తమలపాకులు, కొబ్బెరపొడి, అడకొత్తు మున్నగునవి ఉండెడివి. సంపన్నులు వక్కలకు, లవంగాలకు వెండి, బంగారు రేకులను ఒత్తి వాడుకొనుచుండిరి. తాంబూలము పైనను వెండి, బంగారు రేకులొత్తి సేవించుచుండిరి.

''ఖండిత పూగీ నాగర
ఖండంబుల ఘన శశాంక ఖండంబులచే
హిండితమగు తాంబూలము''

అని కృష్ణ దేవరాయలు ఆముక్త మాల్యదలో (5-93) వర్ణించెను.

''మృగమద సౌరభ విభవ
ద్వి గుణిత ఘనసార సాంద్రవీటీ గంధ
స్థ గితే తర పరిమళమె''

అని అల్లసాని పెద్దన (2-24) వర్ణించెను.

విజయనగర చక్రవర్తుల కాలములో సంపన్నులు సేవించిన తాంబూలలమును పైన వర్ణించినారనుట స్పష్టమే. తాంబూలములో కొందరు తురిమిన కొబ్బరి పొడిని, గసాలను, సోంపునుల వాడుదురు.

చాళుక్య సోమేశ్వరుడు అను రాజు క్రీ.శ. 1050 ప్రాంతము వాడు. అతడు సంస్కృతములో ''అభిలషితార్థ చింతామణి'' అను గ్రంథమును రచించెను. ''అందు తాంబూల భోగంబు'' అను విషయమును గురించి (ప్రకరణము 3, అధ్యాయము 4 లో) 22 శ్లోకములు వ్రాసెను. అతని కాలమందు రాజుల తాంబూలము లేవిధముగా ఉండెనో తెలిసికొనుట కీ భాగము చాల సహాయ పడుచున్నది. అందలి విషయాలిట్లున్నవి -

''రాజు స్నానముచేసి బయటకు వచ్చి ''తాంబూలాధికారి''ని పిలిచి తాంబూలమును చేయును..... మేఘవర్తి పురమందును, ఈశ్వర పురమందును, కారటీ పురమందును కాసిన వక్కలను పాకము చేయించవలెను. పాటలమువలె, కొద్ది ఎఱుపును కాషాయ మధురమును అగునట్లుడికించి ఆరబెట్టవలెను. మామిడి ఫలముల తొడిమల నుండి వెడలు రసములోను గంధము పొడి, కర్పూరముతోను

కలిపి నీటిలోన వాటిని నానబెట్టవలెను. అట్టి పచ్చిపోకల పైన సన్నని పొరను చెక్కి వేడి ముక్కలుగా చేసి నీడలో ఆరబెట్టవలెను. తమలపాకులలో శ్రేష్ఠమైనవి కర్పూరవల్లి, నాగవల్లి అను తీగలపై పెరుగునట్టివి. ఒక సంవత్సరము కన్న నెక్కువగా పెరిగిన తీగలపై తమలపాకులను తీసుకొనవలెను. ఆకులపై నదీ జలమును చల్లవలెను. అవి పెద్దవిగను తెల్లవిగను ఉండవలెను. వాటి కొనలను గిల్లివేయవలెను. అవి 52 ఆకులై యుండవలెను. శైలోదకముతోను, శిలా పాకముతోను కూడిన ముత్తెపు భస్మమును సున్నముగా వాడవలెను. కర్పూర మెట్టిదనగా - మలయాచలమందు పుట్టినదగును. మామిడివాసన కలదిగను, ఈశావాసమను పేరు కలదిగను శ్రేష్టమైనదిగ నుండవలెను. తాంబూలములో పై వక్కలను, కర్పూరమును కాక, కస్తూరి చూర్ణమును, గంధ చూర్ణమును సమ భాగములుగా కలిపి వాడుకొనవలెను. మరియు నీ క్రిందివి కూడ చేర్చ వలెనట.

''కస్తూరీ శశితక్కోలం జాతీఫల సుచూర్ణకం
ఖదిరక్వాథ చూర్ణంతు కస్తూరీ క్షోదమిశ్రితం
శ్రీ ఖండ కల్క సంయుక్తం కర్పూర రజసమన్వితం
మేళయిత్వా సమ్యక్‌భాగైః గుళికా కల్పితా శుభా॥''

కస్తూరి, తక్కోలము, జాజి, ఖదిరల్వోథము, శశి, కర్పూరము గంధము ఇవన్నియును సమభాగాలుగా కలిపి నూరి గోలీలు చేసి వాటిని తాంబూలములో వాడవలెను. పై వాటిలో శశి అననేమో తెలియదు. ఖదిర మన ముడుగు తామర చంద్ర అని నిఘంట్వర్థము. ఇవేమో సరిగా తెలియనందున మూలము నుదాహ రించినాను. ఇంకా కొన్ని తాంబూల పరిష్కారములను సోమేశ్వరుడు వర్ణించినాడు. అందు ఖదిరసారముతో కాష్ఠామ్ల చూర్ణము జంజీర బీమిపూరము యొక్క కళికలు చేరినవి. ఇవియు నిట్టివో యేమో ?

హిందూస్థానమందు తాంబూల సేవనము ఇట్లూహింపనైనది. బహుశ ఈ ఆచారము ఇండోనేషియాలోను, మలయాలోను కలదేమో? ఈరాన్, అరేబియా, వంటి ఉత్తర దేశాలలో ఈ అచారము లేదు. విజయనగర చక్రవర్తుల కాలములో ఈరాని రాయబారియగు అబ్దుర్రజాక్ ఇట్లు వ్రాసి యుండెను. “ఈ దేశములో

తాంబూలమును విశేషముగా వేసుకొందురు. అది ఉత్తేజకరమైనది. బహుశా దీని ఉత్తేజక శక్తివలనేమో చక్రవర్తి తన (700) ఏడు నూర్ల భార్యలతో ఉంపుడు గత్తెలతో భోగింపగలుగుచున్నాడు".

శుభాశుభ కార్యాలలో తాంబూలములను వాడుదురు. వ్రతములలో మూర్తి పూజలలో తాంబూలములను వాడుదురు. ఈ సందర్భములో కొన్ని ఆచారములు స్థిరపడినవి. శుభకార్యములలో తాంబూలముగాచేసి ఇవ్వారాదు. శ్రాద్ధాదులలో విడిగా ఉన్న తమల పాకులనుంచెదరు. తమలపాకుల తొడిమలను,ఈనెలను, తోకలను తీసివేసి తాంబూలము చేయుట పలువురి పరిపాటి. దానికిని కొన్ని శాస్త్రీలు బయలుదేరినవి. తొడిమ రోగము కలిగించుననియు, అటులే ఈనెల తోకలు మంచివి కావనియు అందురు. విఘ్నేశ్వర పూజలతో ప్రారంభమగు వ్రతాలన్నింటిలో వినాయకునికిని, దేవతలకును తాంబూలము లిత్తురు. తాంబూలములతో పాటు దక్షిణ కూడ ఉండవలెను. వీడ్కోలు చేయునప్పుడు ఏమి లేకున్నను తాంబూలమైనను ఇయ్యకుండిన భారతీయులలో మర్యాద లోపమని భావింతురు. ఆధునిక పాశ్చాత్య వైద్యులు ఆకులు చెడ్డవి, వక్కలు మరీ చెడ్డవి, సున్నము చెడ్డది, మొత్తముపై తాంబూలమే చెడ్డదని అనినారు. కాని, వారిలో శ్రీవారు కొందరు నష్టము లేదన్నారు. వారేమన్నను భారతీయులు తాంబూలమును వదలు కొనిరి. సున్నము ఉత్తమమైనదిగా ఉండవలెను. రాజులు, రాణీలు నేటికిని ముత్యముల, పగడాల భస్మమును సున్నముగా వాడుదురు. పచ్చ పోకలు వేసుకొనువారు కాచును తప్పక వాడుదురు దానిని పాలతో ఉడికించువారును కలరు. దానిలో మొగలిపూ రసమును చేర్చి గోలీలుగా చేసి వాడువారును కలరు. పచ్చ కర్పూరమును వాడువారు కొందరు. పసుపు వన్నెతో నుండు తమల పాకులను అందరును చాల శ్రేష్ఠమని భావింతురు. శ్రీనాథుని కాలపు క్రీడాభిరామములో నిట్లు కలదు.

> "వీడిదె తెల్ల నాకులను వీడెము సేయుచు వీథివచ్చుచు
> న్నాడు, మదించి తిండితిని నాడు చుమీ। .... .... ...."

ఉత్తమ హిందూ స్థానము వారు ఢిల్లీ ప్రాంతములందు పెరుగు తెల్లని చిన్న తమల పాకులను చాలా ప్రీతితో కోరుదురు. రాయలసీమలోని కొన్ని

ప్రాంతాలలో "కారపాకులు" అను కొద్దిగా కారముకల పెద్ద తమల పాకులను తిందురు. తమిళులు లేతఆకుపచ్చని ఆకులెన్నైనను మేకలవలె నములుచుందురు. మళయాళములో మరల పెద్ద కారపాకులను అప్పుడు చెట్టుపైనుండి త్రెంచిన పీచుతో నుండు పచ్చని పోకలను ఘాటైన వెన్నవంటి మెత్తని తెల్లని సున్నమును వాడుదురు. ఆ యాకులు పోకలును కలిసిన తాంబూలపు రసమును మ్రింగిన వెంటనే ఒళ్ళంతయు మంటలెత్తును.

మనదేశములో నంతటను మళయాళమందే పోకచెట్లు సమృద్ధిగానుండును. తర్వాత తమిళనాడులో కొంతవరకు లభించును. జాజికాయలు, జాప్రతి నీలగిరిలో లభించును. కాని ఏలకులు, లవంగాలు, జాజి, జాజిప్రతి, వక్కలు మున్నగు సుగంధ ద్రవ్యములు ఇండోనేషియా దీవులలో అతి సమృద్ధిగా లభించును. అందుచేతనే ఆ దీవులు పాశ్చాత్యులు సుగంధదీవులు (**Spice Islands**) అని పేరు పెట్టిరి. గత ప్రపంచ యుద్ధ కాలమందక్కడి నుండి పై వస్తువులు దిగుమతి మనకు ఆగిపోగా వాటి ధర విపరీతముగా పెరిగిపోయెను.

పొగాకు మనదేశములో క్రీ. శ. 1550 నుండి మొదలై దేశమంతటను వ్యాపించెను. అటు తర్వాత ఇంచుమించు 200 ఏండ్లనుండి పొగాకును తాంబూలములో పలువురు వాడుటను మొదలుపెట్టిరి. పొగాకుతినిన నోరు దుర్వాసన కలిగియుండును. కాని పండ్లకు జబ్బులను రాకుండ పొగాకు రసము సహాయ పడును. అదియే పొగాకును తమలపాకులతోపాటు వాడుటకు ముఖ్య కారణమైనది. ముసల్మాను నవాబులు సర్కారులు అమీరులు దీనికి సువాసన కలుగుటకై పన్నీరు సుగంధ ద్రవ్యములు కలిపి పొగాకును నానబెట్టి పాకముచేసి జర్దా అనియు ఖమాం అనియు, ఎన్నియో పేరులు పెట్టి సిద్ధము చేయించుచుందురు. తెనుగు దేశమందంతటను జనులు విశేషముగా పొగాకు పుల్లలనే తాంబూలముతో పాటు నోటవేసుకొని నమిలి రసమును ఉమ్మి వేయుచుందురు. పొగాకు పంటి నొప్పిని హరించునని 200 ఏండ్లనాడే కనుగొనిరి. ఒక చాటువులో నిట్లు వర్ణించినారు.

"దంత లూటి ఘోర దంతి హర్యక్షంబు
కుష్ఠరోగా ఖిల కులిశధార.........."

గండ్లూరి నరసింహ కవి కర్నూలు మండలము వాడు. క్రీ. శ. 1800 ప్రాంతము వాడు. అతడు తన భాషీయ దండకములో నిట్లు వ్రాసెను.

"ఇంగ, గొొల్లేశీమొస్తుంది, నోట్లోకి కొంచెం పొగా
కుప్పల్లగిల్పెట్టి .........పోరా; పోగాకుప్పల్లకే యాడ
కొట్టించుంకొంటావురా, యటంచున్ విశదంబుగా
గూడె పున్ దాసం.........గుంపు గూడాడగా"

కర్నూలు ప్రాంతాలలో తాంబూలము ధర ఇప్పుడు ఒక అణా. అందు సాక్రీన్ చేర్చి అమ్ముదురు. ఆ ప్రాంతమందలి క్రొత్తగా ప్రబలిన రుచి. హైదరాబాదులో పచ్చిపోకల బీడాలే దొరకును. ఇదివరలో ఒక పైసా కొక బీడా యిచ్చుచుండిరి. ఇప్పుడు కనిష్ఠపు బీడా అర్ధాణా కొకటి. రెండణాలును, నాలుగణాలును, అర్ధ రూపాయికిని, రూపాయికిని ఒకే ఒక బీడా కూడా హైద్రాబాద్‌లో కట్టి యిచ్చు వారున్నారు. వాటిని కాని సేవించువారును కలరు.

# మామిడిపండు

"మామిడిపండును గురించి కూడ చెప్పవలసినది వినవలసినది ఏమైన కలదా ?" అని పలువురనుకొనవచ్చును. అవును, దానిని గురించి చాల తెలుసు కొను విషయములు కలవు. దాని పుట్టు పూర్వోత్తరములు, దాని చరిత్ర, దాని జాతిభేదాలు, దాని వ్యాప్తి, మున్నగు విషయములు తెలుసుకొన దగినవై యున్నవి.

మొట్టమొదట గమనింపదగిన దేమన-మామిడిపండు ఫలజాతిలో చక్రవర్తి యన్న విషయము. అంత తీపి, అంత సౌలభ్యము మరే పండుకును కానరాదు.

సంస్కృతములో మామిడిపండుకు చాల పేర్లున్నవి. అమరసింహు డిచ్చిన పేరులేవనగా— అమ్రము, చూతము, రసాలము, సహకారము. ఈ నాలుగే సంస్కృతమున నుండు పేరులు. హిందీ, ఉర్దూ భాషలలో అమ్రశబ్ద తద్భవమగు ఆమ్ అను పదమొక్కటే ప్రచారమందున్నది. దక్షిణదేశ ముఖ్య భాషలగు తమిళ కర్ణాటాంధ్ర భాషలలో మాంగాయి యనియు, మావికాయ మాగాయ యనియు మామిడి యనియు పిలువబడును. ఫ్రెంచి, పోర్చుగీసు, ఇంగ్లీషు వారు దక్షిణములోని రేవులలో నిల్చిపోయినప్పుడు మన మాగాయనే తమ భాషలోనికి తీసుకొనిరి. పోర్చుగీసువారు మాంగే అనిరి. ఇంగ్లీషు వారు మాంగో అనిరి. కారణ మేమనగా మామిడి యూరపు దేశాలలో నెందును పెరుగదు. అదే విధంగా ఈరాన్, అరేబియా, ఈజిప్టు దేశాలలోను ఈ పండు లేదు. అందుచేత వారును ఈ పండుకు కొత్తపేర్లు పెట్టిరి. అరబ్బులు అంబజ్ అనిరి. అది అమ్రశబ్దపు అపభ్రంశమే ఈజిప్టువారు దానిని మంజా అనిరి. అది మాంగాయ నుండి యేర్పడియుండును.

ఒక్కొక్క దేశములో ఒక్కొక్కపండు ఆదిలో ప్రఖ్యాతి వహించి యుండెను. ఒక దేశమువారు మరొక దేశమునకు వ్యాపారార్థము వెళ్ళినప్పుడు విశిష్ట ఫలములను చూచి వాటిని తమ దేశాలలో వ్యాపింప జేసిరి. ఫ్రాన్సు ద్రాక్షకు, స్పెయిన్ అంజూరుకు, బాస్రా ఖర్జూరమునకును, బటేవియా బత్తాయికి, దక్షిణ

అమెరికా సపోటాకు ఆది జన్మస్థానములు. అటులే మామిడి హిందూస్థానములోనే పుట్టి పెరిగినట్టిది. మన దేశములో దీని యునికి 4000 ఏండ్లనుండి కానవస్తున్నది. కాళిదాసాదుల కావ్యాలలో హితోపదేశాది కథల పుస్తకాలలో ఆమ్ర రసాల వర్ణనలు కానవస్తున్నవి. ఇది అమరుల (దేవతల) ఫలమని వర్ణించినారు. అందుచేత అమరు లది కాన ఆమ్రమయ్యెనో యేమో! రసము కలది కాన రసాలమయ్యెను. రసచ్యుతి కలది కాన చూతమయ్యెను. ప్రేమకు సహకారి కాన సహకార మనబరగెను. హిందూస్థానమందును దక్కన్ ప్రాంతమందే ఇది మొదట యుండెనని పలువురి యభిప్రాయము.

మామిడిచెట్టునకు ఎర్ర నేలలు, ఇసుక నేలలు, ఉష్ణవాతావరణము, మొదటి నాలుగేండ్లవరకైనను తగినంత నీరు కావలెను. ఎప్పటికి నీరాగినచోట పెరుగదు. ఎప్పటికిని చలిగల ప్రదేశాలలో ఎదుగదు. కావున తెలంగాణము, అట్టి వాతావర ణము కల ప్రాంతాలు వాని కనువగు స్థానములు.

ఇంగ్లండు చాలా చలి ప్రదేశమగుటచేత అచ్చట దీనిని నాటినను పెరుగదు. విక్టోరియారాణి కాలములో రాజబంధు వొకడు ఇండియానుండి ఎర్రటిమన్ను బండ్లకొలది తెప్పించి తన భూమిమన్ను తీసివేసి యీ మన్నును నింపి మామిడి నాటెను. దానికి చలి తగులకుండ విద్యుద్దీపమును తగినంత సప్లయి చేయింపించెను. ఆరేండ్లకు పెరిగి ఆరుకాయలు కాసెనట. వాటిని విక్టోరియా రాణికి కానుకగా నియ్య కోసెనట. తర్వాత చెట్టెండిపోయెనట. ఇంతకు పూర్వము ఓడలలో మన మామిడిని ఇంగ్లండు, అమెరికా వంటి దూరదేశాలకు తీసుకొని పోజాలకుండిరి. దారిలోనే అవి మురిగిపోవు చుండెను. ఇప్పుడు విమానాలలో రెండు మూడు దినాలలో రిఫ్రిజిరేటర్లలో భద్రపరచి తీసుకొనిపోవుచున్నారు. అమెరికాలో మామిడిని పెంచ జూచుచున్నారు. కాని యింకను అది యా దేశమునకు సరిపడ లేదు.

బగ్దాదులో ఖలీఫాలు రాజ్యము చేయుకాలములో దీని నచ్చటికి తెప్పించు కొనెడివారు. అరబులు తమ గ్రంథాలలో ముఖ్యముగా యూనానీ గ్రంథాలలో దీనిని గురించి వ్రాసిరి. అబుల్ ఫజల్ హిందూ అనునతడు మిఫ్తాహుల్ తిబ్ అను వైద్య

గ్రంథములో దీనిని చర్చించెను. హరూనుల్ రషీద్ ఖలీఫా కాలములో నతని వైద్య రాజులైన కసక, మరియు మసక అను హిందూ వైద్యులు బగ్దాదులో మామిడి పండును గురించి దాని లాభములను గురించి ప్రచారము చేసిరి.

ఇండియాలో ముసల్మానులు స్థిరపడిన తర్వాత వారి కన్నిటికంటె మామిడి పండు మజా దొరికెను. వారు దానిని ప్రేమించిన వారైరి. వారు వాటి అంట్లలో పరిశ్రమ పరిశోధనలు చేసి మేలైన రకముల నుత్పత్తిచేసిరి. విరివిగా తోటలను పెంచిరి. మహమ్మద్ బిన్ తుగ్లఖ్‌ను చరిత్రకారులు పిచ్చిరాజనిరి. అతనికి పట్టిన పిచ్చిలలో మామిడి పిచ్చి కూడా యొకటి. అమీర్ ఖుస్రూ అను సుప్రసిద్ధ విద్వాంసుడు మామిడిపండ్లు పండ్లలోనెల్ల శ్రేష్ఠమైనవని వ్రాసెను. బాబరు చక్రవర్తికి మన దేశం సరిపోలేదు. తన డైరీలో ఇట్లు వ్రాసి యుండెను. "ఈ దేశము అసహ్యమైనది. ఈ దేశం మనుష్యు లసహ్యమైనవారు. వారి మొగాలు మరీ అసహ్యమైనవి." అంతా అసహ్యం అసహ్యం అని తిరస్కరించిన బాబరు మామిడిపండు పేరు చెప్పితే నోరు చప్పరించేవాడు. అక్బరు చక్రవర్తి చాలా ఆమ్ర వనములు వేయించెను. అందు దర్భంగా తోటలో ఒక లక్షకు మించిన మామిడి వనములను పెంచెను.

పోర్చుగీసువారు, ఫ్రెంచివారు కూడా మామిడి అంట్లలో పరిశ్రమచేసి క్రొత్త రకముల పండ్ల నుత్పత్తి చేసిరి. ఇప్పుడు గోవాలో పెయరీ అను మామిడి వారి అంట్ల నుండి ఏర్పడినవే. ఫ్రెంచివారి యంట్లనుండి అల్ఫాన్సో ఏర్పడెను. తమ రాజు పేరు వాటి కిచ్చిరని యందురు. దానిని జన సామాన్యము అల్ఫెన్ అందురు. అవి బొంబాయిలో అందును ముఖ్యముగా రత్నగిరి జిల్లాలోను విశేషవ్యాప్తి కలవి.

మామిడి పండ్లలో 500 రకముల పండ్లున్నవి. అందు 122 రకములు హైద్రాబాదు రాజ్యములో లభించును. మంచి జాతి పండ్లకు పేరులు కలవు. ఆ పేరులను బట్టి కూడా కొంత వాటి చరిత్ర తెలుసుకొన గలుగుచున్నాము. "సూరెబెహిష్త్" అని ఫార్సీ వారనిరి. అనగా స్వర్గములోని ఫలమని యర్థము. మనవారు అమరుల ఫలమన్న దానికిని దీనికిని దగ్గరి పోలిక కానవస్తున్నది. తైమూరీ అను ఫలము తైమూర్ లంగ్‌కు పసందైనదిగా కానవస్తున్నది. జహాంగీరు అనునది జహాంగీరు చక్రవర్తి ఎక్కువగా పసందు చేసినాడని సూచించును. రాయలసీమలో "రెడ్డి

పసంద్'' అన్నది కలదు. మరియు "నవాబ్‌పసంద్" అనునదియు కలదు బనగాన్ పల్లె నవాబో, హైద్రాబాదు నవాబో, ఏ నవాబు దానిని పసందు చేసెనో యేమో? దిల్ పసంద్ అన్నది ప్రతివాని మనసుకు మెచ్చువచ్చినదన్న మాట.

ఇవికాక మరికొన్ని పేరులు గమనింప దగినవి. లంగడా, మాల్దా, సఫేదా, కిషణ్‌భోగ్, ఫజ్రీ, ఖజ్రీ, బేనిషాన్, మల్గోబ, తోతాపరీ, నీలం, అనునవి కొన్ని. అందు హైదరాబాదులో బేనిషాన్, మల్గోబా, తోతాపరీ, నీలం, ఎక్కువగా నున్నవి. అందు మొదటి రెండు శ్రేష్ఠమైనవి. తోతాపరీ చిలుక ముక్కు వలె నుండుటచేత ఆ పేరు వచ్చినది. దీనిలోను, నీలంలోను పండు పక్వము కాగా పండు నుండి పురుగు వెలువడును. మామిడి పండ్లకాలము ముగిసిన తర్వాత వర్ష కాలములలో తోతాపరీ, నీలం అమ్మకమగును. బొంబాయివారు అల్ఫూన్ శ్రేష్ఠమైన దందురు.

ఒక రకపు మామిడి సంవత్సరమునకు రెండు మారులు కాయును. దానిని బారామసీ యందురు దాని విశిష్టత రెండుమారులు కాయుటలోనే కాని తీపిలో లేదు.

హిందూస్థానములో బొంబాయి, బెంగాల్, బీహార్, ఉత్తర ప్రదేశము, కర్ణాటకము, ఆంధ్రము, మైసూరు, ప్రాంతాలలో మామిడి పండ్లు సమృద్ధిగా లభించును. బీదరు జిల్లాలోని కోహీరు చాలా ప్రసిద్ధికన్నది. అదే మామిడికి మొదట పుట్టినిల్లు అని ఒకరన్నారు. బహుకాలమునుండి రాయచూరు జిల్లాలోని అలంపూరు, కర్నూలు జిల్లాలోని బనగన్‌పల్లి మామిడిపండ్లకు బహు ప్రసిద్ధికన్న స్థలములు.

హైదరాబాదు ముషీరాబాదీ అనునవియు ప్రసిద్ధి కల్గినవి. అల్ఫూన్ ఫఖ్రు స్సమర్ అన్నవి కూడా వ్యాప్తికన్నవి. హైదరాబాదులో ఇద్దరు నవాబులు 70 ఏండ్ల క్రిందట వారి మామిడి తోటలలోనే మునిగితేలి వాటిలో శోధనలు చేసి వృద్ధికితెచ్చిరి. వారిద్దరు ముసల్మానులు. ఒకరు నవాబ్ ముఖ్రరబ్‌జంగ్ అనువారు. రెండవవారు ఆజమలీఖాన్ అనువారు. మొదటివారి తోటలలో సర్దార్‌బాగ్, ఖుదా దాద్‌బాగ్ అను హైదరాబాదు నగరములోని తోటలు ప్రసిద్ధికన్నవి. ఆజమలీ కని పెట్టినదేమో ఆజమస్సమర్ అన్నది. ఆ చెట్టు ఖుదాదాద్‌బాగ్‌లో సమృద్ధి. కాని ఆ పండ్లను నవాబెవ్వరికి ఇయ్యక కాపు పట్టగానే చెట్లపై అరబ్బుల పహిరా నెక్కించెడివాడు. ఆ పండ్ల రుచి అట్టిది.

ఆజమలీ తోటపండ్లను విక్టోరియారాణికి, ఏడవ ఎడ్వర్డు రాజుకు, ఆఫ్గనిస్థాన్ అమీరగు అబ్దుల్ రహమానుకు పంపుచుండిరి. అంతేకాదు. ఆజమలీ గొప్ప ఆశ్రమ ఫలదాత. తను మెచ్చిన ఒక స్నేహితుని కొకనాడు 18 గంపలతో పండ్లను పంపెనట.

మామిడిపండ్లలో చిన్న నిమ్మకాయ అంతటివి, చిన్న గుమ్మడికాయ అంత టివి కూడ లభించును. ఒక్కొక్క పెద్దపండు 2 పక్కా శేర్లు తూగును. కాని అట్టి వరుదు. పలు విధములగు రంగుల పండ్లును లభించును. ఎర్రనివి, ఆకు పచ్చనివి, పసుపు వన్నెవి, తెల్లనివి, ఊదారంగువి లభించును. మామిడి చెక్క, ఆకు, పూత, కాయలు, పండ్లు అన్నియు సువాసన కలవి. ఆ వాసనలు భిన్నభిన్న ముగా నుండును. సువాసన కలిగి సులభముగా లభించునవి కావున హిందువులు పండుగ దినాలలో శుభ కార్యాలలో మామిడాకులతో ఇండ్ల నలంకరించుకొందురు.

మామిడిలో రెండు ముఖ్యమగు జాతులు కలవు. ఒకటి పీచుకలిగి రసము కలది. రెండవది పీచులేక కండ కలిగినట్టిది. రసముపండ్లు కూడా కొన్ని చాలా రుచి కలవి.

మామిడిని అనేక విధములుగా ఆహారముగా నుపయోగింతురు. కాయలను ఊరగాయలుగా వాడుదురు. మరియు పప్పులో చారులో నుడికించి వాడుదురు. కూరలలోవేసి ఉడికింతురు. వరుగుచేసి అవి లభించని కాలములలో పై విధముగా వాడుకొందురు. పక్వమైన పీచులేని వాటిని మురబ్బా జెల్లీగా చేయుదురు. ఔషధ ముగా వాడుదురు. మామిడిచెక్క రసమును వంధ్యలకు త్రాపుదురు. శ్రీకరణి అను పేర మామిడి రసమును సిద్ధము చేయుదురు. ఏలకిపొడి జాజికాయపొడి చక్కెర మామిడిపండు రసముతో కలిపి సిద్ధముచేయు దానిని శ్రీకరణి యందురు. రసాల దగ్ధం అని రత్నావళియను సంస్కృత నాటకములో వర్ణించినారు. మన దేశ ములో మామిడిపండ్లు ఎక్కువైనపుడు సగము వరకు మురిగిపోవును. బీదవారు వాటిని తిని రోగముల పాలగుదురు. ఎక్కువగా నుండిన ఫలములను మురబ్బా లుగా చేసిన దేశసంపద వృద్ధియగును. ప్రభుత్వము వా రీవిధానము విరివిగా ప్రచారము చేయవలెను.

హైదరాబాదు రాజ్యములో 1948 లో 18 లక్షల మణుగుల మామిడి పండ్లు తినియుందురని ప్రభుత్వమువారు లెక్కవేసియుండిరి. ప్రతి సంవత్సరము 50 వేల మణుగుల వరకు బయటినుండి దిగుమతి చేసుకొందురు. హైదరాబాదు రాజ్యములో 23910 ఎకరాలలో మామిడితోట లున్నవి. అందు 17 లక్షలు విత్తనం చెట్లున్నాయి. 90000 అంటుమామిడి యనియు అంచనా వేసినారు. అన్ని జిల్లాలపైకి ఔరంగాబాద్‌లో ఎక్కువ పండ్లును, నల్లగొండలో అన్నిటికన్న తక్కువ పండ్లును లభిస్తున్నవి. మామిడపండ్లలో ఏ, బి అను విటమినులున్న వనియు అంచేత అవి చాల బలకరమైనవనియు వైద్యుల యభిప్రాయము.

పూర్వ మొకమారు పర్షియానుండి యొక సర్దారు హిందుస్థానమునకు వచ్చి మామిడిపండ్ల రుచిచూచి తనదేశము పోయెను. ఈరానీ పాదుషా ఏమి విశేషాలని యడుగగా మామిడి రుచిని వర్ణించెను. ఆ రుచి యెట్లుందనగా తేనె తెప్పించి ఒకని పెద్ద గడ్డమునకు పూసి దానిని నాకిన కొంత కొంత మామిడిరుచి యర్థమగునని తెలిపెనట.

ఈజిప్టులో మామిడిని అమ్మన్‌రా అనియు నందురు. రా యన ఆ దేశభాషలో రవి యని యర్థము. రా దేవునికి ఆసిరాన్ అను దేవాధిదేవునికి తగువు కలిగెనట. తుదకు వారికి సమాధానమును మరొక దేవత కుదిరించెనట. అప్పుడు దేవాధి దేవుని సంతోషపెట్టుటకు రా దేవుడు హిందూస్థానమునుండి మామిడి పండు కొనిపోయి సమర్పించు కొనెనట. అప్పటి నుండి దానిని అమ్మన్‌రా అనిరి. యథార్థ మేమన సంస్కృత ఆమ్ర శబ్దమే ఈజిప్టు వారి నోట నలిగి అమ్మన్‌రా అయ్యెను.

మామిడిపండును గురించి ఫలశాస్త్ర చర్చ, వృక్షశాస్త్ర చర్చ, వైద్యచర్చ ఇంకా చాలా కలదు. ఇప్పటి కిది చాలును.

పై విషయాలను విన్న తర్వాత మన మామిడిపండు ఫలచక్రవర్తి అనుట కెవ్వరైన సందేహింతురా? సందేహించినవారు మామిడి పండు రుచి యెరుగ రన్నమాట.

# బట్టల పస

"వస్త్రేణ వపుషా వాచా
విద్యాయా వినయేనచ
ఏతైః పంచవకారైః వినా
నరో నాప్నోతి గౌరవం"

అన్నారు పెద్దలు. గౌరవం కావాలంటే మొట్టమొదట బట్టలు (డ్రెస్సు) బాగా ఉండాలి. అందుకే "స్త్రీ పసందు లేకున్నా చీర పసందు గుంది" అంటారు యువకులు. ప్రపంచములో బట్టలపోషాకు చరిత్ర యీనాటిదా, మరి ఎన్నో వేనవేల యేండ్ల క్రిందటినుండి యీ విషయం వస్తూ వున్నది. అతి ప్రాచీన కాలంలో జనులు - అనగా మన ఆదిపురుషులు-ఆది స్త్రీలు - బట్టలు లేకుండా తిరిగేవారు. ఈ విషయాన్నే బైబిలులో''ఆదాము-అవ్వ''కథలో ముద్దుగా యిమిడించివేసినారు

ఈనాడు ఇంతమంది భావకవులు మన రాష్ట్రంలో కూడా తలెత్తుతున్నారు కదా! వారిలో ఒకరైన మన అవ్వ తాతలైన ఆదాము-అవ్వల కథను పాడక పోయిరి కదా! ఈ ఆదిమ పురుషుల కథ బహు రమ్యమైనది. పాపం తిక్క పెద్దమనుషులు బరిబత్తల ఇచ్ఛా విహారం చేసినారు. ఏమిన్నీ సిగ్గు అనేది వాండ్లెరుగరు. ఏడన్ (నందనవనం) తోటలో చేతుల్లో చేతులు పెనవేసుకొని తిరిగినారు.

ఆ కాలం పోయెను. తర్వాత స్త్రీ పురుషులకు సిగ్గు ఏర్పడెను. ఆకులు, ఈకెలు, తోళ్ళు నడుము చుట్టూ కట్టుకో బట్టిరి.

ఇంకా కొంతకాలానికి ఉన్నిబట్టలు నేయ బట్టినారు. ఇట్లా వుండగా హిందూస్థానములో హిందువులే మొట్టమొదట ప్రత్తిని కనిపెట్టినారు. ప్రత్తి పండించి దాని నుండి దారం తీసి వడికి, నేసి విదేశాలకు ఆ తెల్లని, సన్నని బట్టల ఎగుమతి చేయగా ఆ దేశాలవారు నోర్లుతెరచికొని బట్టల చూచి, ఎంత అడిగితే అంత ధనము యిచ్చినారు. వారా బట్టలు చూచి యిట్లా అనుకొన్నారు-

"హిందువుల దేశంలో ఉన్ని చెట్లు కాస్తవట. ఆ చెట్లలో పెద్దపెద్ద పిందెలు పుట్టుతావట. ఆ పిందెలలో నుండి చిన్న చిన్న తెల్లని మేక పిల్లలు పుట్టి, పెరిగి ఊడి పడతావట. ఆ మేకల ఉన్నితో యీ నూలు బట్టలు నేస్తారట!!"

నూలు బట్టలు ప్రపంచములో కనిపెట్టింది మొట్టమొదటివారు హిందువులని చెప్పితిని కదా! ఏ దుర్ముహూర్తాన వారిది కనిపెట్టినారోయేమో దాని మూలకంగా వారు బానిసలైపోయిరి ఈ బట్టల వ్యాపారాని కని విదేశాల నుండి అరబ్బులు, పోర్చుగీసువారు, పరాసులు, ఇంగ్లీషు వారు, పారసీకులు ఎందరెందరో విదేశీయులీ దేశానికి వచ్చి, హిందువుల నానావిధాల బాధపెట్టి, వారిని గులాములనుగా చేసు కొనిరి. పైగా యీ దేశములోనికి యేటేట విదేశాలనుండి 70-80 కోట్ల రూపా యల విలువకల బట్టలను విదేశాలవారు- ముఖ్యంగా ఇంగ్లీషు వారు ఎగుమతి చేస్తూ దేశాన్ని దరిద్రంలో ముంచివేసినారు.

ఏనాడు నూలు బట్టల నాగరికత ప్రబలెనో ఆనాడే చాకలి జాతి ఒకటి యేర్పడెను. పూర్వ కాలంలో అందరు బత్తలుగా తిరిగేవారు. ఆ దివ్య కాలంలో చాకలివాని పుట్టుపూర్వోత్తరాలే లేకుండ వుండెను. చాకలి జాతి ఏర్పడిన తర్వాత వారివల్ల ప్రపంచానికి చాలా నష్టం కలిగింది.

చాకలి జాతి చరిత్ర వ్రాయాలంటే అదొక పెద్ద గ్రంథమే అవుతుంది నే నొకమారు చాకలి, మంగలి చరిత్ర వ్రాద్దామా అని గొప్ప గొప్ప గ్రంథాలు పరిశోధించి నోట్సు వ్రాసి పెట్టుకొని వుంటిని. కాని కొంత కాలానికి అభిప్రాయం మార్చుకొని ఉపసంహరించుకొంటిని. నాది కొంచెం ఉల్టా ఖోప్రా అవడం చేత ఒకటనుకొని ఒకటి చేస్తుంటాను లేండి!

ఒక్కొక్క దేశములో ఒక్కొక్క తరహాగా వుంటారు చాకలి వాండ్లు. కాని మనదేశం చాకలి వాండ్లదే ప్రపంచములో పైచెయ్యి అని చెప్పాలె. ఎందు కంటే ఏ దేశములోనైనా (ఒక్క మన దేశం తప్పితే) బట్టలతో రాళ్ళను బగుల గొట్టే శక్తి సామర్థ్యాలు కల చాకళ్ళను మీరు చూసినారా చెప్పండి మరి.

ఇంగ్లాండు దేశంలో డబ్బు పొగరుచేత సన్‌లైటు సోపు - గిన్‌లైట్ సోపు బట్టలకు వాడుతారు. మన దేశములో డబ్బు దుగ్గాని ఖర్చు లేకుండా బట్టలను

తెల్లగా చేసే ఉపాయం పూర్వ కాలంలోనే అనగా నారద మహర్షి కాలంలోనే కని పెట్టినారు. ఏమిటంటే ఒక పెద్ద కాగులో నీళ్ళు పోసి దానిలో కొంత చౌడు, కొంత పేడ వేసి కలిపి మైల బట్టలు అందులో వేసి క్రింద నిప్పు అంటించి, బాగా ఉడికించుతారు. ఇది నిజము కాదనుకొనే పట్టణవాసులు పల్లెలలోని చాకళ్ళను విచారించితే తెలుస్తుంది.

నారదుడంటే జ్ఞాపకం వచ్చింది. అసలు నారదుడెవరను కున్నారో! ఆయన చాకలిదానికి పుట్టిన రహస్యం చాలా మందికి తెలియనే తెలియదు. చాకలి కులంలో పుట్టినందు వల్లనేమో ఆ నారదునికి కొట్లాటలు పెట్టే దాంట్లో మంచి ప్రవీణత కలిగింది. ఇంతగొప్పవాడు తమ కులంలో పుట్టినగాని చాకలివాండ్లు ఆయనను తలచుకోనే తలచుకోరు.

చాకళ్ళు బండలకు వేసి బట్టలు ఝాడించి కొట్టడం చేత త్వరగానే బట్టలు చినిగిపోవడం మరల క్రొత్తవి తెచ్చుకోవడం, క్రొత్తవాటిని కూడా ఉడికించే అప్పుడు కొంత కాల్చడం, లేకుంటే ఇస్త్రీ చేసే అప్పుడు మాడ్చడం లేకపోతే ఒకరి బట్టలొకరికి మార్చియియ్యడం, లేకపోతే 16 మూరల చీరను 8 మూరలుగా మార్చుకొని తేవడం ఇట్లాంటి ఘోరాలు చాలా చేస్తూ వుంటారు.

అయినా చాకలి వాండ్ల కిచ్చిన మర్యాద మరే జాతికిని కూడా హిందువు లియ్యలేదన్నమాటే. ఎట్లంటే చదువుకొన్నాళ్ళకంటే చాకలోండ్లే మేలని ఎన్నడో పూర్వ కాలంలోనే నిర్ణయం చేసి పెట్టినారు. ఇంతేకాకుండా వారే నిజమైన దాతలట. తీసుకపోయిన బట్టల అట్లే మాయం చేస్తూవుంటే లోకంలో మళ్ళీ జనులు నగ్నులు కావలసిందే కదా! అందుచేతనే పూర్వమొక పెద్దమనిషి ఒక వూరికి పోయి ఆ వూరి పెద్దమనిషితో ఇట్లా సంభాషించినాడట.

"కో దాతా ?"

"రజకో దదాతి వసనాన్ ప్రాతర్గృహీత్వానిశి"

"అయ్యా యీ వూర్లో దాత యెవ్వడు" అంటే "చాకలోడే దాత !" అతని పుణ్యమా అన్నట్లు పొద్దున్నే బట్టలు తీసుకొని లెక్క తప్పకుండా రాత్రి కంతా ముట్టచెప్పుతాడండీ స్వామీ! అన్నాడట ఆ వూరి పెద్దమనిషి.

అయినా యీ చాకలివాండ్లు పెట్టే ముప్పుతిప్పలకు భయపడిన త్రిమూర్తుల గతి యెట్లయిందనగా-

"చాకివానితోడ జగడాలు పడలేక
సిరి గలాడు పట్టు చీర గట్టె
శివుడు తోలు గప్పె సీ! యని మదిరోసి
భైరవుండు చీర పారవైచె"

చాలా మంది పెద్ద పెద్ద వేదాంతులు, త్రిమూర్తులలో విష్ణు వెందుకు పట్టు పీతాంబరం కట్టుతాడు. శంకరుడు ఏనుగుతోలెందుకు కట్టుకున్నాడు భైరవుడు సిగ్గూ శరమూ లేక దిస్సమొలతో ఎందుకు తిరుగులాడుతాడు అనే విషయాన్ని చర్చించి చర్చించి యెక్కడికీ నిర్ణయించలేకపోయిరి. యిప్పుడర్థమైందా వానిలోని నిజమైన తత్త్వం.

చాకలివాండ్లు ఇంకా చాలా చాలా అన్యాయాలు చేస్తారు. వారెప్పుడూ బట్టలు కొననే కొనరు. మంచి మంచి దొరలవి దొరసానులవి బట్టలు తమ కంటికి నచ్చినవి కట్టుకొని తిరుగుతుంటారు. పైగా బీదవాండ్లకు పెండ్లి పేరంటాలకని కిరాయకు మంచి మంచి బట్టలిస్తారు. ఇంతేకాదు, పల్లెలలో పెద్దపెద్దవాండ్ల ఇండ్లల్లో శుభకార్యాలైతే ఊరేగింపులప్పుడు వారు నడుచుటకుగాను ఊరివారి చీరలు బాటలలో పరుస్తారు. పాపము! ఎందరివో సుందరాంగుల కోమల శరీరాల నలంకరించే చీరెలు మోటువారి కాళ్ళ చెప్పుల క్రింద త్రొక్కబడుతూ ఉండును.

బట్టలు కట్టేవాండ్లకు ఒక్క చాకలివాండ్లతోనే కాదు అవస్థ. వారికంటే యెక్కువ నష్టము చేసి కొంపలు తీసేవాడు దర్జీవాడు. పూర్వకాలంలో మన దేశంలో దర్జీల కంతగా పనిలేకుండేది. కాని ఇంగ్లీషువారు వచ్చిన తర్వాత దర్జీల పంట బంగారు పంట అయింది. ఇదొక్కదానికే ఇంగ్లీషువారి విగ్రహాలను చేసి దర్జీలు పూజించుకుంటే తప్పులేదంటాను.

మన దేశంవారు ఇంగ్లీషువారి వలెనే కోటు సూటు వేస్తే గౌరవం దొరుకుతుందని సూట్లు వేయబట్టిరి. ఆ సూట్లను కుట్టుటకై విపరీతమైన కూలీ యియ్యవలసి వస్తుంది. సికింద్రాబాదులో ఉండే ఇంగ్లీషు కంపెనీలో పోలీసు డ్రెస్సు ఒక్క సూటు కట్టించుకుంటే 300-400 రూపాయీల కూలీమాత్రమే అవుతుందట. ఇక మామూలీ సూట్లకు 15 నుండి 50 రూపాయల వరకు కూలి తీసుకునే దర్జీలు చాలా మంది వున్నారు. కూలీతో మాత్రమే గ్రహచారం పోదు. బట్ట కొలతలలో కొంత కొట్టివేస్తారు. అస్తరు గిస్తరు పేరు చెప్పి కొంత కొట్టివేస్తారు. యిట్లా ఎన్ని విధాలనో క్షౌరం కావలసివస్తుంటుంది.

ఇప్పుడిప్పుడు పాశ్చాత్య దేశాలలో మళ్లీ బుద్ధితెచ్చుకున్న కొందరు స్త్రీ పురుషులు నగ్న సంఘాలను స్థాపించి చాకలివాండ్ల నోట్లో దర్జీవాండ్ల నోట్లో దుమ్ము కొట్టినారు. నగ్న సంఘములో చేరిన తర్వాత బట్టల గౌరవం తగ్గేదానికి మారుగా హెచ్చుతుందని నా అభిప్రాయం. ఇప్పుడు మన దేశములో వుండే భోగంవారంతా నగ్నంగా తిరిగితే వాళ్ళలో నూటికి 90 మంది గుట్టంతా బయట పడి వారి జీవనాధారమే ఆగిపోతుంది. మరియు మగవాళ్ళలో లావైనవాళ్ళు, పొట్టలు పడినవాళ్ళు, వికారాకారములు గల అవయవాలు కలవాళ్ళు వీరి గుట్టంతా బయటపడుతుంది. బట్టలు తీసివేస్తే, ఇంకో విషయం. మనదేశంలో బట్టలను గురించి కలహాలు కలుగుతూ వుంటవి. అదేమిటంటే ప్రపంచములో యెక్కడ లేని తమాషా మన హిందూస్థానంలో వుంది. యూరోపులో అమెరికాలో ఫలాని దేశమువాడు అని ఒక మనిషిని బట్టలు చూచి గుర్తించలేము. కాని మన హిందూస్థానంలో మన వేషాలే మనల పట్టించుతవి.

సాహెబులకు ఎర్రరుండా వంటి టోపి, హిందువులకు ధోవతి చూస్తూనే చెప్పవచ్చును. విభూతి లింగాన్ని చూచి జంగమని, నామాలను చూచి వైష్ణవులనీ, జందెము పింజకట్టు చూచి బ్రాహ్మడనీ, చంకలో సంచి చూచి మంగలనీ యీ ప్రకారంగా యించుమించు అందరినీ గుర్తించవచ్చును. ఆదేవిధంగా స్త్రీలలో బెంగాలీని, పార్సీని, గుజరాతీని, అరవస్త్రీని, ఘూర్కాను, మరాటీలను, ఆంధ్రులను ఎవరినైనాసరే చీరకట్టును చూచే గుర్తించవచ్చును.

అయితే యీ యిబ్బందుల కంతా ఒకటే మందు ఏమనగా నగ్నత్వము అని అంటిని కదా. దీనిని కనిపెట్టినది పాశ్చాత్యులే అని అనుకోవడం తప్పు. 2500 ఏండ్ల క్రిందటనే మన దేశములో జైనులు మొట్టమొదట నగ్న సిద్ధాంతమును కనిపెట్టినందులకు వారి గొప్పతనాన్ని ఎంత పొగడినా చాలదు. బట్ట విడిచేసి తిరిగే పురుషుడు త్రిలోకీ విజయుడు అని చెప్పవలసినదే. ఎందుకంటే

"లజ్జామేకాం పరిత్యజ్య
త్రిలోకీ విజయీభవేత్"

అన్నారు శాస్త్రజ్ఞులు. మగవాని కథే యిట్లుంటే స్త్రీలను గురించి యింక చెప్పేదేముంది. కాని హిందువులెంత దుర్మార్గులో యేమో జైన సిద్ధాంతాన్ని నాశనం చేసి అందరికీ బట్టలు కట్టించి తుదకు కర్మ పరిపాకం చేత తామున్ను బానిసలై పోయిరి.

వేమన యోగి కూడ నగ్నతత్త్వాన్ని బోధించినవారే. వారేమన్నారనగా

"తల్లి గర్భమందు తా బుట్టినప్పుడు
మొదలు బట్టలేదు తుదిని లేదు
నడుమ బట్టగట్ట నగుబాటు కాదొకొ
విశ్వదాభిరామ వినరవేమ"

ప్రపంచంలో పురుషుల్లోను, స్త్రీలల్లోను తరహాలు తరహాలుగా వస్త్రాలంకారాలు చేసుకుంటారు. అందరికంటె మితవాదులైనవారు నీగ్రోలు. ఆఫ్రికాలోని సిద్దీలు స్త్రీలుగాని, పురుషులుగాని నిన్నమొన్నటివరకు నగ్నంగానే తిరిగేవారు. కాని పాశ్చాత్యు లాదేశంలో కూడ మన దేశంలోవలె ప్రవేశించిన తర్వాత వారికి బట్టలుకట్టే నాగరికతను నేర్పబట్టినారు. మొట్టమొదట డేవిడ్ లింగ్‌స్టన్ అనేవాడు ఆఫ్రికాకు పోగా అచ్చట సిద్దీలు అతని బట్టలు చూచి ఆశ్చర్యపడి బట్టలలోపలి శరీరం ఎట్లుంటుందో అని బట్టలన్నీ విడిపించి పరీక్ష చేసినారట: పాశ్చాత్యులెంత నాగరికత నేర్పినా యిప్పటికి ఆదేశంలో నగ్నత్వం పూర్తిగా పోలేదు. ఆదిమనివాసు లేదేశంలో వున్నా సరే - ఇండియాలో గోండులు, నీలగిరి

ఆటవికులు - ఆస్ట్రేలియా అడవివారు, ఆఫ్రికా సిద్దీలు దక్షిణ అమెరికా రెడ్డిండియనులు, - మున్నగువారంతా బట్టలపై భ్రమలేనివారు. నాగరికత హెచ్చే కొలది బట్టలపైన ప్రీతి యెక్కువౌతుంటుంది.

హిందువులు ధోవతి, ముసల్మానులు లాగులు, పాశ్చాత్యులు సూట్లు, జపాను, చీనావారు లుంగీలు - ఈ ప్రకారంగా నానా దేశాలలో నానా విధాలుగా బట్టలు కట్టుకుంటారు. ఇవన్నింటిలో యేది శ్రేష్ఠమని నిర్ణయించేదే కష్టము. అయినా గువ్వల చెన్నడు అనే ఆంధ్రకవి పూర్వమిట్లు తన నిశ్చితాభిప్రాయము ప్రకటించి వుండెను.

"అంగీలు పచ్చడంబులు
సంగతిగాశాలు జోళ్లు సరిగంచుల మేల్
రంగుల దుప్పటులన్నియు
గొంగడి సరిపోలవన్న గువ్వలచెన్నా"

# చాక్యార్లు

మలబారులో చ్యాక్యార్లు అను బ్రాహ్మణ జాతి యొకటి కలదు. ఈ జాత్యుత్పత్తి విషయమయి యనేకులనేక విధముల వ్రాసియున్నారు. నాగమయ్య తన మాన్యూలులో వీరు శ్లాఘ్య వాక్కుకారులగుటచే నా పదమే యపభ్రంశమున 'చాక్యార్లు' అయ్యెనని వ్రాసియున్నాడు. ఈ జాతి మొదలు నంబూద్రీ బ్రాహ్మణులలో జేరినదయి కొన్ని యాచార లోపములచే నేటి కాలమున నించుక హీనముగాఁ జూడఁబడుచున్నది.

ఈ చాక్యార్లు మన యాంధ్రమున భాగవతుల రీతి కథా కాలక్షేపము చేయువారై నాటక ప్రదర్శనములచే లోకుల రంజింపఁజేయువారే కాక, హాస్యమునకు నిధులయి పాండిత్య ప్రకర్షచే కవులయి గౌరవముతో భావింపబడుచున్నారు. వీరి నాటకమును ''చాక్యారుకూతు'' అని చెప్పెదరు. వీరి ప్రదర్శనము కొన్ని సమయములందనేక దినములవఱకు జరుగుచుండును. వీరి ప్రదర్శనమును థర్స్టన్ ఇట్లు వర్ణించినాడు. ముఖ్య పాత్రయైనవాడు ముక్కాలి పీటపై కూర్చునియుండును. జలతారంచులు కల యొక పెద్ద తలపాగను చుట్టియుండును. రంగులయంబుగల పెద్ద వస్త్రము నొకదానిని నడుము చుట్టును మడతలు మడతలుపడ చుట్టియుండును. అతని వెనుక నొక నంబియారు ఘటవాద్యముతో నిలచియుండును. అతని ప్రక్కన యొక నంబియారు స్త్రీ నిలిచి యుండును. చాక్యార్లు సభ్యుల నవ్వించు చుండినను నిశ్చలముగా గూర్చొనినట్టి యొక ప్రదర్శకుఁడొక మూల నుండును. ఇతఁడెప్పుడైన నించుక నవ్వినట్లయిన చాక్యారు తన కథను చాలించును. ఒక తూరి చాక్యార్లు మహాభారతమందు దుర్యోధనుఁడొక పల్లియ సయితము పాండవుల కివ్వననుట ప్రదర్శించుచుండ పాండవ పక్షపాతియైన యొక సభ్యుడు మైమఱచి సభారంగమునకురికి, ఓరి, పాప మాపాండవులింతగా దీనులయి వేడుచుండ యొక యంగుళపు భూమియైన నొసఁగననెదవా, యని దుర్యోధన పాత్రధారిని చావమొత్తెనట! అప్పటినుండియు చాక్యార్లు కూతును గృహములలో ప్రదర్శింపక దేవాలయములందే ప్రదర్శింపవలయునని శాసించిరట.

నంబూద్రీలలో "సాధన" యను నొక పంచాయతీ సభ కలదు. అందు నంబూద్రీ స్త్రీ యెవ్వతెయయిన వ్యభిచరించినటుల వ్యక్తమయిన నామెనీ "సాదన" యందు విచారించి యామెను, యామెతో వ్యభిచరించిన వారిని బహిష్కరించెదరట! అట్టి సందర్భములందు వెలియయిన జాతులలో చాక్యారు జాతి యొకటి యని కొందఱి మతము. ఈ చాక్యార్లేది ప్రదర్శించినను "శకుంతలా నాటకము" జోలికిఁబోరఁట! దానికి కారణమిట్లు చెప్పెదరు. ఏదో యొక్క సందర్భమున యొక పాత్ర రెండు ప్రక్కల యొకేమారు చూడ తటస్థించగా దాని నభినయింపఁబోయి యంధుఁడయ్యెనఁట!

వీరు ప్రదర్శించు నాటకములు, కథలు సంస్కృతమందే యుండును. వారు మళయాళములో వ్యాఖ్యానముచేసి సభాసదుల రంజింప జేయుదురు. అనేక సందర్భములందు వీరు తాము రచించిన శ్లోకములను జదివి వాని యర్థమును దినములకొలది విపులముగాఁ జెప్పుచుందురట. ఆ శ్లోకముల వీరెవ్వరికిని జెప్పరట. కాని కుతూహలులు కొందరా సమయములందు దొరికినన్ని వ్రాసుకొని యుంచుదురు. నాకుఁ గొన్ని యొక మిత్రుఁడీ క్రింది వానిని వ్రాసియిచ్చెను.

పరశురామునికిని, శ్రీరామునికిని జరిగిన వాదమును దెల్పు నీ క్రిఁది శ్లోకము.

శ్లో॥ రేరే రాజకులాధమ - ప్రకటింత బ్రాహ్మణ్యస్త్రైరిద్ద
నవ్వేకాం రజనీచరీం త్వమధీత్ - మాతానమే తాటకీ
నిక్షత్రా పృథివీమయా ననుకృతా - కోహంభవాన్ సత్యవాక్
ఇత్థం భార్గవ రోష పోషణ వరఃతస్థౌ రఘూణాంపతిః॥

పరుశురాముడు రామునితో "ఓరీ రాజకులాధమాయని పలుక రాముడు నీ యస్త్రములను జూచినంతటనే నీ బ్రాహ్మణ్యముగు త్తయ్యెను. అనగా నీ వెంత యుత్తముడవో తెలిసెను అని పల్కెను. అంత పరుశురాముడు, నీవేకదా నిస్సహాయ మైన యాడుదానిని జంపినది. అనగా రాముడు అయితే తాటకి నా తల్లి కాదు లెమ్ము, అని గూఢముగా నాక్షేపించెను. మరల పరుశురాముడు "నేనెవ్వరు తెలియునా? ప్రపంచములోని క్షత్రియులందఱిని నాశన మొందించినవాడనని గర్వముతోఁబలుక రాముడు అయితే నేనెవ్వడను, నీ సత్యమెట్టిదని "పల్కెనట"!

శ్లో॥ రామాయ ప్రతిపక్ష కక్ష శిఖినేదాస్యామి వామైథిలీమ్
యుద్ధే రాఘవ సాయకై ర్వినిహతస్స్వర్గం గమిష్యామి వా
నీతిజ్ఞే!! కథయస్వ, దేవి! కథమః పక్షో గృహీత స్త్వయా
సుశ్రావ్యం ప్రియ మస్మదీయ మభవ న్మాతాsవశేషం బలం

ఇంద్రజిత్తు చనిపోయిన తర్వాత రావణుడు భీతిచే తన భార్యను కర్తవ్యమును విచారించు విషయమును పర్ణించుచున్నది పై శ్లోకము. దానికి మండోదరి ఈ క్రింది శ్లోకమున ప్రత్యుత్తర మొసంగు చున్నది.

శ్లో॥ దృష్ట్వాదైన్యం భగిన్యాః సునయ! ఖరవధం మాతులస్యాపినాశం
సాలానాంభంజనం తత్కపివరనిధనం తచ్చ సుగ్రీవ సఖ్యం
కర్మాణ్యుద్యాన హర్తుః జలనిధి నియమం యేన జాత స్తదానీం
సోయం నష్టే కులేస్మిన్ కథమితర్జాయతే తేవివేకరిః

ఈ శ్లోకం మందు వాలిపేరు చెప్పక తత్కపివర యని చెప్పుటచే రావణునికి భీతి కలిగించుట, అట్టి వానినే చంపినవాడు గాన రాముని శక్తి చూపించుట విశేషము. అదే రీతి హనుమంతుని ''ఉద్యాన హర్త'' యని సంబోధించినది. ఇట్లందరును చచ్చియుండ యిప్పుడా నీకు వివేకము వచ్చినది. అని రావణుని భార్య యాక్షేపించెనట !

తుదకు రావణుఁడు యుద్ధము జేయు సమయమున యతడు దశముఖుడు కాన కవి చమత్కారముగా నవరసములకు మారుగా దశరసములు రావణుని యందుఁ గనబడెనని క్రింది శ్లోకమందు వర్ణించి యున్నాడు.

శ్లో॥ నాశ్చర్యం రామభద్రే సచటుభట ముఖే సవ్యథం దేవతార్యే;
నాశం యుద్ధే న కోపం కపిషు సవినయం లక్ష్మణే సాశ్రుపూర్వాం
సాసూయం భాతృ కృత్యే, సభయ మనిలజే సత్ర పంచాత్మ వృత్తా
ఇత్యేవం వక్త్రి చక్రం రజనిచర పతే ర్భిన్న భావం బభూవ

రావణుడు యుద్ధము సేయు సమయమున తమ్ముడగు విభీషణుని జూచి యసూయతో (సాసూయం) నిట్లు పలికెను;

శ్లో॥ సత్యం నామ వయం విభీషణ పరిత్యాజ్యా వనస్థాంగతః ।
త్వంచాస్మ ద్వచనాపరాధకుపిత స్సవ్యశ్చ్రితో రాఘవం
ఏ తత్వా మనుశోచతే దశముఖో దృష్ట్యా కయోద్వీక్షసే
కౌసల్యాతనయానువృత్తి జటిలం మిత్రం సుమిత్రాత్మజం ॥

కౌసల్యా తనయుని యందు సుమిత్రాత్మజునికెంత భక్తి యున్నదో యంత భక్తి యొకే తల్లికి జనించిన నాయందు నీకు లేకపోయెను గదా యనియు, నా మాటలకు నీవు కోపించిన తూష్ణీంభావమైన వహింపక (సద్యః) తక్షణమే రాఘవుని పక్షమున జేరుటచే నీ యందు ధర్మచింత కాక ద్రోహ చింతయే యున్నదనియు రావణుడు విషాదముతోఁ పలుకుచున్నాడు.

ఇట్టి శ్లోకము లనేకములున్నను నాకు లభ్యములైన వివియే. తక్కినవాని నింకను ప్రయత్నించు చున్నాను.

ఈ చాక్యార్లు హాస్య రస ప్రధానులు. వారికి రాజానుగ్రహము మెండు. ఒక మారు దామోదరన్ అనువాడు మహోదర వ్యాధితో జిక్కి ప్రదర్శించుటను మానగా నచ్చటి రాజు వీనిని జూచి "ఓయి దామోదరన్ నీ స్థితి నాకు వ్యసనము గలిగించెను. అని పలికిన వెంటనే యితడు, స్వామీ! నన్నింక దామోదరన్ అని పిలువకుడు. మహోదరన్ అని సంభోదింపుడు" అని పలికెనఁట.

మళయాళములోని పూజారులను శాంతి విప్రులనెదరు. ఒక చాక్యారుతో శాంతి విప్రి డొకనాడు చాలసేపు మాట్లాడి శాంతికి (పూజకు) వేళయైనది పోవలయును అని చెప్ప ఓయి మీ శాంతి యెట్టిదో నాకు దెలియును అని యిట్లాశువుగా శ్లోక మొకటి రచించెనట.

శ్లో॥ శాంతి ద్విజః ప్రకురుతే బహు దీప శాంతిం
పక్వాజ్య పాయస గుళైర్జఠరాగ్ని శాంతిం ।
తత్రత్య బాల వనితా మదనాగ్ని శాంతిం
కాలక్రమేణ పరమేశ్వర శక్తి శాంతిం ।

దీపార్చనలకై యిచ్చిన నూనెను భక్తులు తరలినంతటనే దీపముల నార్పి బుద్ధితో నూనె నింటికి తీసుకొని పోవుట చేతను స్వామి కల్పించిన పాయసాన్నములతో తమ పొట్టల నింపుట చేతను, తిన్నగా దేవుని శక్తిని సహితము పోగొట్టువారని చెప్పెనట ! ఈ శ్లోకమువంటి దొకటి ఆంధ్రదేశములో ఈ విధముగా ప్రచారమందున్నది.

పూర్వ జన్మని చోరత్వాత్
జారత్వా దిహజన్మని
అరిత్వాద్దేవ పూజాయాం
పూజారి రితి కథ్యతే ॥

# మన కవసరమగు చరిత్రలు

సృష్టి యంతయు చరిత్రాత్మకమే. దాని నిజమైన చరిత్ర ఆ సృష్టికర్తకే యెరుక. సృష్టిలో మానవుడొక్కడే చరిత్ర వ్రాయగలవాడు. కాని వానికి తన చరిత్రయే తెలియదు. మానవ చరిత్ర మనకు 6000 సంవత్సరముల కంటె ఎక్కువగా తెలియదు. అంతకుపూర్వముదంతయు ఊహలతో నిండినది. చరిత్రను సైన్సుతో లంకెపెట్టి ఈ కాలమం దనేక పరిశోధనలు చేస్తున్నారు. తత్ఫలితముగా మన కనేకాద్భుత విషయాలు తెలియవస్తూ యున్నవి.

చరిత్ర యొక్క నిరూపణమును నిరుక్తమును ఉద్దేశమును గూర్చి పలువురు పలువిధములగు అభిప్రాయములను 2500 సంవత్సరాల నుండి యిస్తూ వచ్చినారు. ప్రాచీన గ్రీకు వేదాంతియగు డయొనీషియస్ "నిరూపణములతో బోధించు తత్త్వశాస్త్రము చరిత్ర" అని చెప్పెను! ఒక శతాబ్దమునకు పూర్వమందుండిన డాక్టర్ ఆర్నాల్డు ఇట్లనెను. ''సభ్య మానవుని ఆంతరంగిక జీవితమును సన్నిహితముగా స్పృశించి వాని సాంఘిక రాజకీయ సాంప్రదాయక నిర్మాణముల నిమ్నోన్నతముల నిరూపించుటే దాని ముఖ్యోద్దేశము''

నాగరిక మానవ చరిత్రయే సరియగు చరిత్ర యను భావము పూర్వకాలముదై పోయినది. ఆటవికుల చరిత్రయే యీనాడు మానవుని అతి ప్రాచీన చరిత్ర కుపకరిస్తున్నది.

## మన పూర్వులలో చరిత్రలు :

ఇతరుల సంగతికంటే ముందుగా మన సంగతినే తెలుసుకొందము. హిందువులు చరిత్రలు వ్రాయు నలవాటు లేనివారు. బ్రహ్మ సత్యం జగన్మిథ్యా అనియు, సర్వం క్షణక్షణికమేవ అను జైన బౌద్ధ నినాదాలను హిందువులు స్వీకరించి, ఈ మూన్నాళ్ళ ముచ్చటతో చచ్చేదానికి కూడా చరిత్ర కావలెనా అని నిస్పృహులై చరిత్రలు వ్రాసిపెట్టిన పాపాన పోలేదనియు తెల్లవారు బాగా

ప్రచారము చేసిరి. కాని అది పూర్తిగా అంగీకరింప దగినది కాదు. ఋగ్వేదము కంటె ప్రాచీనమగు గ్రంథము ప్రపంచమందు లేదని వారంగీకరించినారు. అంతటి ప్రాచీన గ్రంథములో ఒక అక్షరము హెచ్చుగాక తచ్చుగాక నేటి వరకు రక్షించుకొని వచ్చిన వారికి చరిత్రాభిమానము లేదనగలమా? మన పురాణాలన్నియు మన చరిత్రలే కాక మనకు పశ్చిమముగా ఉత్తరముగా నుండిన తార్తరీ, తుఖార, ఈరాన్, కాస్పియన్ సముద్ర తీర దేశాలు, బాబిలోనియా, అసిరియా, ఫ్రిజియా, వంటి దేశాల చరిత్రలు కూడ అందుండెను. ఆదికాలములో అనగా 2500 ఏండ్లకు పూర్వము ఏర్పడిన పురాణాలలో సరియగు చరిత్ర లుండెనని ఊహించుటకు కావలసినన్ని నిదర్శనములు కలవు. కాని క్రీస్తు శకాద్యనంతరము పురాణాలలో హస్త క్షేపము చేయుచూవచ్చిన వారికి ప్రాచీనుల భౌగోళిక చారిత్రక పరిజ్ఞానము శూన్యమగుటచేత సప్త సముద్రములను, సప్త ద్వీపాలను పిచ్చిగా వర్ణించి రాక్షస కిన్నర పిశాచాసురాదులను సృష్టించిరి. ఈ వర్గాల వారందరును మన కుత్తరమున పశ్చిమమున నుండు దేశాలలోని ప్రాచీన జనులేయనియు, సప్త సముద్రాలన్నియు అచ్చటి నదులన్నియు, సప్త ఖండాలున్నూ అచ్చటి దేశాలనియు బాగా నిరూపించుట కేసందేహమునూ లేదు. పురాణాలపై చేతులు వేసినవారు మనకు గొప్ప అపకారమును చేసిపోయిరి. మనలో విద్యా ప్రయత్నమునకు తక్షశిల, నలందా, అమరావతి, కాశ్మీరము, కాశి, మధురాది విద్యా పీఠముల దివ్య చరిత్రయే సహస్ర విధముల చాటుతుంది. ఒక్క తక్షశిలలోనే 10 వేల విద్యార్థులు, చీనీ, ఈరాన్, ప్రాంతాలనుండి వచ్చిన వారును ఉండి రనియు, 2000 మంది ఆచార్యు లుండిరనియు, శత సహస్ర గ్రంథముల భాండాగారము (రత్నగంజ) యుండెననియు, ముస్లిముల మొదటి ధాటిలోనే అవన్నీ అగ్గి పాలయ్యేననియు, ముస్లిములు ఆక్రమించిన ప్రతి ప్రాంతములో గ్రంథములను దగ్ధము చేసిరనియు తెలిసికొనిన మన అమూల్య సంపద ఎంత నాశనమయ్యెనో తెలుసుకొనవచ్చును. ప్రపంచ వాఙ్మయములో మొదటి కవిత మనది, మొదటి అర్థశాస్త్రము మనది, మొదటి వైద్య గ్రంథము మనది, మొదటి చిత్రలేఖనము మనది, మొదటి కామశాస్త్రము మనది; మొదటి కథ మనది; మొదటి వ్యాకరణము మనది. ఈవిధముగా లెక్కించి వివరించుచూ పోయిన గ్రంథము చాలా పెరిగిపోవును. మన పూర్వులు చరిత్రలు వ్రాసినవారు కారనుట ఉత్ప్రేక్షాతిశయాలంకారములలో చేర్చదగిన మాటలు.

## ఇతర ప్రాచీన చారిత్రక దేశాలు :

పూర్వ కాలములో అసీరియా (అషుర) దేశము చాలా గొప్ప సభ్యత గలది. అచ్చటివారు పచ్చి యిటికలపై వ్రాసి వాటిని కాల్చి గ్రంథములుగా వాడుకొనిరి. హట్టి, ఖస్సీ, జాతుల వారును ప్రాచీన నాగరిక జాతులవారు. బాబిలోనియాయు అట్టిదే. ఫినీషియా జాతివారు మధ్యధరా సముద్రమందును, హిందూ మహాసాగర దేశాల యందును విరివిగా వ్యాపారమును చేసినవారు. వ్యాపారముతో పాటు వివిధ దేశ సంస్కృతుల వ్యాపింప జేసినవారు. ఈజిప్టు (మిశ్ర) దేశముయొక్క చరిత్ర 6000 ఏండ్లనుండి లభిస్తున్నది. ఫీనీషియనుల ద్వారా హిందూ దేశమునకు ఈజిప్టు వారి ఆచారములు విశ్వాసములు శిల్పములు కొన్ని దిగుమతి యయ్యెనని కొందరి పాశ్చాత్య పరిశోధకుల అభిప్రాయము. ఫ్రిజియా దేశము వారు 2500 ఏండ్ల క్రిందట తాము భృగుజాతి వారమని చెప్పుకొనిరి. మన పౌరాణిక భార్గవులు ఫ్రిజియా వారా లేక మనవారే అచ్చటికి వలసపోయి, రాజ్యస్థాపకులైన వారా? పరిశోధనీయమగు విషయము. గ్రీకు దేశము (యవన) క్రీస్తు శకానికి బహుపూర్వమే 500 ఏండ్ల పాటు సర్వకళ లందు పురోగాములై ప్రపంచానికి అందు ముఖ్యముగా యూరోపు ఖండానికి జ్ఞాన భిక్ష పెట్టెను. తర్వాత రోము సామ్రాజ్యము 500 ఏండ్లపాటు జగజ్జేగీయ మానముగా వెలిగెను. యూరోపు ఖండ జనులందరును యవన రోమక మానస పుత్రులు. ఈరాను వారు మన రక్త సంబంధులై యుండిరి. నిజముగా ఈరానే ఆర్యుల ఆది దేశము. నేటి ఆజుర్ బాయజౌన్ జరథుస్త్రుని కాలమందు "ఆర్యబీజ" నామముతో ప్రసిద్ధిగాంచెను. "ఈరాన్‌లోని భాగమునే ప్రాచీనమందు "ఆర్యాణము'' అనిరి. వారిలోను చరిత్రలు బాగా వెలసియుండెను. అరబ్బులు ఇస్లాం మతాన్ని పుచ్చుకొన్న ఆదికాలములో మతోద్రేకముతో యూరోపు ఆఫ్రికా ఏషియా ఖండాలలోని భాగాలను జయించిరి. వారు కొంత నాశనము చేస్తూ పోయినను వారు గొప్ప నాగరికత కలిగియుండిన జాతి యనియు వారే వైద్యాన్ని అంకబీజ రేఖాది గణితములను వృద్ధి చేసిరనియు ఇట్టివెన్నో వారి సృష్టియే యనియు 19వ శతాబ్ద్యంతమువరకు తెల్లవారు ప్రచారముచేసి తుదకు ఈ శతాబ్దములో అరబ్బులు వ్యాపారస్థులే యనియు తమ సరకులతో పాటు హిందువుల సంస్కృతిని తీసుకొనిపోయి యూరోపులో దిగుమతి చేసినవారే యనియు ఆ పాశ్చాత్యులే గుర్తించిరి. ఏమైన అరబ్బులు కూడా మంచి చిత్ర కారులేయని పేరు హొందిరి.

## ఆంగ్ల చరిత్రకారులు :

మనకు ఇంగ్లీషు జాతితో లంకె కుదిరిన తర్వాత నష్టాలున్నూ లాభాలున్నూ ఇంచుమించు సమభాగాలుగా సంక్రమించినవి. లాభాలలో చారిత్రక దృష్టి గాఢమై ఆధునికమై విజ్ఞానప్రదమైన దొకటి. ముసల్మాను ప్రభువుల మూలాన నాశనమై దగ్ధమై దిబ్బలై పూడిపోయిన మన కళలను ఇంగ్లీషు వారు పైకి దీసిరి. మన వేదాలను, స్మృతులను, పురాణాలను, కావ్యాలను, ఇంగ్లీషులో చక్కని చారిత్రక పీఠికలతో ముద్రించిరి. ఈ కార్యమందు ఇంగ్లీషు వారు మాత్రమే తోడ్పడినారనుట కాదు. ఫ్రెంచి, జర్మన్, రష్యన్, అమెరికన్ వంటి జాతుల వారున్నూ గొప్ప పరిశోధనలు చేసిరి. మనకు వారి పరిశ్రమ యంతయు ఇంగ్లీషు భాషనుండియే లభ్యమైనందున ఆంగ్ల భాషోపకారమును మనము విస్మరింపజాలము. చరిత్ర కుపయోగకరమగు శాసనములను; తాళపత్రాది గ్రంథములను, ప్రాచీన శిల్పములను ఉద్ధరించి రక్షించి పరిశోధించి మన కందించిన కీర్తి ఇంగ్లీషు వారికి చెందును. అయితే ఒక దిక్కు ఇట్టి ప్రయత్నాలు జరిగినను మరొకదిక్కు ఇంగ్లీషు ప్రభుత్వము పరిపాలక దృష్టితో తమ సంస్కృతికి ప్రాధాన్య మిచ్చి భారతీయుల కొంచెపుదనమును చూపించి చరిత్రలు వ్రాసి విద్యార్థులచే చదివించిరి. కొందరు మిషనరీలు మత దృష్టితో గ్రంథాలు వ్రాసి మనల నవమానించిరి. మరి కొందరు తెలిసియో తెలియకయో మన పూర్వ చరిత్రకు ప్రాధాన్యమియ్యక పోయిరి. మన కళాశాలలలో గ్రీసు, రోము చరిత్రలు చదివించిరి. కాని, మనకు సంబంధించిన ఈజిప్టు చీనా, అసిరియా, ఖాల్డియా, పర్షియా, బర్మా, మలయా, ఇండోనీషియా, ఇండోచీనా చరిత్రలో నేవియు చెప్పింపలేదు. ఇంగ్లీషువారు వ్రాసిన చరిత్రలలోను వారి విజ్ఞాన కోశాలలోను మనలోని గొప్పవారిని గురించి ముచ్చట్లు కానరావు. లోకోత్తర చిత్రలేఖనములలో అజంతా పేరే లేదు. లోకోత్తర శిలా శిల్పములలో మన ఎల్లోరాను స్మరించుట అరుదు. యూక్లిడ్ సూత్రాలనే పేర్కొందురు కాని మన శుల్బ సూత్రాల నడుగరు. మన వరాహ మిహిరుడు, లీలావతీ కర్తయగు భాస్కరాచార్యుడు వారికి కానరాలేదు. బీజ గణితమును మనము కనిపెట్టితే 'అల్‌జీబ్రా'ను అరబ్బులే కనిపెట్టిరని ప్రచారము చేసిరి. 300 ఏండ్ల క్రిందట వెనిసులో గ్యాలిలియో అను మహా మేధావి పుట్టి సూర్యుని చుట్టే భూమి గిర్రున తిరుగుతుందయ్యా అని అనగానే అతన్ని బట్టి బైబిల్ బోధల నబద్ధ మందువా నీ తల కాచుకో అని పీడించి క్షమాపణ పత్రికను క్రైస్తవా

చార్యులు వ్రాయించుకొనిరి. గ్యాలిలియో నక్షత్రశాస్త్ర మందద్భుత పరిశోధకుడని కీర్తించుతున్నారు కదా అతనికంటె 1200 ఏండ్లకు ముందు క్రి. శ. 476 లో నుండిన మన ఆర్యభటుడు సూర్య సిద్ధాంత గ్రంథము ద్వారా గ్యాలిలియో చూపించిన విషయాన్నే కాక ఇంకా ఇతరాంశములను భూమికి సూర్యునికి భూమికి చంద్రునికి ఉండు అంతరాయమును ఈ నాడు టెలిస్కోపు యంత్రాలతో చూచి గుణించిన పాశ్చాత్యుల లెక్కలకు ఇంచుమించు సరిపోవునట్లుగా ఆనాడే తెలిపి యుండెనుకదా ? అతని పేరెందైనా ఉదాహరింతురా ? అతడు ప్రసిద్ధుడు కాడు. ఆనాడే అతని కీర్తి రోము వరకు వ్యాపించెను. అరబ్బులతణ్ణి అర్జబహార్ అని తమ అస్తవ్యస్తపు బాసలో పేర్కొనిరి. రోమకులు అరబ్బుల నుండి ఆ పేరును గ్రహించి అర్దుబారియస్ అనిరి. పాశ్చాత్యులకు ఈసప్ కలడు కాని గుణాఢ్యుడు కాని విష్ణుగుప్తుడు కాని కానరాలేదు. కాక్, లివింగ్‌స్టన్ ప్రభృతుల చరిత్రలు వ్రాసిరి కాని కాంబోడియాను పాలించిన మన కౌండిన్యుడు కాని చీనాలో 30 ఏండ్లుండి అచ్చటనే చనిపోయిన కుమార జీవుడుకాని, అపర బుద్ధుడు ప్రఖ్యాతుడైన ఆర్య నాగార్జునుడు కాని వారికి జ్ఞాపకము రాలేదు. హార్వీ అను ఆంగ్లేయుడు క్రీ. శ. 17వ శతాబ్దములో శరీరమందు రక్తము ప్రవహిస్తూ వుండును అను విషయము కనిపెట్టితే అతని యా యుపజ్ఞాఫలితమే ఆధునిక పాశ్చాత్య వైద్యానికి మూలకందమని శ్లాఘించిరి. కాని అతనికంటే 1800 ఏండ్లకు ముందు మన హారీతుడు,సుశ్రుతుని కన్న ముందుండినవాడు పాండురోగ నిరూపణములో ధమనులలో అన్నిరసములు రక్తమై ప్రవహిస్తూ వుండునని వ్రాసెను. భావ ప్రకాశమను వైద్యగ్రంథము హార్వీకన్న 100 ఏండ్లు ముందు వెలిసెను. అందుకూడా హార్వీ కనిపెట్టినవిషయాన్నే తెలిపినారు. హారీతుడు ఆత్రేయ పునర్వసు శిష్యుడు చరకాదుల సతీర్థ్యుడు, హారీత సంహితను రచించినవాడు. పాశ్చ్యుయర్ క్రిమి సిద్ధాంతమును కనిపెట్టెను. హారునల్ రషీద్‌ఖలీఫా కాలములో బాగ్దాదులో నివసించి, ఖలీఫా రాజ్యమునకు వైద్యాధికారియై మన వైద్య గ్రంథములను అరబీలోనికి పరివర్తనము చేసిన మంఖుని మనమే మరచినాము. ఇట్టి వనంతముగా కలవు. ఈ పరిశోధనలు చేసి ప్రపంచానికి తెలుపుకొనుట మన విధి.

## చరిత్రల దృక్పథము

ప్రపంచ చరిత్రలో సాధారణముగా యుద్ధాలే యెక్కువ ప్రాముఖ్యము వహించినవి. ఆది కాలములో హూణులు, ఆర్యులు, తార్తారులు, శకులు,

మున్నగు వర్గాలవారు జనసంఖ్య హెచ్చుటచే నలుదిక్కుల వ్యాపించిరి. అట్టి వ్యాప్తిలో ఆదిమవాసులకును దాడిచేసిన వారికిని సంఘర్షణలు జరిగెను. తుద కుభయులును సమాధానపడి మరికొంత కాలానికి దాడివచ్చిన గుంపులతో యుద్ధ ములు సాగించిరి. ఆర్యులు హిందూస్థానములో బహు ప్రాచీనకాలమందు ప్రవే శించి రనవచ్చును. వారు వచ్చిన తర్వాత వారికిని ఇతరులకును అనేక శతాబ్ద ములవరకు సంఘర్షణలు జరిగినట్లున్నది. అందుచేతనే వేదాలలో విశేషముగా శత్రువులను నాశనము చేయుటకై ఇంద్రాది దేవతలను ప్రార్థించిరి. వారికి అసు రులతో, దస్యులతో, దానవులతో, శకులతో. యక్షులతో, రాక్షసులతో యుద్ధాలు జరిగెను. అసురులు అషుర్ (అసీరియా) దేశము వారైనను లేక అహుర పూజ కులయిన ఈరానీ వారైనను అయియుందురు. పూర్వము ఈరాను కుత్తరమందు దహ్యాదేశ ముండెను. అచ్చటి వారినే దహ్యులనిరి. పార్సీ హకారము సంస్కృత ములో సకారమగును. కాన దహ్యులే దస్యులైరి. ప్రాచీనమందే దస్యుజాతి ఈరాను జాతిలో లీనమై తన ప్రత్యేకత కోల్పోయెను. యక్షులు ఆక్సస్ ప్రాంతీయులో, లేక యఛీ అను జాతివారో అయియుందురు. అరక్షస్ నదీప్రాంతము వారే రాక్షసులై యుందురు. డాన్ నదీ ప్రాంతీయులు దానవులు. దైత్యక నది కాస్పి యన్ (క్షీరవాన్ క్షీర) సముద్రములోనికి ప్రవహించును. తత్ప్రాంతీయులే దైత్యులు. పురాణాలు పెంచినవారికి భౌగోళిక జ్ఞానము లేక చిత్ర విచిత్ర కల్ప నలు చేసిరి. ఋగ్వేద కాలములో దాశరాజు యుద్ధము ప్రసిద్ధమైనది. పదిమంది రాజులు కలిసి ఆర్యావర్తముపై దాడిచేయుట, వసిష్ఠుడు ఆర్యుల పక్షమందు, విశ్వామిత్రుడు పరదేశీయుల పక్షమందుండుట అందుకాననగును. ఋగ్వేద పరి శీలనమువల్ల ఇట్టి వెన్నియో వెల్లడి యగును. అట్టిలా అను హూణుడు క్రీస్తుశక పంచమ శతాబ్దమందు మంగోలియా నుండి హంగరీ వరకు రక్త ప్రవాహాలతో మానవ సంహారము చేస్తూ పోయెను. కట్టి దాడులు ఆదికాలమందుండెను. తర్వాత మత యుద్ధాలు వచ్చెను. అందు క్రైస్తవులు, ముసల్మానులు ప్రధాన పాత్ర వహించిరి. అటు తర్వాత వ్యాపార యుద్ధాలు మొదలయ్యెను.

పూర్వ చరిత్రలలో రాజుల వంశావళులకు వారి పరిపాలనలకు వారి యుద్ధాలకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చిరి. ఆదికాలములో రాజులు లేకుండిరి. తర్వాత రాజులు వచ్చిరి. బుద్ధదేవుని కాలమందు చీనాలో మహాపురుషుడుగా

పూజింపబడిన లోట్జి ఇట్లనియుండెను. "అతి ప్రాచీన కాలమందు జనులు రాజుల నెరుంగకుండిరి. తరువాత రాజులేర్పడగా ప్రజలు వారిని ప్రేమించి స్తుతించిరి. అటుతర్వాత రాజులను అసహ్యించుకొనిరి" మన బ్రాహ్మణములు కూడా ఇదే విషయమును తెలుపుతున్నవి. ఐతరేయ బ్రాహ్మణ మందిట్లున్నది "దేవా = సురావా ఏషు లోకేషు సమయతంత .... తాం స్తతో = సురా ఆబుయన్ దేవా = బ్రువన్, న రాజతయా వైనోజయతి రాబూనంకరవా మహా ఇతితథేతి (1,14)"

రాక్షసులచే దేవతలు దెబ్బతిని మనకు రాజు లేనందున ఈ గతి పట్టినది, అని తామున్నూ రాజును ఎన్నుకొనిరి. అనుటచే రాజుల నియామకము క్రమ క్రమముగా ఏర్పడెనని తెలియును. రాజులు క్రమక్రమముగా దుష్టులగుటచే ప్రజలు పలుమారు తిరగబడి రాజుల చంపియో గద్దెనుండి దింపియో పీడను వదలించుకున్నట్లు వేనరాజు కథ నిరూపిస్తున్నది. ఇదే విధముగా యూరోపు చరిత్రలో బహుసంఘటనలు కానవచ్చినవి. మళ్ళీ ఆదికాలపు స్థితిలోనికి ప్రపంచ మంతయు వస్తున్నది. అనగా రాజులను తొలగించి ప్రజారాజ్యములను స్థాపిస్తు న్నారు. "నావిష్ణుః పృథివీపతిః" అను సిద్ధాంతము చేసిన జేమ్సు రాజును అతి ప్రజ్ఞావంతుడగు మూర్ఖుడనిరి. ఈనాడట్టి సిద్ధాంతములను ఏకరువు బెట్టువారికి ప్రజ్ఞావిశేషణమును తొలగించిన పై బిరుదు నియ్యకమానరు.

గ్రీకుల యుద్ధాలు, రోము యుద్ధాలు, ఛార్లమెన్, సలాహుద్దిన్ యుద్ధాలు, క్రూసేడ్, ఖలీఫాల యుద్ధాలు, 30 ఏండ్ల యుద్ధము, నూరేండ్ల యుద్ధము, నేపో లియన్ యుద్ధాలు, తైమూర్, నాదిర్‌షా దాడులు, హిందూముస్లిం యుద్ధాలు ఇవే మనకలవడిన చారిత్రక పాఠాలు. గత శతాబ్దిలో దృక్పథము మారెను. "యథార్థ ముగా చరిత్ర అన్నదిలేదు. అదంతయు జీవితగాథయే" అని యెమర్సన్ పలి కెను. పాశ్చాత్యులలో జీవిత చరిత్రలు కొల్లలుగా కలవు; మనలో గొప్పవారి కందరికినీ మహాత్మ్యము లంటగట్టుట అడ్డాదిడ్డి కథలల్లుట పరిపాటియైపోయినది. మన వేమన యెక్కడివాడో ఎప్పటివాడో తెలియదు. మన కవి కులగురువు కాళిదాసు చరిత్ర మనకు కించిత్తు కూడా తెలియదు. విక్రమార్కుడు కల్పిత పురుషుడో కాడో చెప్పజాలము. మన భక్తులలో 200-300 ఏండ్ల క్రిందట వారికినీ వైకుంఠము నుండి విమానాలు వచ్చి వారిని సశరీరముగా తీసుకొని

పోయెనని మనవారు వ్రాసిరి. మహాపురుషుల చరిత్రలకు మనవారును ఉత్తమ స్థానమిచ్చిరి. 

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః సయత్ప్రమాణం కురుతే లోకస్త దనువర్తతే (భగవద్గీత 3-21)



అని భగవద్గీతయే బోధించెను. కాని మనలో నిజమైన జీవితచరిత్రలు లేవనియే యొప్పుకోవలెను. 

ఈ శతాబ్దిలో మరల దృక్పథము మారినది. ప్రతి దేశచరిత్రలో ఆదేశ సాంస్కృతికి సాంఘిక చరిత్రకు ప్రాధాన్యమియ్యవలెనన్న భావముతో చరిత్రలు వ్రాస్తున్నారు. ఇదే సరియగు విధానము.

## మానవ చరిత్ర :

ఇంచుమించు 100 ఏండ్ల క్రిందట డార్విన్ "పరిణామ" (Evolution) సిద్ధాంతమును లేవదీసెను. ఆనాటి నుండి చరిత్ర నూతన మార్గములందు ప్రవేశించెను. క్రీ.శ. 1891 లో వెస్టర్‌మారన్ అను నతడు "మానవ వివాహ చరిత్ర" అను మహోద్గ్రంథమును వ్రాసెను. మానవుడు స్వాభావికముగ ఏకపత్నీ వ్రతుడే యని క్రైస్తవ బోధకనుకూలముగ అతి చతురతతో తన గ్రంథమున రచింపగ 30 ఏండ్లపాటు అదే మానవ చరిత్ర బైబిల్ అయిపోయెను. 1920 ప్రాంతములో రాబర్టు బ్రిఫీల్ట్ అను పండితుడు "తల్లులు" (The Mothers) అను గ్రంథాన్ని రచించి వెస్టర్ మారన్ సిద్ధాంతాలనన్నింటిని ధ్వంసముచేసి ప్రపంచమంతటను ఆదికాలములో వివాహ నియమములు లేవనియు పశువృత్తియే మానవ వృత్తిగా నుండెననియు గట్టిగా నిరూపించెను. యిప్పుడాతని గ్రంథమే ప్రపంచమంతటను చెలామణి పొందినది. ఈ సిద్ధాంతమునే "తల్లి హక్కు" (Mother Right) అను పేరుతో ఒక జర్మన్ పండితుడు స్థిరపరిచెను. ఆది కాలములో ఒక గుంపువారు యింకొక గుంపు పిల్లలను స్వీకరించేవారనియు, అట్టి స్త్రీలను గుంపు వారందరును కూడుచుండిరనియు నేటికిని ఆటవికులలో ఈ పద్ధతి కలదనియు నిరూపితమైనది. అట్టి గుంపును "టోటెమ్ గుంపులనిరి." మన హిందువులలో గోత్రము లనున విట్టివై యుండును. ఆదికాలమందు బహు

కళత్రతత్వము బహుభర్తృత్వమువుండెను. స్త్రీలు అందరి స్వత్వమన్నట్లుగానే స్థిరచరాస్తులన్నియు ఒక్కొక్క వర్గపు సమిష్టి స్వత్వముగానుండెను. ఆదిలో జనులు తల్లుల నెరిగిన వారేగాని ఏ పురుషునికి జన్మించినది వారికి తెలియదు. అందుచేత తల్లికే ప్రాధాన్యముండెను. వివాహ నిబంధన లేర్పడిన తరువాతనే తండ్రికి ప్రాధాన్యము వచ్చినది. ఆదిమ పురుషునికాలాన్ని శిలాయుగమనిరి. యిది యుక్త యూహగాదు. వేల వేల సంవత్సరముల క్రిందటి పూడికలను త్రవ్వగ అందు మానవాస్తులతోపాటు రాతి గొడ్డండ్లు, రాతిమొనలుగల బల్లెముల వంటివి లభించినవి, తరువాత రాగి, యిత్తడి, యినుము, కనుగొనిరని శాస్త్ర నిపుణులు నిరూపించినారు. ఆదిలో మానవుడు పండ్లు, గడ్డలు, పచ్చి మాంసము తినెనందురు. అగ్నిని తరువాత కనిపెట్టిరి. కట్టెల రాపిడిచే, రాళ్ళ రాపిడిచే అగ్గిపుట్టుట గమనించి ఆదికాలమువారును వాటి రాపిడిచే అగ్గి పుట్టించిరి. గ్రీకు వారు ప్రమిధీయస్ అనువాడు మొదట అగ్నిని దేవలోకమునుండి అపహరించి తెచ్చి మానవులకియ్యగ దేవత లతనిని బంధించి బాధించిరను నొక కథను వ్రాసినారు. ఇది ఆదికాలపు అగ్ని సముత్పాదన కథనమె అని ప్రమిదియస్ అనగా ప్రమదనము అను పదమే నిరూపిస్తున్నది. పాశ్చాత్యులు సైన్సుద్వారా మానవ ప్రాచీన చరిత్రను కనుగొంటున్నారు. ప్రపంచములో ప్రతి ఖండ మందును మిగిలిన ఆటవికుల ఆచార వ్యవహార విశ్వాసాలను సమగ్రముగ పరిశీలించి మన ఆదిమ పురుషుల కాలపు స్థితులనూహిస్తున్నారు. మన దేశ మందును గోండు, కోయ, సవర, చెంచు, తోడ, భీల్, నాగ, సంథాల్ వంటి ఆటవికులు కొల్లలుగా గలరు. కాని వారిని గురించి పరిశోధనలుచేసిన భారతీయులు వ్రేళ్ళ మీది లెక్కలోపలివారె. ఆంధ్రులకు సంబంధించిన చెంచు, గోండు, కోయలు మనము ఏమియు తెలుసుకొన్నవారము కాము. యూరోపు, అమెరికా చారిత్రక పరిశోధకులు ఆదిమానవ చరిత్రకై ఆంత్రాపాలజి, జియాలజి, సెకాల జి, వంటి శాస్త్రాలను ఆధారము చేసుకొని తమ పరిశోధనలు సాగిస్తున్నారు. కాని వారి దృష్టి మన వేదములపై. మనగృహ్య సూత్రములపై మన బ్రాహ్మణములపై, మన పురాణాలపై ప్రసరించుట లేదు. వారింతవరకు నిర్ణయించిన సిద్ధాంతము లన్నియు పై వాఙ్మయములందు లభిస్తూనే యున్నవి. మనకు ప్రాచీనాచారములపై పట్టుదల మెండు. నేటికిని శుభాశుభ కార్యాలలోని మన ఆచారములు ఋగ్వేద కాలమువై యున్నవి. యజ్ఞాలలో నేటికిని కట్టెలను మధించి అగ్నిని పుట్టింతురు.

నేటికిని మట్టి పాత్రలే శుభాశుభ కార్యాల కవసరము. 'మృణ్మయం దేవ పాత్రం' యని అన్నారు. నేటికిని ఒడికిన దారమే పవిత్రము, ఉన్ని దారమే కొన్నింటికి కావలెను. ఇట్టి వెన్నియో వేదముల నుండి విశదమగును. ప్రాచీన కాలములో బహు దేశములలోను, ఆటవికులలోను, చీనా అరలు లొర్రరీ వంటి దేశాలలోను మనుష్య భక్షణ ముండెనని పలువురు నిరూపించిరి. మన ఐతరేయ బ్రాహ్మణ ములో నరమేధ యజ్ఞము శునశ్శేపుని కథ ఈ సందర్భములో గమనింపదగినది. మన దేశములో నేటికిని పల్లెలలో చకుముకి రాయితో "అగ్ని కొట్టి" వాడు కొందురు. ఆది కాలములో అగ్నికే సర్వ ప్రాధాన్య ముండెను. "అగ్ని మీళే పురోహితం" అని ఋగ్వేదము ప్రారంభమగుచున్నది. మన ప్రాచీన భాగదేయు లకు జరదుష్ట్రి మతానుయాయులకు అగ్నియే ప్రధాన దేవత. మన పురాణాలలో అనేక ప్రాచీన తమ చరిత్రలు అణిగియున్నవి. మహాభారతములోని అనేకాంశములు ఆది కాలపు సాంఘికస్థితిని వెలువరిస్తున్నవి. ఆది పర్వ మందలి శ్వేతకేతు కథ కుంతీ నియోగం. ఆ సందర్భమందు పాండు రాజన్న మాటలు పూర్వ మందలి సాంఘిక స్థితిని తెలుపును. స్త్రీలు అనావృతలై స్వేచ్ఛా చారిణులై యుండిరి. 'అయం ధర్మ సనాతనః' అని పాండు రాజనెను. మమత అను నామె, ఉతత్స బృహస్పతి అను సోదరులకు ఏకభార్యగా నుండెను. ద్రౌపది పంచ పాండవుల భార్య. నేటికిని టిబెట్టులోను, మలబారులోను, బహుభర్తృత్వము (**Polyandry**) అందందు నిలచినది. యయాతి కూతురు వరుసగ హర్యశ్వ దివోదాస ఉశీనర, విశ్వామిత్రులకు సంసారముచేసి పిల్లల గనెను. శాస్త్రకారుల అష్టవిధ వివాహాలు ద్వాదశౌరస పుత్రులు ప్రాచీనాచారాలను స్పష్టీకరించెను. పూర్వము కతక భర ద్వాజులు తమ తమ భార్యలను మార్చుకొని రని "దృష్టం ధర్మ వ్యతిక్రమం సహసంచ మహీతాం" అనియు గౌతమ ధర్మ సూత్రములందు తెలిపినారు. ఛాందోగ్యములోని జాబాలి కథ సుప్రసిద్ధమే కదా! ఇట్టి వన్నియు ప్రాచీన మానవ చరిత్రకు చాల సహాయపడును. చారిత్రికులు మన వేదశాస్త్రపురాణాలన్నీ దృష్టితో పరిశోధించి మన ప్రాచీన చరిత్రకు తోడ్పడవలసి యుండును.

మానవచరిత్ర నిర్మాతలు మన భూమి 200 కోట్ల యేండ్ల ముందు ఏర్పడి యుండునందురు. మనలో మహాసంకల్ప మొకటి కలదు. అది దాక్షిణాత్యులచేతను క్రీ.శ. 6 వ శతాబ్ది తర్వాతను అల్లబడినదని దానిలోని విషయములే పట్టించును. అయినను అందలి భూ సృష్టి కాలనిర్ణయము గమనింపదగినది—

"ప్రవర్తమాన సాంవద్య బ్రాహ్మణః ప్రథమ పరార్థే
పంచాశ దృత్సరేష్య తీతేషు ద్వితేయ పరార్థే.........
శ్వేత వరాహ కల్పే........వైవస్వత మన్వంతరే........
కలియుగే ప్రథమ పాదే........శాలివాహన శకే .. ...."

అని చెప్పుట వాడుక. దాన్ని గుణించిన గణకులు సృష్ట్యాది ఇంచుమించు 192 కోట్ల యేండ్లని చెప్పుదురు. పాశ్చాత్యులు సైన్సు అంచెనాలతో చెప్పేడు దానికి మన మహా సంకల్పానికంతగా భేదము కానరాదు. ఇట్లు 200 కోట్ల యేండ్లనుండి ఏర్పడెనను మనుష్యుడెప్పు డేర్పడెనన్నది తేలలేదు. కొన్ని ఏండ్లక్రిందట జావా ద్వీపములో భూగర్భ మందొక మనిషి అస్థి పంజరము లభించెను. దాన్ని పరిశీలించిన నిపుణులు జావాలో ఆ మనిషి 8 లక్షల యేండ్లకు ముందుండె ననిరి. మరికొంత కాలానికి ఇంచుమించు 15 యేండ్ల క్రిందట చీనాలోని పేకింగ్ నగర ప్రాంత మందొక మనిషి కపాలము భూగర్భ పాతాళమందు లభించెను. దాన్ని పరిశీలించిన నిపుణులు, ఈ పుర్రెగల మనిషి 10 లక్షల యేండ్లకు ముందుండెనని నిశ్చయించిరి. అంతకన్న ప్రాచీనమునకు పరిశోధకులు వెళ్ళజాలిన వారుకారు. క్రీస్తునకు పూర్వము 4000 ఏండ్ల క్రిందట భూ సృష్టి జరిగెనన్న బైబిలులోని మోటుమాట అపాస్తమైనది. మానవుని యునికి లక్షల ఏండ్ల ముందులోయున్నది. ఒక శతాబ్దము నుండి మానవుని ఆది జన్మస్థానము 'మధ్య ఆసియా' అని తేలినది. ఇంతవరకు పేకింగ్ పుర్రె ఆధారముతో ఆ వాదము స్థిరపడినది. చరిత్రల దృక్పథములో ఈ విధముగా అద్భుతమగు మార్పులు జరుగుతున్నవని మన చారిత్రికు లందఱును గమనింపవలసి యున్నది.

# ఎలిఫెంటా గుహలు

ఇప్పటి కాలమునఁ బాశ్చాత్య పండితుల కేది యత్యంతాశ్చర్యము కలిగించు చున్నదో కాలాతీతము చేతను, క్రూర హస్తములచేతను నేదినాశనముకాగా మిగిలిన యా శేషమును జూడ ప్రపంచముయొక్క నాలుగు దిక్కులనుండి జనులు వచ్చు చున్నారో, యట్టి శిల్పరాజములు మన హిందూస్థానమందుగాక మఱెచ్చట కలవు? పూర్వము మన యార్యులలో శిల్పులకిచ్చిన గౌరవము బ్రాహ్మణులకుఁ గూడ నియ్యలేదు. శిల్పకారుని నత్యంత పూజ్యునిగా భావించుచుండిరి. వాస్తుశాస్త్రములు సంస్కృత భాషయందనేకములు బహుపురాతన కాలమందే లిఖింపబడెను. దేవతల యొక్కయు, మనుష్యుల యొక్కయు, స్త్రీలయొక్కయు, తిర్యగ్జాతులయొక్కయు వివిధ రూపములు లేయేవిధములనుండ వలయునో మయవాస్తువువంటి గ్రంథము లందు విరివిగా చర్చింపఁబడెను. మహారాజుల నాదినుండియు శిల్పకారుల మన దేశమందు విశేషముగా సన్మానించుచుండిరి. వారి నివాస గృహముల నిర్మించుట యందేమి, వారి కోటలఁ గట్టుటయందేమి, దేవాలయముల స్థాపించుటయందేమి, రాజులు నిరంతర మీ శిల్పులకే యావత్కార్యముల విడుచుచుండిరి. పూర్వపు శిల్పులు తాము చేయుచుండిన పనులందుఁ బూర్ణముగాఁ దమమనస్సు లయింపు జేయుచుండిరని చెప్పుట యతిశయోక్తి కాదు. ఆ కాలపు గట్టడములును, ఆ కాలము నుండి వచ్చిన లోక ప్రతీతియు దీనికి ప్రబల సాక్ష్యములు. అనంతశయన మందలి పద్మనాభస్వామి దేవాలయమును గట్టునపుడొక శిల్పి తన కార్య మందత్యంతముగా నిమగ్నుడై తన ప్రక్కన రాజుగారుండినదియు గుర్తింపక యతడు తనచేతి క్రింది మనుష్యుఁడే యని తలచి యొక సాధనము నందిమ్మని యాజ్ఞాపించెనఁట. రాజుగారు తన గాంభీర్యము చెడెననిగాని తన గొప్పతనమునకు లోటు కలిగెనని గాని విచారింపక- తాను విశాలహృదయుఁడగుటచే జంకుకొంకులేక వెంటనే కోరిన వస్తువును దెచ్చియిచ్చెనఁట. ఇచ్చునపుడు చేతిని జూచి రాజును జూచి శిల్పిభీతుఁడై తన యపరాధమేమియు లేదని రాజతనితో జెప్పినను వినక యా తప్పుకై తన చేతిని కోసుకొని ప్రాయశ్చిత్తము పెట్టుకొనెనట. ఇట్టి యంశములు వెదకు వారి కనేకములు గోచరించును.

పూర్వపు వైభవము, పూర్వపు శిల్పనైపుణియార్యుల స్వాతంత్ర్యము తోడనే యంతరించెను. పూర్వపు గోటలను దేవాలయములను ఋషిసంతతివారను పించుకొనిన మనమిప్పుడును చూచిన యాకట్టడములు మనుష్యులుకట్టిరా లేక యక్ష గరుడ కిన్నరాదులవంటి మనుష్యాతీతులైన వారెవరైన కట్టిరాయను భ్రాంతిని బుట్టించుచున్నవి. పూర్వపు శిల్పముల ప్రకారము కట్టు వారింకను దక్షిణ హిందూ స్థానమున నున్నారని భారతదేశమునకంతయు వంద్యులైన ఇ.బి. హెవెల్ దొర గారు నుడువుచున్నారు. కాని యీ శిల్పు లనుదినము క్షీణించుచున్నారు. దానికి కారణము మనమే. మనలో పూర్వపు గట్టడములలోని సౌందర్యమును జూచి మెచ్చుకొను శక్తి క్షీణించినది. అప్పటి విధానములు మనకు రుచించవు. మన దేశ భాషలందెట్లు మనమితరుల జూచి వారి ననుకరించుచున్నామో, యిట్టి శాస్త్ర ములందును మనకితరులే గురువులు. 'క్రొత్తదొక వింత, ప్రాతదొక రోత'యను సామెత నేడు మన యందొక రీతి విచిత్రముగా నొప్పియున్నది. నవనాగరికులని తలచుకొను వారికి బూర్వపు శిల్పములు రుచింపవు. ఇప్పటి మహారాజులుగాని, నవాబులుగాని పూర్వపు హిందూ బౌద్ధ శిల్పములనుగాని, మొగల్ రాజపుత్ర శిల్ప ములగాని కోరక గాథిక్, శాక్జను మున్నగు నానాశిల్పములయొక్క సమ్మేళనముచే సంకరములైన పద్ధతిపై తమ బంగ్లాలను గట్టించుకొనుచున్నారు. పాశ్చాత్యులు మన వేషములే, మన భాషలే, మన పూర్వ శాస్త్రములే మేలైనవని శ్లాఘించుటయే కాక నాచరించుచు నుండగా, మనము పాశ్చాత్యులవే మంచివని వాదించుట విచిత్రము. "పడమటి" గాలి విశేషముగా వీవ దొడగినది.

## ఎలిఫెంటా ద్వీపము

బొంబాయి నుండి సముద్రములో నోడపై ఏడు మైళ్ళు ప్రయాణము చేసిన ఎలిఫెంటా ద్వీపమును చేరవచ్చును. ఈ ద్వీపము 4 మైళ్ళ చుట్టుకొలత కలది. దీనిలో నొకగట్టు $1\frac{1}{2}$ మైలు పొడవును, 500 అడుగుల ఎత్తును గలదై యున్నది. ఈ ద్వీపములో జనులు నివసించుచున్నారు. వరి మున్నగు కొన్ని పంటలం బండించుచున్నారు. ఈ ద్వీపమును మున్ను గిరిపురి (పర్వతముపైన నుండుపురి) యని వ్యవహరించుచుండిరి. దీనికి ఎలిఫెంటా యని పోర్చుగీసు వారు పేరిడిరి. ఏలనన నీ ద్వీప మందొక రాతి యేనుగు 13 అడుగుల పొడువును $7\frac{1}{2}$ అడుగుల యెత్తును గలది యుండెను. ఈ యేనుగు కొంతకాలమునకు శిథిలమయ్యెను. దానిని

1864 సం॥రంలో బ్రిటిషు ప్రభుత్వంవారు బొంబాయికిఁ దెచ్చి విరిగిన భాగముల నతికించి విక్టోరియా తోటలో నుంచిరి. ఇప్పటికిని నిది యా తోటలోనే యున్నది. (చూడుడు పటము 1)

ఈ ద్వీపములో క్రీ.శ. 3 వ శతాబ్దమున బౌద్ధస్థూపములు కట్టినట్లుగొన్ని శిథిలముల నుండి యూహింపఁ బడుచున్నవి. మఱియు నందలి గుహలు క్రీ. శ. 8 వ శతాబ్దమందు నిర్మింపఁబడినట్లూహింపబడుచున్నవి. ఈ గుహల విషయమై యితర హిందూ క్షేత్రములవలె స్థానికులు వివిధగాథలను జెప్పుచుందురు. కొందరు వీనిని పాండు పుత్రులు కట్టిరనియు, కొందరు బాణాసురుని కూతురగు ఉషాకన్య నిర్మించె ననియు చెప్పుదురు. కాని చరిత్ర వేరుగా బోధించుచున్నది.

ఈ ద్వీపము మౌర్యరాజుల యొక్క రాజధానిగాఁ గొంతకాలమువరకుండె. పిమ్మట ఇది చాళుక్యులచేత, రాష్ట్రకూటులచేతను, యాదవులచేతను పరిపాలింపఁ బడెను. క్రీ.శ. 15 వ శతాబ్దమందిది మొగలుల పాలనములోనికి వచ్చెను. తురకలు సాధారణముగా విగ్రహ నాశకులని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాయుచుందురు. కాని యీ ద్వీప విషయములో నిందలకుఁబాత్రులైన ముసల్మానులవలన నేయపకార మును జరుగలేదు. క్రీ. శ. 1534 వ సంవత్సరంలో నీ ద్వీపము పోర్చుగీసు (బుడతకీచులు) వారి స్వాధీనమయ్యెను. సుమారు 200 సంవత్సరముల వరకీ గుహ లీ దుష్టుల స్వాధీన మందుండెను. వీరిచే నివి నాశనము చేయఁ బడెను. పోర్చుగీసు లీ విశాల మంటపములలోఁ దమ పశువులను మేపుకొను చుండిరి. ఈ సిపాయీ లిచటి ప్రతిధ్వనులను బరీక్షింప నెంచి తమ ఫిరంగులతో నీ యాల యమును, గాల్చిరి. కాన ననేక విగ్రహములును. స్తంభములును గూలి పోయెను. ఈ బుడుతకీచులకు విగ్రహము లసహ్యముగా నుండెను. కావున వారు ప్రత్యేక ముగా శ్రమించి యీ విగ్రహములను తుపాకులతోడను ఫిరంగులతోడను పగులఁ గొట్టిరి. హిందువుల శిల్ప కళకును, నీ పరంగీ జాతి ఫిరంగుల శిల్ప కళకును నెంతటి ఘోర తారతమ్య మున్నదో కనుఁడు.

మన దొరలగు నింగ్లీషువారి హస్తగతమైన తర్వాత కూడ 1865 నుండి 1868 వరకు నీ గుహల వినాశన కార్యమందు నింగ్లీషు వారు పోర్చుగీసుల పోటికి నిలచిన వారైరి. అనేక సంవత్సరము లిది బ్రిటిషు వారి సైన్య విశ్రామ స్థలముగా

నుండెను. సర్వ లలిత కళలకు విరోధులైన సైనికులు నాశనము చేయుటకుఁగాక యింకేమి చేయ సమర్థులు. తుదకు 1909 వ సంవత్సరమునుండి యీ గుహలను బ్రిటిషు ప్రభుత్వమువారు సంరక్షింపఁ బూనుకొనిరి.

## గుహా శిల్పము

హిందూస్థానములో క్రీ.పూ. 300 సంవత్సరముల నుండి (అనగా నేటికి 2200 సంIIముల క్రితము) పర్వతములలో, గుట్టలలో పెద్ద సురంగములు చేసి వానిని చైత్యములుగను, విహారములుగను, దేవాలయములుగను, హిందూ బౌద్ధులుపయోగించినట్లు తెలియుచున్నది. మొట్టమొదలు అశోక చక్రవర్తి యీ పద్ధతి నవలంబించినట్లు ఫర్గూసన్‌గారు వ్రాసియున్నారు. "గుహా శిల్ప నిర్మాణములో బౌద్ధులే నిస్సంశయముగా మొదటి వారు" అని ఫర్గూసన్ గారు సెలవిచ్చినారు. పిమ్మట జైనులు, హిందువులు (సాధారణముగా క్రీ. శ. 6 వ శతాబ్దము నుండి) గుహా శిల్పములకుఁ గడంగిరి. ఉత్తర హిందూస్థానములోని బారబన్ గుహలును, ఒరిస్సాలోని కారక్ గుహలును, నిజాము రాష్ట్రములోని ఎల్లోరా, అజంతా గుహలును, మహారాష్ట్ర దేశములో కార్లా, జోగేశ్వరి, ఎలిఫెంటా గుహలును సుప్రసిద్ధములైనవై యున్నవి.

## ఎలిఫెంటా గుహలు

ఈ గుహలు క్రీ. శ. 8 వ శతాబ్దమందు నిర్మింపఁబడెనని యింతవరకే నివేదించి యుంటిని. ఇందు శైవ సాంప్రదాయపు గాథలే చిత్రింపఁబడినవి. ఇచ్చట ప్రధానమైనవి మూడు గుహలు. ఇయ్యవి దూరము నుండి చూచినట్లైన మూడు గొప్ప సురంగముల వలెఁ గనఁబడును. (చూడుడు 2 వ పటము)

ఈ గుహలలో ప్రధానమైనది మధ్యన నుండు గుహయే. ఇది 133 అడుగుల పొడవును, 130 అడుగుల వెడల్పును — ఇంచుమించు చౌకముగా నున్నది.

అందు 10 మాత్రమే మంచి స్థితిలోనున్నవి. ఇందు 26 స్తంభములున్నవి. ఈ గుహను 17 అడుగుల లోతుగా రాతినుండి తొలిచినప్పుడా రాతిలోనే నీ స్తంభములను వదలి యున్నారు. వీనిని నేర్పుతో నేర్పాటు చేసియున్నారు. ప్రేక్షకుఁడు

గుహయెదుట నిలిచినంతనే తనయెదుట దూరమందు (133 అడుగులు) త్రిమూర్తి విగ్రహము కనఁబడును. ఉభయ పార్శ్వములందు నందేడేడు స్తంభముల వరుస యున్నది. మధ్యగుహా ముఖమున నిలిచినంతనే నీ యుభయ పార్శ్వముల స్తంభముల మధ్య త్రిమూర్తి విగ్రహము ప్రేక్షకుని కగపడును.

## విగ్రహములు

ఇప్పటి శిల్పకారులనేకులు తమ పూర్వుల విద్యలన్నింటిని మరచి యడ్డా దిడ్డి యిండ్లను గట్టు విధానము మాత్రము తమ జీవనార్థముగా నుంచుకొని పూర్వ శిల్ప వైభవమును గుఱించి ముచ్చటించిన నా కాలము వారొక పసరును దెచ్చి శిలలపై రుద్దిన శిలలన్నియు మైనమువలె నగుచుండెననియు నప్పుడు తాము కోరి నట్టి రూపములఁ దీర్చు చుండిరనియుఁ జెప్పుదురు. నేటికిని కంచి మున్నగు ప్రదేశములందుఁ జరుగుచున్న శిల్ప నిర్మాణములఁ జూచువారికీ విషయమబద్ధమని తోపకపోదు. అయినను నీ ఎలిఫెంటా గుహలలోని యత్యంతోన్నత విగ్రహములను దిలకించు నతనికిఁ బై కథలు నిజమో యేమోయను భ్రమజనించును. ప్రప్రథమున మనకు గోచరించు నీ త్రిమూర్తి విగ్రహము సగము మాత్రమే (**bust**) చెక్కఁబడి యున్నది. ఇది సుమారు 14 అడుగుల యెత్తున్నది. ఈ విగ్రహమందుండు మధ్య శిరస్సు బ్రహ్మ, వానికి కుడిప్రక్క విష్ణు శిరస్సును, నెడమ ప్రక్క రుద్ర శిరస్సును నున్నవి. ఈ త్రిమూర్తి విగ్రహము యొక్క శిరస్సులు కిరీటముల చేతను, కంఠములనేక హారములచేతను, కర్ణములు కుండలముల చేతను నలంకరింపఁబడి యున్నవి. ఇందలి మూడు వదనములు మూడు విధములగు కళలచే నొప్పారు చున్నవి. (చూడుడు 3 వ పటము)

## అర్ధనారీశ్వర

త్రిమూర్తి విగ్రహము ప్రక్క కెడమ ప్రక్క అర్ధనారీశ్వర విగ్రహ మున్నది. ఈ విగ్రహమున కిరుపార్శ్వములందు బ్రహ్మ, విష్ణు, కుబేరేంద్రాది దేవతలున్నారు. ఈ విగ్రహములోని ఎడమ భాగము స్త్రీ భాగమని చూపరులకు వెంటనే స్ఫురించును. ఈ భాగమందలి యొక స్తనమును, కర్ణభూషణములును, సన్నని మధ్య భాగమును, నెత్తైన పిఱుఁదును, నతి సుందరముగా శిల్పకారుని

సామర్థ్యమును వెలిబుచ్చుచున్నవి. ఈ విశేషములు విగ్రహములే యొక్క కుడి భాగమునచూడుడు (4 వ గవు. పటము)

## పార్వతీ పరిణయము

త్రిమూర్తికి దక్షిణ భాగమందించుక దూరముగా పార్వతీ పరమేశ్వరుల వివాహ ఘట్టము నిరూపింపఁబడి యున్నది. ఇందు నీశ్వరుని కుడి ప్రక్కనఁ బార్వతి నమ్ర వదనయై యున్నది. ఆమె వెనుక కన్యా దాతలగు మేనకా హిమవంతులున్నారు. మేనక వెనుక చంద్రుడు అమృత కుంభమును బట్టుకొని నిలిచి యున్నాడు. ఈశ్వరుని పాదముల దగ్గఱ పురోహితుఁడగు బ్రహ్మ యున్నాడు. పై భాగమందుఁ బెండ్లికిఁ జుట్టములుగాఁ బ్రేక్షకులుగా వచ్చిన దేవతలున్నారు. ఇందు ముఖ్య పాత్రములైన పార్వతీ పరమేశ్వరుల విగ్రహములతి సుందరముగా వినయ గాంభీర్య గుణ యుక్తముగా నున్నవి. కాని బుడుతకీచులిచట మన శిల్ప నైపుణ్యమును మాపి తమ శతఘ్నికా శిలాధిక్యమును శాశ్వతముగాఁ జాటి యుండుటచేఁ బ్రేక్షకులకుఁ జాల విషాదము సంఘటించుచున్నది. (వివాహ కాలములందు నాశ్వలాయన శాఖీయులలో భార్య పురుషుని కుడిప్రక్క నుండును. తర్వాతి కాలములందు నాశ్వలాయనులలో నాపస్తంబీయులందువలె భార్య భర్త కెడమ ప్రక్కనే యుండును. ఈ పటమందు భార్య భర్తకుఁ గుడి ప్రక్కనున్నది. (చూడుడు పటము 4.)

## ద్వారపాలకులు

త్రిమూర్తి విగ్రహమునకు సుమారు 90 అడుగుల దూరమున గుహయందే యొక గుడి నిర్మించి యున్నారు. అందొక లింగమున్నది. ఆ గుడి నాలుగు ప్రక్కలలో నిద్దఱిద్దరు ద్వారపాలకులున్నారు. ఈ ద్వారపాలక విగ్రహము లొక్కొక్కటి రమారమి 19 అడుగుల యెత్తున్నవి. ఇంత యెత్తుండినను విగ్రహముల యొక్క యవయవముల పరిమితి [Proportion] చెడకుండ యున్నది, (చూడుడు 6, 7, పటములు) ఇందలి విగ్రహములలో సాధారణముగా ద్వారపాలకులకుండునని భావింపఁబడు గర్వక్రౌర్యాది చిహ్నము లేమియు లేవు. ముఖములపై సౌకుమార్యము, మార్దవము విశేషముగాఁ గనపడుచున్నవి. ఇందలి విగ్రహములు కూడా నితర విగ్రహములవలెఁ బ్రయత్న పూర్వకముగా పోర్చుగీసు దుండగీలచే రూపుమాయింపబడినవి.

## గంగావతరణము

ఈ విగ్రహములో నీశ్వరుడు పార్వతిప్రక్కకును, పార్వతి యీశ్వరుని ప్రక్కకును ప్రాలి యున్నారు. చుట్టును దేవతలున్నారు. ఈ ఘట్టముకూడఁ జాల శిథిలమై పోయినది. (చూడుడు 8 వ పటము)

ఈ గుహలో శివలీలా కథలింకను ననేకములు నిరూపింపఁబడినవి. సతీ దేవియొక్కసిర్యాణానంతర మీశ్వరుడు యోగియై తపస్సు చేసినదియు, పార్వతీ దేవి నాహ్లాదింపఁ దాండవమాడుటయు, రుద్రావతారియై దక్షాధ్వరధ్వంస మొన రించుటయు, ప్రణయ ప్రకోపముచేఁ బార్వతీపరమేశ్వరులు కలహించుకొనుటయు రావణుఁడఖిల జగద్రావణుండైన పిమ్మట తనచేతులతీట వోఁగైలాసగిరి నెత్తుటయు నఖిల ప్రపంచ నేతయైన హైమవతీ నాథుఁడు లీలగా నాతని గర్వ నిర్వాపణ మొనర్చుటయునగు నీ శైవ సాంప్రదాయపుఁ గాథలిందుఁ జెక్కఁబడి యున్నవి.

ఇంతవఱకు నివేదింపబడిన విషయములన్నియు మధ్యదియుఁ బెద్దదియు నగు గుహా సంబంధములు. ఈ గుహకిరు పార్శ్వములందును రెండు గుహలున్నవి. పెద్ద గుహకును వీనికిని మార్గములున్నవి. ఈ రెంటను బేర్కొనదగిన వస్తువులు లేవు. కుడి ప్రక్కనుండు గుహలో నొక చిన్న పుష్కరిణికలదు. అందు నిరం తరము పానయోగ్యమగు జలముండును. ఎడమప్రక్కన నుండు గుహయొక్క ముంగలి భాగమున నొక యంగణమున్నది. దాని యెదుట శివాలయ మున్నది.

ఈ రెండు గుహలుగాక వీనికి తూర్పు దిక్కున నాలుగు గుహలున్నవి. ఇందు కొంత శిథిలితములును గొంత పరిపూర్తికానివి యునునున్నవి.

సముద్ర పరివృత ద్వీపమందుండుటచేత నేమి మౌర్య, రాష్ట్ర కూటాది హిందూ రాజ్య పరిపాలన స్థానముగా నుండినవగుటచేతనేమి, సుందర తర విగ్రహములచే బ్రాచీనార్య శిల్ప కళావైదుష్య ప్రకటనము చేతనేమి, తదకు బుడతకీచులవలని దుండగములచేతనేమి యీ గిరిపుర గుహలు చారిత్రికములై, యానందదాయకములై దర్శన యోగ్యములై యున్నవి.

ఈ గుహలందొక కాలమున నజంటాలోవలెఁ గొంతవఱకు చిత్రములు గూడలిఖించి యుండిరని చెప్పుదురు. కాని యవి యిప్పుడు కానరావు.

ఈ గుహలను గుఱించి 1539 క్రీ.శ. నాటికేడాంజోడీకాస్ట్రో యను నతడివి మనుష్య మాత్రులు నిర్మించినవే యై యుండిన నింత సుందరముగా నుండుటెట్లు సాధ్యమని శంకించెను. ఇంచుమించాకాలము వాడేయగు లిణ్‌షోటెణ్ వీనిని హిందు వుల యౌన్నత్య సూచకములుగా భావించెను.

# తెలంగాణ చరిత్రము

హైద్రాబాదు రాష్ట్రములో తెలంగాణమనియు, మరాట్వాడా యనియు రెండు ముఖ్య భాగములున్నవి. తెలంగాణములో తెనుగు మాట్లాడువారు యెక్కువ. మరాట్వాడీలో మహారాష్ట్రిలును కర్ణాటకులును చేరియున్నారు. ఇప్పుడు తెలంగాణాలో 9 జిల్లాలు క్రిందివి కలవు.[1]

1. మహిబూబునగరం, 2. అత్రాఫుబల్దా, 3. నల్లగొండ, 4. కరీంనగరు, 5. మెదకు, 6. వరంగల్, 7. బాగాత్, 8. ఆదిలాబాదు, 9. నిజామాబాదు. ఇవి గాక రాయచూరు జిల్లాలోని అలంపూరు, గద్వాల, రాయచూరు తాలుకాలున్నూ మరి యిట్టి వందందును తెనుగు తాలుకాలై యున్నవి. హైద్రాబాదు రాష్ట్ర వైశాల్యములో సగమువరకు తెలంగాణా వైశాల్యమున్నది. అనగా ఇంచుమించు 40 వేల చదరపు మైళ్లు మరియు జనసంఖ్య 80 లక్షలవరకున్నది. అనగా రాష్ట్రమందు సగము సంఖ్య ఆంధ్రులదైయున్నది. ప్రధాన నగరమగు హైద్రాబాదు తెనుగు సీమయే. అది తెలంగాణాలో చేరినట్టిదే.

తెలంగాణమను పేరు ఈ జిల్లాలకెప్పుడు వచ్చినదోయేమో సరియగు ఆధారములు కానవచ్చుటలేదు. కాకతీయుల అనంతరము గోలకొండ రాజ్యస్థాపన కాలములో ఈ పేరు ఏర్పడినట్లూహింపదగును. తెనుగు వారి నుండి యీ పద మేర్పడినదనుట స్పష్టము. తెలుంగు ఆణెము అని పద విభాగము. ఆణెము అనగా దేశము. "ఆణెమందనగ దేశాహ్వాయంబు" అని ఆంధ్ర భాషార్ణవ నిఘంటులో వ్రాసియుండిరి. కాని వ్యవహారములో తెలంగాణను తప్ప వేరే ఆణెము తెనుగు దేశములో మనకు కానవచ్చుటలేదు.

తెనుగు బ్రాహ్మణులలో తెలగాణ్యులు అను శాఖవారు కలరు. వారు సంపూర్ణముగా తెలంగాణ బ్రాహ్మణులే. తెనుగు దేశములో బ్రాహ్మణులలో

---

1. ఇవి పూర్వపు హైదరాబాదు రాష్ట్రములోని భాగములు.

పాకనాటివారు, వెలనాటివారు, నందవరీకులు గోలకొండ వ్యాపారులు, ములికినాటి వారు అను బహు శాఖ లేర్పడెను. గోలకొండ వ్యాపారులు గోలకొండ రాజ్య కాలములో ఏర్పడిన నియోగి శాఖవారు, నందవరీకులు కర్నూలు జిల్లాలోని నందవరము నుండి ఏర్పడినవారు. పాకనాటివారు కృష్ణా జిల్లావారు, ములికినాటి వారు మహిబూబునగరము జిల్లా వారు. ఒక గోలకొండ వ్యాపారి శాఖ తప్పితే తక్కిన శాఖలు ఇంచుమించు కాకతీయుల రాజ్యకాలములో ఏర్పడినట్లు కానవచ్చు చున్నది. ఈ లెక్క ప్రకారము తెలగాణ్యులనుమాటప్పుడే ఏర్పడియుండవలెను. ఇవన్నీ యూహలే. చారిత్రికాధారములు నాకు కానరాలేదు.

కీ.శే. చిల్లరిగె శ్రీనివాసరావుగారు తమ ఆంధ్రప్రదేశ్ చరిత్రములో ఇట్లు వ్రాసినారు. ‘‘అరవలును, కన్నడీలును, మళయాలును మనలను తెలుగులు అనియే పిలుచుచున్నారు. బర్మాలోని వారును తైలింగులే, తెలుగు పేరనే తెలంగాణా మున్నగు రాష్ట్రములు ప్రాచీన కాలమునుండియు చరిత్రకెక్కినవి.

బర్మాలో తైలింగులు అనువారున్నారు. వారు ప్రాచీన మందలి మన తెలుగువారే - వారు వంగ దేశమును జయించి బర్మాను ఆక్రమించుకొని అందు నిలిచిపోయిరి - బర్మా తైలింగులను గూర్చి హర్వీ **Harvey** అను చరిత్రకారు డిట్లు వ్రాసెను.

**"Indeed the Tailanga is Probobly derived from Telingana, a region on the Madras East whence so many of them Came"**

మద్రాసు తీరమందలి తెలగాణమునుండి బర్మాకు వచ్చిన తెలుగువారే బర్మాలో తైలింగులైరి అను అతని అభిప్రాయమును శ్రీనివాసరావు గారుదా హరించిరి.

ఈ తెలంగాణా చరిత్రము మనకు శాతవాహనుల కాలమునుండియు లభించు చున్నది. క్రీస్తుశకంలో శాతవాహనులు ప్రతిష్ఠాపురమును (పైఠన్) రాజధానిగా చేసుకొని తమ రాజ్యములో ఇప్పటి తెలంగాణమును; రాయలసీమకు చేర్చుకొని

పాలించిరి. వారికాలములో మన తెలంగాణమునకు ముళకసీమ లేక మూలక దేశము అను వ్యవహారముండెను. శాలివాహనుల శాసనములో తమ దేశములో ముళక దేశముండినట్లు వ్రాసినారు. నేటికిని మహిబూబునగరు జిల్లాను "ములక సీమ" అని అలంపూరు, గద్వాల వారనుచున్నారు. ఆంధ్రకులు, మౌళికులు, అశ్మకులు, భోగవర్ధనులు, కుంతలులు దక్షిణాంధ్ర మందలి జాతులని మార్కండేయ పురాణములో వ్రాసినారు. అందలి మౌళికులే ఈ మళక సీమవారు.

దక్షిణ దేశములో తెలంగాణముండినట్లును అందలి వారిని తెలింగులు అని వ్యవహరించినట్లును "అథ పార్శ్వే తలంగాశ్చా" అని వాయు పురాణములో నున్నదని బిమలా చరణలాగారు **Tribes in Ancient India** ప్రాచీన భారతదేశ మందలి జాతులు అను గ్రంథములో వ్రాసిరి.

ఇదే తెలంగాణలో ఆంధ్రుల నగరాలలో కొన్ని నగరాలుండి నట్లును ప్లినీ గ్రీకు చరిత్రకారుడు ప్రాచీనమందు వ్రాసినట్టి ఒక ఆంధ్ర నగరము క్రీస్తుశక ప్రథమ ద్వితీయ శతాబ్దులందు హైద్రాబాదు నగరమునకు 40 మైళ్ళ దూరము లోని కొండాపుర గ్రామము వద్ద వెలసి యుండినట్లును రెండేండ్లనాడు ప్రభుత్వము వారు త్రవ్వించిన ప్రాచీనపు దిబ్బలనుండి వెల్లడి అయ్యెను. మరియు ఆ దిబ్బలలో ప్రాచీనాంధ్ర రాజుల సీసపు నాణెములు కొల్లలుగా లభించెను. కొన్ని నెలల క్రిందటనే నల్లగొండ వద్ద మరొక ప్రాచీనాంధ్ర నగరము బయట పడినది.

మార్కండేయ పురాణములో మూచికులు అను ఒక జాతి వర్ణింపబడినది. అది మూసీనదీ తీరాలలోను చుట్టు పట్టలలోను, వెలసి యుండి మూసిక జాతియై యుండునని రాయే చౌదరిగారు ఊహించినారు. మూసీ ఇంచుమించు 150 మైళ్ళ పొడవున వికారాబాదు నుండి హైదరాబాదు నగరం మీదుగా ప్రవహించునట్టి తెలంగాణం లోని ఒక యుపనది. మార్కండేయ వాయు పురాణములలోని చర్చలు వ్యాస ప్రోక్తములనియు, యుగాంతర విషయాలనియు, అతి ప్రాచీనములనియు భ్రమ పడరాదు క్రీస్తు శకము దశమ శతాబ్దము వరకు కూడా యీ పురాణాలను కల్పించి పెంచుతూ వచ్చిరని యెరుగవలెను.

శాతవాహనుల సామ్రాజ్యము క్రీ.శ. మూడవ శతాబ్దిలో క్షీణించుచు వచ్చెను. అటు తర్వాత తెలంగాణ చరిత్ర సరిగా లభించుట లేదు. ఉత్తర దేశ మందు హర్షుడు రాజ్యము చేసిన కాలములో దక్షిణమున వాతాపిని రాజధానిగా చేసుకొని పులకేశి రాజ్యము చేసెను. అతని యధీనములో తెలంగాణ ముండెను. అతడు చాలా ప్రబలుఁడగు దక్కన్ మహారాజు. అతని వద్దకు ఈరాన్ రాయ బారులు వచ్చిరి. అతని తర్వాత పులకేశి రాజులు ఈ ప్రాంతాన్ని రాజ్యము చేసిరి. చాళుక్యులు తర్వాత ప్రభువులైరి. వారికిని పల్లవులకును కొంత కాలము యుద్ధములు జరిగెను. పల్లవులే జయించిరి. మరికొంత కాలానికి రాష్ట్ర కూటలు మాన్య ఖేటమును రాజధానిగా చేసుకొని స్థిరపడి పోయిరి. వారే తుదకు రెడ్డి జాతిగా పరిణమించిరి. మరికొంత కాలానికి పశ్చిమ చాళుక్య లోక దిక్కు, చోళలోక దిక్కు విజృంభించిరి. తెలంగాణా ప్రాంతాన్ని పశ్చిమ చాళుక్యులే విశేష కాలముగా రాజ్యము చేసిరి. తెలంగాణ మంతటను చాళుక్యులు కట్టించిన శైవాలయములు కలవు. అందు వారి కన్నడ శాసనాలు కొల్లలుగా కనబడు చున్నవి.

చాళుక్యుల బలము క్షీణించిన తర్వాత కాకతీయులు విజృంభించిరి. కాకతీయుల కాలము నుండి మనకు తెలంగాణ చరిత్రము సమగ్రము గాను, విపులముగాను లభించుచున్నది. కాకతీయ రాజులు తెలంగాణాలోని ఓరుగల్లు నగరమును రాజధానిగా చేసుకొని ఇతర ప్రాంతాలను గూడ జయించి గొప్ప సామ్రాజ్యము స్థాపించి క్రీ.శ. 1350 వరకు రాజ్యము చేసిరి. వారి శాసనములు తెలంగాణ మంతటను లభించు చున్నవి. అవన్నియు తెనుగులోనే వ్రాయబడినవి. కొన్ని సంస్కృతమందును కలవు. కాకతీయుల చరిత్రను వివరించుట కిది సమయము కాదు - ఢిల్లీ రాజులకును, కాకతీయులకును పలుమార్లు యుద్ధాలు జరిగెను. తుదకు రెడ్డి వెలమలయొక్క ద్వేషాల వల్లను ఆంధ్రులలోని పరస్పర కలహాలవల్లను, జైన శైవ మత సంఘర్షణములందు జైనుల రాజ్య ద్రోహము వల్లను, కుల విద్వేషాల వల్లను కాకతీయ సామ్రాజ్యము విధ్వస్థమయ్యెను.

వారి యనంతరము దక్కన్‌లో బహమనీ రాజ్యమేర్పడెను. బహామనీ సుల్తానులకు తెలంగాణ లోబడి యుండెను. కాని ఒక నూరు సంవత్సరాలకే బహామనీ రాజ్యము అయిదు తునకలై పోయెను. అందొక శకలము గోలకొండ

రాజ్యము. అది పూర్తిగా తెనుగు రాజ్యమై యుండెను. తెలంగాణాలోనే గోలకొండ కోట, కుతుబ్‌షాహీల ముఖ్యస్థాన ముండెను. తెలంగాణములో కుతుబ్‌షాహీల సరిహద్దు ఖిల్లాలుండెను. కుతుబ్‌షాహీల రాజ్యము క్రీ. శ. 1518 నుండి క్రీ.శ. 1687 వరకుండెను. ఆ 170 ఏండ్ల కాలములో గోలకొండ సుల్తానులు తెనుగువారికి ఉద్యోగాలు యిచ్చి తెనుగు సనదులిచ్చి, తెనుగుభాషను ప్రోత్స హించి, తెనుగు సేనానులను; తెనుగు సిపాయిలను ఏర్పాటుచేసి, రాజ్యమును తెలుగు రాజులవలె పాలించిరి. మత పక్ష తప్పనిదైనను సమకాలీనులైన ఇతరుల వలె వారు దురాగ్రహమును ప్రదర్శించి యుండలేదు.

కుతుబ్‌షాహీల యనంతరము ఆసఫ్ జాహి ప్రభువులు ఈ తెలంగాణము నకు ప్రభులైరి. ఇంచుమించు 280 ఏండ్ల నుండి ఆసఫ్ జాహీ వంశము వారు తెలంగాణాతోపాటు మరాట్వాడాను పరిపాలించుచు వచ్చినారు.

ఈ విధముగా మనకు 2000 ఏండ్ల నుండి తెలంగాణ చరిత్రము కొద్దిగనో గొప్పగనో లభించుచున్నది. ఇప్పుడు పరిపాలనా సౌకర్యము కొరకై తెలంగాణము మరాట్వాడా నుండి విభిన్న మొనర్చబడినది. కాని ప్రాచీన మందట్టి విభిన్నత కాని, ప్రత్యేకత కాని ఈ తెలంగాణమని కాని లేకుండెనని యెరుగవలెను. వివిధ రాజులు, సుల్తానులు తెలంగాణముతో పాటు ఇతర ప్రాంతాలను కూడా జయించి రాజ్యము చేయుచుండిరి. ఇప్పుడు హైదరాబాదు రాష్ట్రములో ఆసఫ్ జాహీ ప్రభువుల పరిపాలన క్రింద తెలంగాణకు విశిష్టత ఏర్పడినందున ఈ భాగములోని చరిత్రను తెలంగాణ వాసులు యెరిగి యుండుటవసరమని తెల్పనైనది.

# హైదరాబాదు రాష్ట్రములోని చారిత్రిక స్థలములు

హైదరాబాదు రాష్ట్రములో అనేక రాజ్యాలు సామ్రాజ్యాలు ఏర్పడి అంతరించెను. అనేక మతాలిందే విజృంభించెను. అందుచేత చారిత్రికులకు ఇది ముఖ్య స్థానమని చెప్పవచ్చును. ప్రాచీన రాజులు కట్టిన కోటలు వారి రాజ్య చిహ్నములుగాను, రాజులు ధనిక భక్తులు కట్టించిన పూజాలయములు మత చిహ్నములుగాను, నేటికిని ఈ రాష్ట్రమందు ప్రతి తాలూకాలో కూడ చూచి ఆనందింప వచ్చును. చారిత్రికులకు నెత్తినొప్పిని, ఆయాసమును, పరిశోధన పటిమను, కల్పించునట్టి తామ్రశిలా శాసనములు వందలు కాదు కదా వేలకొలది లభించు చున్నవి. అముద్రిత తాళపత్ర గ్రంథములు కూడా వందల కొలదిగా, వేలకొలదిగా లభించినవి. ఇంకను లభించుచున్నవి. ప్రాచీన నాణెములు పలుతావుల జనులకు దొరకుచుండును.

ఈ రాష్ట్రములోనే ఆంధ్ర శాతవాహనులు, యాదవులు, చాళుక్యులు, రాష్ట్ర కూటులు, కాకతీయులు, పంచ సుల్తానులలో ముగ్గురు సుల్తానులు తమ రాజధానులను స్థాపించుకొని రాజ్యము చేసిరి. ఈ రాష్ట్రమందలి భాగములను బయటి ప్రాంతముల నుండి ఆంధ్రులు, మహారాష్ట్రులు, ఓఢ్రులు, రెడ్లు రాజ్యము చేసిరి. ఈ రాష్ట్రములోనే జైన, బౌద్ధ, వీరశైవ, శ్రీవైష్ణవ మతములకు సంబంధించిన ప్రసిద్ధాలయములు కలవు. సీకులకు కూడా నాందేడు పవిత్రమైనది. గుల్బర్గా, గోలకొండ, సుల్తాను లీ రాష్ట్రములోనే పరిపాలనము చేసియుండిన వారగుట చేత చాలా మసీదులు దర్గాలు నిర్మాణమయ్యెను. ఆసఫ్ జాహి వంశ ప్రభువుల కాలములో పై నిర్మాణములను కాపాడుటయేగాక క్రొత్త నిర్మాణములను కూడా కావించిరి.

హైదరాబాదు రాష్ట్రములోని పాత దిబ్బలను త్రవ్వించినచో మరికొన్ని చారిత్రిక విశేషములు లభ్యమగును. ఇటీవలనే హైదరాబాదునకు 40 మైళ్ళ

దూరములో నున్న కొండాపురము అను స్థలము వద్ద కొన్ని ప్రాచీన ఆంధ్ర నాణెములు లభించెను. వాటి ఆధారముచే అచ్చట త్రవ్వించగా 1800 సంవత్సరముల క్రిందటి ఆంధ్ర నగర మొకటి బయటపడెను. ఈ రాష్ట్రములోని రాయచూరు జిల్లాలోని మస్కీ వద్ద అశోక చక్రవర్తి శాసనములు లభించినవి. అవి 2200 ఏండ్లకు పూర్వము నాటివి. రాష్ట్రములోని అతి ప్రాచీన చారిత్రక చిహ్నములలో ఇది ముఖ్యమైనదని చెప్పవచ్చును. అటు ఉత్తర దిశయందుండు ఔరంగాబాదు జిల్లా చాలా ముఖ్యమైన చారిత్రక మండలమై యున్నది. ప్రాచీన మందు దేవగిరి రాజ్యమిందే యుండెను. అంతకన్న ప్రాచీనములో శాలివాహన రాజులు ప్రతిష్ఠాపురమును (నేటి పైఠాన్) రాజధానిగా చేసుకొని ఇప్పుడు ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటకము లనబడు భాగాలను ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించిరి. ఔరంగాబాదుకు 12 మైళ్ళ దూరములో హిందూ స్థానమందలి అగ్రశేణిలో చేరిన కోటలలో నొకటగు దేవగిరి (దౌలతాబాదు) జిల్లాయున్నది. అచ్చటనే ఔరంగజేబు యొక్కయు, అసఫ్ జాహి యొక్కయు గోరీలున్నవి. అచ్చటకి 2 మైళ్ళ దూరములో జగద్విఖ్యాతిమైపోయిన ఏల్లోరాగుహలున్నవి. మూడు మైళ్ళ పొడవున గట్టులలోనే గుహలను తొలచి ఆలయములను విహారములను నిర్మించినారు. అందు జైన, బౌద్ధ హిందూ శిల్పములున్నవి. క్రీస్తుశక పూర్వము 200 ఏండ్ల నాటినుండి క్రీస్తు తర్వాత 900 ఏండ్ల వరకు ఈ గుహలు నిర్మాణమై యుండెను. అందలి శిల్పాలు అద్వితీయమైనవి. ఆశిల్పాలలో కైలాసం అను పేరుతో నున్న శిల్పరాజము నిజముగా భూలోక శిల్పములలో కైలాసము వంటిది. ఔరంగాబాదులో బీబీకా మఖ్బరా అనునది తాజమహల్ యొక్క నఖల్. అదే నగరములో పూర్వుల చుట్టు నుండు గట్ల నుండి భూమిలోకి కాలువలు నిర్మించి నగరమంతటను నిరంతరము ఊట గొట్టముల ద్వారా నీరు సప్లయి యగునట్లు చేసినది నేటికిని అనుభవములో నున్నది. ఔరంగాబాదునకు 60 మైళ్ళదూరములో అజంతాగుహలున్నవి. అవి రాతిలో కవితను ప్రదర్శించు తావులు. గట్లును వాటిపై నుండు చెట్లును ఆ గట్ల నుండి నిరంతరము ప్రవహించు దివ్యప్రవాహమున్నూ అరసికుని రసికునిగా క్షణ మాత్రమున జేసివేయును. ఇంచు మించు 2000 ఏండ్ల క్రిందట అచ్చటి గుహలలోని గోడలపైన గచ్చువేసి వాటిపై రంగులతో చిత్రించిన చిత్రాలను నేల నాలుగు చెరగుల వారును అదే పనిగా వచ్చి చూచి ముగ్ధులై పోవుచున్నారు. కామదేవు వంటి మహాత్ములను గన్న ఔరంగాబాదు జిల్లా పవిత్రమైనది.

ఔరంగాబాదు తర్వాత ప్రసిద్ధమైనట్టిది ఒరంగల్ జిల్లా. అది ఆంధ్రులకు ప్రాముఖ్యమైనట్టిది. అందు కాకతీయ రాజుల కోటలు గలవు. వారిచేతను వారి సామంత దండ నాయకులచేతను నిర్మింపబడిన జైన దేవాలయములచ్చట సర్వ వైభవమును ప్రకటించుచున్నవి. ఓరుగంటికి 40 మైళ్ళ దూరములో రామప్ప గుళ్ళును పాఖాల చెరువును అవశ్య దర్శనీయములై యున్నవి. రామప్పగుళ్ళ గోపురములకు వినియోగించిన ఇటికలు చాలా పెద్దవైనను అవి నీటిపై తేలియాడుటను నేటి ఇంజనీరులు చూచి ఆశ్చర్య బాధితులగుచున్నారు. రామప్ప గుళ్ళలోని నల్లరాతి విగ్రహాలను పూర్వమెవ్వడో ఒక తాలూక్దారు మోహించి యుండెనను కథను విన్నచో వాటి శిల్ప సౌందర్యమెట్టిదో ఊహించు కొనవచ్చును. రామదాసు భక్తిని చాటిన భద్రాచల క్షేత్ర మీ జిల్లాలోనిదే.

ఒరంగల్ తర్వాత చరిత్ర పరికరాలకు ప్రసిద్ధమైనది నల్లగొండజిల్లా. నల్లగొండ పట్టణానికి 4 మైళ్ళ దూరములోనే పానగల్లు కలదు. అందలి 1000 ఏండ్లనాటి దేవాలయము శిథిలమైపోయినను మిగిలిన శకలములు కూడ తమ శోచనీయ స్థితిని కరుణరసయుక్తముగా మనకు తెలుపుచున్నవి. సూర్యాపేటకు 12 మైళ్ళ దూరములోని పిల్లల మర్రి వెలమదొరల చరిత్రకును సుందర దేవాలయ శిల్పమునకు ప్రసిద్ధి. నల్లగొండ జిల్లాలో దేవరకొండ రాచకొండ అను పెద్ద దుర్గాలు కలవు. అవి వెలమరాజుల రాజధానులు. వాటిలో నిప్పుడు నీటు ఏమన్ని లేకున్నను వైరుల పోటును మాత్రము అవి బాగుగా ప్రదర్శించుచున్నవి. ఇదే జిల్లాలోని భువనగిరి దుర్గము కాకతీయుల నాటిదైనను చూచుట కందమైన దైనను ఎక్కువ చరిత్రను కాంచ నట్టిది. దానికి కొన్ని మైళ్ళ దూరములో కొలనుపాక కలదు. అది సుప్రసిద్ధ జైన క్షేత్రము.

ప్రాముఖ్యతలో నాల్గవ స్థానము వహించునది రాయచూరు జిల్లా. అందలి గోన బుద్ధారెడ్డి కోట దక్కను సుల్తానులకును విజయనగర చక్రవర్తులకును నిరంతరము యుద్ధాలు చేయించినట్టిది. ఇదే జిల్లాలోని కొప్పలుకు 15 మైళ్ళ దూరములోని ఇటుగిలో చక్కని శిల్పములతో కూడిన ప్రాచీన దేవాలయము లున్నవి. అలంపూరులోని నవబ్రహ్మ దేవాలయాలు ఇంచుమించు 2000 ఏండ్ల నాటివి. రాష్ట్ర శిల్పములలోని దేవాలయాల శిల్పము విశిష్టతతో కూడినట్టిది. ఈ రాయచూరులోనిదే గద్వాల సంస్థానం. ఇది 800 ఏండ్ల చరిత్ర కలిగిన సంస్థానం

దీనికి గొప్ప మట్టికోట గలదు. కాని అది రాతి కోటలను మించినట్టిది. అందలి ఫిరంగీల వంటివి రాష్ట్రములోను రెండును ఉన్నవో లేవో అనిపించును.

అయిదవ స్థానము మహబూబునగరం జిల్లాకు చెందును అందు వనపర్తి, కొల్లాపుర సంస్థానములును వాటిలోని కోటలకు పేర్కొనదగినవి. కొల్లాపుర సంస్థానములోని జటప్రోలు దేవాలయము ప్రాచీనమైనది. దాని శిల్పము ఇతరోత్కృష్ట శిల్పముల కేమాత్రమున్నూ తీసిపోదు. ఇదే సంస్థానములో కృష్ణా తీరమందు మల్లేశ్వరము సోమేశ్వరము అను 1200 ఏండ్ల నాటి వీరశైవ క్షేత్రాలు కలవు. నది కవతలి యొడ్డుననే శైవ క్షేత్ర రాజ్యమైన సంగమేశ్వరము కలదు. నాగరుకర్నూలు తాలూకాలోని పానుగల్లు కోట ఇంచు మించు 800 ఏండ్ల నాటిది. అచ్చంపేటలోని ఉమామహేశ్వరం అమరాబాదులోని మున్ననూరు మంచి శైవ క్షేత్రములు. ఆత్మకూరు సంస్థానములోని, కురుమూర్తి శైలము రెండవ వెంకటాచలమని ప్రతీతి.

హైదరాబాదు నగరము దాని పరిసరములు అడుగడుగునకు చరిత్రతో కూడినట్టివి. సమీపమందలి గోలకొండదుర్గము, నగరము చుట్టునుండు చెరువులు, చారుమినారు, మక్కామసీదు వంటి విఖ్యాత స్థలములు ఇట్టి వెన్నియో స్మరింపదగినవి కలవు.

బిదరుకోట ఈ రాష్ట్రములోని ఖిల్లాలలో గణతకెక్కినది. అచటి గావాన్ విద్యాలయము సుప్రసిద్ధమైనది. బిదరు పాదుషాల గోరీ భవనములు చూడదగినవి. బిదరు సమీపములోనే నరసింహాలయము ఒక విచిత్రమగు స్థలము. ఒక ఫర్లాంగు వరకు గుట్టలో గుహామార్గ మేర్పడినది. అందు నడుము లోతువరకెల్లప్పుడును నీరు ప్రవహించుచుండెను. అట్టి గుహలో ఆ దేవాలయమున్నది. గుల్బర్గాలోని మసీదులు చాలా గొప్పవై అందమైనవై ప్రసిద్ధి నొందినవి. అందలి కోట, గోరీలు చూడదగినవి. ఆ జిల్లాలోని కళ్యాణి పూర్వమందు వీరశైవ కేంద్రమై యుండెను. అదే జిల్లాలోని మాన్యఖేటము (ఇప్పటి మలిఖేడు) రాష్ట్రకూటుల రాజధాని. వాతాపి గణపతి అని ప్రసిద్ధి నొందిన దేవుడు ఇప్పటి బాదామిలో వెలసినాడు.

కరీంనగరములోని ఎల్లందు కోట, మహబూబ్‌నగర జిల్లాలోని కోయిల కొండ కోట వంటివి రాష్ట్రములో అనేక స్థలములందు కానవచ్చుచున్నవి. అజ్ఞాత వాసములో నున్న శిల్పము లెన్నియో కలవు. రాజ్యాలతో పాటు ఆలయా లెన్ని భూగర్భమందు అణగిపోయెనో యేమో. వీలైనంతవరకు ప్రభుత్వ దృష్టికి వచ్చిన ప్రాచీన స్థలముల నన్నింటిని కాపాడుటకై ఏటేట కొన్ని లక్షలను మ. ఘ. వ. నిజాం ప్రభుత్వము వారు ఉదారతతో వ్యయము చేసి ధన్యవాదములకు పాత్రులై నారు. గద్వాలలోని పూడూరులో జైన శాసనాలున్నవి. ఇట్టి వెన్నియో వందల కొలది స్థలములున్నవి. సుప్రసిద్ధములైన వానినే ఇప్పుడు పేర్కొని యున్నాను.

ఈ రాష్ట్రములో పశ్చిమ చాళుక్యుల యొక్కయు, కాకతీయుల యొక్కయు శాసనములే యెందు చూచినను కానవచ్చుచున్నవి. అనేక స్థలములందు నాణెములు నేటికిని దొరుకుచున్నవి. అముద్రిత గ్రంథాలు దొరుకుచున్నవి. ఈ రాష్ట్ర మింకను చారిత్రిక పరిశోధకులకు గనియై యున్నది. ఉపయోగించుకొనువారే పరిశోధింపదగిన వారై యున్నారు.

# హైద్రాబాదు నగర ప్రాచీన స్థలాలు

## హుసేన్ సాగరు :

హైద్రాబాదుకును సికింద్రాబాదుకును మధ్య ఉన్న హుసేను సాగరు చెరువును గురించి లోకులు ఒక వినోదమగు కథ చెప్పుకుంటారు. అదేమన - మీర్ ఆలం మంత్రిగా ఉండే కాలములో ఈ చెరువును కట్టించెనట. కాని తన పేరుతో ప్రచార మందుండుటకు మారుగా దానిని జనులు హుసేనుసాగరు అనిరట. ఎందుకంటే హుసేను సాబ్ అను "మేస్త్రీ" చెరువు కట్టిన కూలీలకు దినమూ సాయంత్రము కూలీల బట్వాడా చేయుచూ ఉండెనట. అప్పుడు మీరు ఆలం వేరే ఒక చెరువు నిర్మాణాన్ని యేర్పాటుచేసి తానే కూలీ యిచ్చుచు వచ్చెనట. అందుచేత వేరే మీరాలం చెరువు ఏర్పడెనట. ఇదంతా పుక్కిటి పురాణం· నిజమేమంటే ఇబ్రహీం ఖుతుబుషా 957 హిజిరీలో గోల్కొండ నవాబయ్యెను. అతడు రైతు లోకాన్ని ఉద్ధరించి రాజ్యాదాయం ఎక్కువ చేసే నిమిత్తం చాలా చెరువులు కట్టించెను. ఇప్పటి ఇబ్రహీం పటం చెరువు మరియు కంకూరు బుద్వేలిలోను అతడే చెరువులు కట్టించెను. హుసేను సాగరు చెరువు కూడా అతడే కట్టించెను. దానికి రెండు లక్షల హూన్నులు ఖర్చయ్యెను. ఆ చెరువు నిర్మాణాన్ని హుసేనుషా అను నొక వలీ విచారించు కొనుచుండెను. అందుచేత అతని పేర ఈ చెరువు ప్రసిద్ధికి వచ్చెను.

## పాత వారధి :

నగరములోని మూసీనదిపై కట్టబడిన పాత వారధి యొక్క నిర్మాణము రసికత్వముతో కూడినదై యున్నది. ఇబ్రహీం ఖుతుబ్‌షా కుమారుడైన మహమ్మదు ఖులీ అనువాడు "భాగమతి" అను భోగము దాని నుంచుకొని యుండెను. ఇప్పుడు చారుమినారుండు ప్రాంతాన "చచ్లం"అను గ్రామం ఉండెను. అచ్చట ఆ భోగముది ఉండెను. దాని యింటికి యువరాజు వచ్చి పోవుచుండెడివాడు. ఒకనాడు తన అలవాటు ప్రకారము గోలకొండ ఖిల్లానుండి బయలుదేరి దాని యింటికి పోవువాడై మూసీనదీ వరకు వచ్చెను. వర్షకాల మగుటచేత నది

అప్పుడే నిండి పారుచుండెను. ప్రేమ శక్తి బలవత్తరమైనది. ప్రవాహాన్ని జయించునట్టిది. యువరాజు గుర్రాన్ని ప్రవాహములోనికి దింపి ఇవతలి నుండి అవతలికీదించి భాగమతి యిల్లు చేరుకున్నాడు. ఈ వార్తచారులు పాదుషాకు తెలిపినారు. తక్షణమే మూసీపై వారధి కట్టవలెనని ఆజ్ఞాపించినాడు. మరొక వర్షర్తువు వచ్చే లోపల అది సిద్ధమయి పోయెను. దానికి రెండు లక్షల (బంగారు హూన్నులు నాణెములు వ్యయమయ్యెను.) ఈ వారధి 881 హి॥జిలో కట్టబడెను. దీనినే ఇప్పటికిని పురానాపుల్ అని వ్యవహరింతురు.

## మౌలాలీ ఉరుసు :

హైదరాబాదులో ఏటేట మౌలాలీ గుట్టపై ఒక గొప్ప ఉరుసు జరుగును. దానికి గాను స్థానికముగా రెండు దినాలు కచ్చేరీలకు సెలవు కూడా ఇయ్యబడును. ముసల్మానులే కాక హిందువులును వేలకొలది ఆ గుట్టకు పోయి ఫాలుహాలు చదివించి మ్రొక్కులు చెల్లించుకొని వత్తురు. బీదలే కాక మ. ఘ. న. నిజాం ప్రభువుగారును మౌలాలీ సేవచేసుకొని వత్తురు. ఈ మౌలాలీ గురించి జనులు నానా కథలు అల్లుకొని చెప్పుకొందురు. నిజమైన సంగతి ఇట్లున్నది.

ఇదే ఇబ్రహీం కుతుబుషా కాలములో గోలకొండకు సమీపములో నుండు నొక గుట్టపై ఒక దేవాలయ ముండెను. ఒకనాడు వెన్నెల రాత్రిలో పాదుషా గోలకొండ పై భాగమందలి "బాలాహిసార్" అను సౌధముపై ఆనందముతో అటు నిటు ప్రచారు చేయుచు ఉండెను. అట్టి సమయములో అతనికి ఉత్తరపు దిక్కున ఒక పెద్ద వెలుతురు కానవచ్చెను. ఆ సమయములో రాయరావు అను పేరుగల బ్రాహ్మణుడు పాదుషా వెనుక నిలచి యుండెను. ఆ వెలుతురేమిటి? అని రాయరావును పాదుషా విచారించెను.

''సర్కార్ ఆ గుట్టపై మౌలాలీ అనే ఫకీరు యొక్క జండా యున్నది. అందుచేత షియ్యాలు అచ్చట అఖండ దీపములు పెట్టినారు'' అని చెప్పినాడు. ''అట్లయితే మనము కూడ రేపు గురువారము నాడు పోయి దర్శనము చేసుకొని వత్తము'' అని పాదుషా సెలవిచ్చినాడు. బ్రాహ్మణుడు, యజమాని సంతోష పడుటకై ఏదో ఒక తప్పుడు కూత కూసి యుండెను. పరిహాసవిజల్పితము తుదకు పరమార్థముగా గ్రహించబడెను. తనమాట దక్కించుకొనవలెను. లేకున్న

తన తలకూడ పోవచ్చును. మరునాడే ఆ గుట్టకు పోయి గుడిలోని హిందూ దేవత విగ్రహాన్ని ఎత్తి పారవేయించి మసీదువలె మార్పించి ఒక జెండా పాతించి దాని చుట్టును ఒక ఆకు పచ్చని బట్ట కట్టించి అంతయు సర్వ సిద్ధము చేయించినాడు - గురువారము రానే వచ్చెను. ఆనాడు హజరత్ అలీగారి 13 వ రజబ్ దినము. కావున గుట్ట వద్ద పాదుషా బీదలకు అన్నదానము బాగుగా చేయించినాడు. ఈ విధంగా అది ఏర్పడెను. ఆనాటి నుండియు మౌలాలీ ఉరుసు అను పేర సుప్రసిద్ధముగా అదే స్థలములో జరుగుచున్నది, కారణం తెలియకున్నా హిందువులును అచ్చట సేవ చేసుకొని పోవుచుండుటయు ఒక విశేషము.

## భాగ్యనగరము :

మన ఆంధ్రులు చాలా మంది హైదరాబాదును "భాగ్యనగర"మని కూడా ఇప్పటికి వ్యవహరించుచున్నారు. బహుశః చాలా మందికి దాని కారణము తెలియక పోవచ్చును. 988 హిజ్రీలో ఇబ్రహీం ఖుతుబుషా చనిపోయెను. అతని కుమారుడు అనగా భాగమతి అను బోగము దాన్ని ఉంచుకున్న మహామ్మదు ఖులీ ఖుతుబుషా అనువాడు రాజయ్యెను. భాగమతికి తానున్న చోటనే నగరము నిర్మించవలెనని కోరిక పుట్టెను. మహా సౌందర్యవతి, పాదుషాగారు చేపట్టిన యువతి, బోగముది. కోరికలు వృథా పోవు. పాదుషాగారిట్లా జ్ఞాపించినారు. "గోలకొండ ఇరుకటంగా ఉంది. మా దర్జాకు తగినటుగా లేదు. అమీర్లకు ఇబ్బందిగా వుంది. నదికి అవతలి భాగంలో నగర నిర్మాణం చేయవలసింది. నాలుగు బాటలు నాలుగు వీధులుండవలెను. నాలుగు కమానులు నాలుగు దిక్కుల కట్టవలెను. 14000 దుకాణాలుండవలెను. 12000 మొహల్లాలు (వాడలు) ఉండవలెను" అని అజ్ఞాపించెను. నగరము సిద్ధమయ్యేను. రెండు కోట్లకన్న యెక్కువగా రూపాయీల వ్యయమయ్యెను.

## చార్ కమాను :

పై విధముగా సిద్ధమైన నాలుగు బజారులలోని నాలుగు కమానులనే ఇప్పటికిని చార్ కమాన్ అని వ్యవహరించు చున్నారు. ఇందలి ఉత్తర దిక్కున కమాను వద్ద ఒక వైద్యాలయమును నిర్మించిరి. పశ్చిమ దిశలో హుజూరు వారి భవనాలు నిర్మించిరి. ఈ నాలుగు కమానుల మధ్య విశాల స్థలమును నందలి

ఒక ''హౌజును'' కట్టిరి. అందు నీరు విడిచి రమ్య దృశ్యముగా నేర్పాటు చేసిరి. తర్వాతి కాలములో అందు నీరు విడుచుట లేనందున దానికి "సూఖా హౌస్'' అను పేరు వచ్చి ఇప్పటికిని అదే పేరుతో వ్యవహరింపబడుచున్నది.

## ఆషుర్ ఖానా :

వీటి సమీపంలోని జామె మస్జిద్ కట్టిరి. దీని నిర్మాణానికి 2 లక్షల రూపాయలు ఖర్చయ్యెను. నదీ తీరమున నదీ మహలునున్ను నబీ బాగునున్ను కట్టిరి. 1003 హిజ్రీలో 60 వేలు పెట్టి "ఇమాంబాడా"ను కట్టిరి. దానినే యిప్పుడు బాదుషాహి ఆషుర్ఖానా అని యందు. దాని సమీపంలోనే మోతీమసీదును కట్టించిరి.

## చార్ మినార్ :

మొత్తానికి ఈ భాగ్య నగరాన్ని మక్కా క్షేత్రమువలె నిర్మించవలెనని పాదుషాకు కోరిక జనించి యుండెను. అందుచేతనే యీ విధముగా నూతన నగరములో కమానులు, హౌజు, వీధులు, మసీదు, బంగ్లాలు నిర్మించెను. అచ్చట మక్కా క్షేత్రములో హజరత్ ఇమాంగారి రోజా ఉన్నది. దానికి ప్రత్యామ్నాయముగా ఇచ్చట చార్‌మీనార్ కట్టించెను. దాని నిర్మాణానికి ఇంచుమించు రెండు లక్షల బంగారు హోన్నులు ఖర్చయ్యెను. ఈ చార్‌మీనార్ 1000 హిజ్రీలో నిర్మింపబడెను.

## నగర వ్యాప్తి :

యథా పాషాతథా ప్రజా. పాషాను జూచి ఆమీర్లు కూడా పెద్ద పెద్ద బంగ్లాలు తోటలు, బాటలు కట్టించి వేయించిరి. నూతన నరగమునకు ఇవి వ్యాప్తి నొందుచు పోయెను. అందుచేత రఖోడా, ఇబ్రహీంపట్నం, బోనగిరి, పటన్‌చెరువు నకు అమీర్లు బంగ్లాలు తోటలు నిర్మించిరి. ఇట్లు నూతనముగా నిర్మాణమై చార్ కమానుల మధ్యనున్న నగరానికి భాగమతి జ్ఞాపకార్థము "భాగ్యనగరము" అను నామకరణము కావింపబడెను. ఈ నగరములో పట్టీలు ఏటేట నాలుగు లక్షల హోన్నులవరకు వసూలు కావచ్చెను. ఈ పన్నుల నుండియే బీదలకు అన్న దానమునకై 12 వేల హోన్నులను 60 హోన్నులంగరు ఖర్చుకును, తక్కిన

మొత్తము మౌల్వీలకును పంచి పెట్టబడుచుండెను. గోలకొండ పాదుషాలు షియ్యా మతస్థులు. అట్లున్నను ఈ పాదుషా ఎవరైతే హజరత్ పైగంబర్ మహమ్మద్ రసూలుగారి ముగ్గురు అనుయాయులను (తబర్రాపాడి)నిందింతురో వారి నాలుకలను కోయింతునని ఆజ్ఞ యిచ్చెను.

అయితే ఈ ఆజ్ఞను తనకే మనసుకు వచ్చి చేయలేదు. అప్పుడు ఢిల్లీలో చక్రవర్తియైన జహంగీరు ఇచ్చటి షియ్యాల ఆచారలను విని వెంటనే తబర్రాను మాన్పింతువా లేదా అని బెదిరించెను. అందుచేత తబర్రా నిలచి పోయెను. జహంగీరు కోప శాంతికై మంచి మంచి నజరానాలు కూడా పంపు కొనబడెను.

## మక్కా-మసీదు :

భాగమతీ ప్రియుడు చనిపోయెను. ఆతని కుమారుడు సుల్తాన్ మహమ్మదు ఖుతుబుషా రాజయ్యెను. ఆతడు తన కాలములో చారుమీనారు సమీపంలో మక్కా-మసీదును కట్టించెను. దీని శంఖుస్థాపన కథ చాల రమ్యముగానున్నది. 1027 హిజిరిలో రాష్ట్రములోని మౌల్వీలను, ఫకీర్లను, ఆరబి పండితులను పిలిపించి వారి సమక్షములో నిట్లు సెలవిచ్చెను. "మీలో ఎవరైతే ఎన్నడుగాని తప్పకుండా దినమూ అయిదు మారులు నమాజు చేసినారో అట్టివారు దీని శంఖుస్థాపన చేయవలసినది". అందరూ ఒకరి మొగము ఒకరు చూచుకొన్నారు. అప్పుడు పాదుషా తానే శంఖుస్థాపనకై మొదటి రాతిని పాదుకొలిపినాడు అంటే ఆయన నమాజు తప్పని మతాభిమాని అని తేలిపోయింది. ఆయన కాలములో ఈ మసీదుకు గాను 30 వేల హొన్నులు వ్యయము జేసినాడు. పని చాలా తిన్నగా సాగుతూ వచ్చింది. ఆయన కాలములో అది పూర్తి కాలేదు. తర్వాత అబుల్ హసన్ తానాషా కాలములో కూడ నిర్మాణము జరుగుతూవచ్చెను. అప్పటికిని పైకప్పు పూర్తి అయ్యెనే కాని దానిపై మీనారులు ప్రారంభమేకాలేదు. తర్వాత అతనికి పతనము కలిగెను ఆలంగీరు పాదుషా గోలకొండ రాజ్యాన్ని వశపరచు కొనెను. అతడును ఇంత గొప్ప మసీదుకు మీనారులు మున్నగునవి కట్టించుట సాధ్యము కాదని అక్కడికక్కడికే పూర్తిచేయించి ముగించెను. ఇట్లు 1037 హిజిరీలో మొదలైన ఈ మక్కా-మసీదు 1104 హిజరీలో పూర్తియయ్యెను. అనగా ఇంచుమించు ఒక శతాబ్దము పట్టెను. ఇప్పటికిని హైదరాబాదు రాష్ట్రములో మక్కా-మసీదును మించిన మసీదు లేనేలేదు.

## లింగంపల్లి బాగ్ :

సుల్తాన్ మహమ్మదు ఖుతుబ్షా వచ్చెను. అతని కుమారుడు అబ్దుల్లా ఖుతుబుషా అనువాడు రాజ్యానికి వచ్చెను. అతడు రంగీలారాజు. విలాస పురుషుడు, స్త్రీ లోలుడు, విషయాసక్తుడు. అందుచేతనే అతడు తన వాహ్యాళి విహారాలకుగాను లింగంపల్లిలో పెద్ద ఉద్యాన వనమును పెంచెను. దానినే యిప్పటికిని "బాగెలింగంపల్లి" అని అందురు.

## గోషామహల్ :

అతడే తన వినోదాలకు తాను నిర్మించిన నట్టితో తృప్తి పడక "గోషా మహల్" కట్టించెను. అచ్చట ఒక పెద్దహౌజు కట్టించెను. దాని చిహ్నాలిప్పటికిని గోషా మహల్‌లో కలవు. దాని చుట్టును ఒక వేయి పెద్ద గదులు కట్టించెను. ఈ పాదుషా చీనా దేశము నుండి చిత్రకారులను పిలిపించి షాహీ అషుర్ఖానాలో రంగుల చిత్రాలు వ్రాయించెను. ఇతడు తన కాలములో ఒక ఆజ్ఞను తన రాజ్యములో కావించెను. 'పీర్ల పిండుగ' కాలములో ఒక రాజ్యమందెచ్చటను దేవిడీలలో నగారాలు మ్రోయించ కూడదనిన్నీ, తమలపాకులు, మాంసము ఎవ్వరునూ తినకూడదనిన్నీ అమీరుకానీ, ఫకీరుకానీ ఆనందాల నన్నింటిని కట్టిపెట్టవలెననిన్నీ హిందువులకును,ముసల్మానులకును ఈ యాజ్ఞ వర్తించుననిన్నీ ఫర్మానాను ఇచ్చెను.

## లంగర్ :

మొహర్రం (పీర్ల) పండుగలో 20 ఏండ్ల క్రిందటివరకు అయిదవ దినము నాడు హైదరాబాదు నగరములో "లంగర్" అను ఉత్సవము ప్రచండవైభవముతో జరుగుచుండెను. దీని ఉత్పత్తి క్రమము రమ్యముగా నున్నది. సుల్తాన్ అబ్దుల్లా ఖుతుబ్‌షా ఒకనాడు ఏనుగుపై ఎక్కి వాహ్యాళి వెళ్ళుచుండెను. అంతలో ఏనుగుకు మదమెక్కెను. అది చుట్టుపట్టు వారిని చెదరగొట్టి ఒకే పరుగున అడవి మార్గము పట్టెను. ఈ వార్త సుల్తాను తల్లియైన హయాతు బక్షీ బేగంకు తెలియగానే ఆమె ఏడ్చుచూ కూర్చుని తుదకు 'హజరత్ ఇమాం హుసేను'ని తలచుకొని నాకొడుకు క్షేమముగా తిరిగి వచ్చినట్టయితే బంగారు గొలుసును సిద్ధము చేయించి నాకొడుకు నడుముకు చుట్టి 'లంగర్'కు పెళ్ళి తను తర్వాత దానిని ఫకీర్లకు పంచి పెట్టుదును అని మ్రొక్కుకొనెను దైవము ఆమె ప్రార్థనను వినెనో ఏమో అన్నట్లుగానే ఏనుగు పట్టుబడెను

పాదుషా క్షేమముగా దేవిడీకి వచ్చి చేరెను. అదే క్షణమందు రాత్రియనక, పగలనక కంసాలులను పిలిపించి, బేగంగారు 12 మణుగుల బంగారు గొలుసును సిద్ధము చేయించి, పాదుషా నడుమునకు చుట్టి జూలూను జెళ్ళించి హుసేనీ ఆలం వద్దకు పంపెను. అప్పటినుండియు ఈ లంగరు ఏటేట చేయుట పరిపాటి అయ్యెను.

## మీరాలం చెరువు :

హైదరాబాదు నగరంలో హుసేన్‌సాగరు తర్వాత (ఉస్మాన్‌సాగరు కట్టక పూర్వము వరకు) మీరాలం చెరువు చాలా ప్రసిద్ధి నొంది నట్టిది.

నవాబ్ సికందర్‌జా (ఆసఫ్ జాహీ వంశపు నవాబు) 1187 హిజిరీలో హైదరాబాదు రాజ్యానికి వచ్చెను. 1219 హిజిరీలో మీరాలం అతని మంత్రి యయ్యెను. అతడు నాలుగేండ్లు మంత్రిత్వము నిర్వహించి మరణించెను. అతని కాలములోనే అతని పేరిట మీరాలం చెరువు కట్టబడెను. దానికిగాను మూడు లక్షల రూపాయలు ఖర్చు పెట్టెను. మూసీ నదీ తీరములో బారాదరీ తోట కూడ అతడే వేయించెను. మీరాలం మండి (దీనినే పామరులు 'మిరియాల మండి' అని అందురు) అను నదియు వీరే ఏర్పాటు చేయించిరి. ఇప్పటికిని అచ్చట కూరగాయలు అమ్మ బడుచుండును.

## చాదర్‌ఘాట్ వారధి :

1246 హిజిరీలో నవాబు నాసిరుద్దౌల కాలములో చాదర్‌ఘాట్ వారధి కట్టబడెను దానికై సుమారు 50 వేల రూపాయలు వ్యయమయ్యెను.

మూసీ నది క్రీ. శ. 1912 లో గట్లు తెగి పారి నగరములో గొప్ప నష్టము కలిగించినది. యిప్పటి కాలము వారి కందరికిని తెలియును. పూర్వము 1246 హిజిరీలో అనగా 113 ఏండ్లక్రిందట ఒక మారిట్లే మూసీనది ప్రవహించి యుండెను అప్పుడు పూరాన్‌పుల్ కొంత భాగము ఎగిరి పోయెను. ఘాసిమియా బజారున్ను, సిద్ది అంబరు బజారున్ను, దీని పరిసర ప్రదేశాలును నదిలోని నీటిచే మునిగిపోయి చాలా నష్టమయ్యెను.

ఈ విధముగా హైదరాబాదు నగరములో ప్రసిద్ధమైన స్థలము లేర్పడుచూ వచ్చెను.

# గొల్లకొండయే గోలకొండ

ఇది గోలకొండకు సంబంధించిన శాసనము. గోలకొండకు సమీపములో రోజా అను గ్రామములో ఉన్న ఒక గొల్లవద్ద అతని పూర్వీకుల కిచ్చిన సనదు కలదు. ఆ సనదు పార్సీలోను తెనుగులోను ఉన్నది. రెండును ఒకే సమయములో గోలకొండ బాదుషాచేత వ్రాయించి యియ్యబడినవి. భాషను ఉన్నదున్నట్లుగా ఉంచినాము. ఈ సనదులోని కొన్ని విశేషాలను మరొకమారు విశదపరుతుము. ఇది గోలకొండ చరిత్రకు చాల అనుకూలించునని నా అభిప్రాయము :

ఖిలే మానుగల్ ఉర్ఫె గోలుకొండ మహమ్మదునగరు సూబేపరు కుంద బున్యాదుపర్గణే హవేలి బాగానగరం మస్తూరువుదరే దనుగరు కొండయ్య సాకీన్ గోలకొండ రేపల్లెవాడ వలదు కొండయ్య, బినుకొండయ్య, ఇబ్బను కొండయ్య పరుమానియ బజానానే కారుకూనాసె వకానుగొయాసె వదేశ ముఖానే వదేశ పాండ్యానే వపచేలియాసెవ, కులకర్ణియాసె వరాయాసె, సుల్తాన్ అబ్దుల్లా బాదుషాకు తుపుషాగారు. 1086 సంవత్సరముల క్రిందట ఖిల్లా కట్టుటమునకు ప్రయత్నం చేస్తే కుదురనందున బాదుషాతనము రుషతైన సయ్యదు షాముస్తఫా సాహెబు కాదరీ సాకీన్ ఔరంగాబాదు హాలు మొకాం గుల్బర్గాగారితో బాదుషాచేసే బయాన్ ఏమనగా మా పెద్దలైన పెద్ద మూలకు కుతుబుషా బాదుషా గారు 964 సం॥రముల క్రిందట (భాగానగరము) దాబానగరము అను పేరు పెట్టి ఖిల్లా కట్టడమునకు ప్రయత్నముచేస్తే కుదురలేదు. సీసుకమ్మగుట్టల మీద కిలా కట్టడమునకు పులుగం పోస్తే అది కుదురలేదు. ఈ ఖిల్లా కుదురలేదు. ఇప్పుడు మనము పులుగంపోసినా కుదురలేదని ఆలోచనచేస్తే ఆ కురుషతు బాదుషాతో చేసిన బయాన్ ఏమనగా (1) వరంగల్ ప్రతాపరుద్ర మహారాజుగారికి దనుగరు కొండయ్య చాలా కరామతును చూయించి భోనగిరి ఖిల్లా కూడా వరంగల్ ఖిల్లా కూడా ఈ దనుగరు కొండయ్య పరంపర తయారు చేయించినట్లుగ మన దగ్గర కొండయ్య - సనదులు వున్నవి కదా ! అందును గురించి అదే పరంపర ఆంఖిల్లా గోత్రం సూర్యవంశ

గురు బసవేశ్వరుని శిష్యుడైన ఈ కొండయ్యను పిలిపించి నేను విచారింతునని చెప్పి కొండయ్యను నాగజర్రి రేపల్లె వాడనుంచి పిలిపించుకోని వందనాది క్రియలచే పూజించి మేము ఖిల్లా కట్టటమునకు పులుగంపోసి ప్రయత్నం చేస్తే కుదురలేదు, ఎందునిమిత్తార్థం? పూర్వము మీ పరంపర వారు భోనగిరిఖిల్లా వరంగల్ ఖిల్లా కట్టివున్నారు మీరు అదే సంతతి కాబట్టి ఇదీ కూడా మీవల్లనే కావలెను గాని ఇఫు ఎవరినుంచికాదని అడిగి చాలా మనవి చేసినందున కొండయ్యా సమ్మతించి అక్కడ వీరు అడుగక మునుపే తాను చేసియుంచిన యావత్తు కరామతు బయానుచేసి దౌలతు చూయించి సాదుగోకుల్ దాసుభావిలో బంగారి పుతులీ అయివున్న రామతు చెప్పి ఆస్థళమహత్తు అంత్ చూపించి ఇదే కొండయ్యా పేరు తోటి 1087 సం॥రములకు సరి అయ్ని ఖరనామ సంవత్సర భాద్రపద శు॥ 5 శుక్రవారము 13 పదమూడు ఘడియల రాత్రికి పులగం పోసినాడు తర్వాత ఖిల్లా యావత్తు తయారు చేయించినాడు. ఈ కొండయ్యా చూపించిన దౌలతు తోటి ఖిల్లా తయ్యారు అయివున్నది. ఖిల్లా తయ్యారు అయిన పిమ్మట సుల్తాను అబ్దుల్లా కుతుబుషాగారు బాదుషా తమ మురుషదుతో బయాన్ చేసినది ఏమనగా (2) ఈ దనుగరు కొండయ్యా దేవ కల్యాణమునుండి వచ్చి మన స్థళమందు రేపల్లెవాడ కట్టుక నాగజిర్ర తోడుకొని మర్రిమాత యల్లమ్మను నిలబెట్టుకొని మల్లన్న మఠము కట్టుకొని యాదవ పీఠము సమేతముగా ఇంత మహత్తు జరుపుతూవున్నాడు, మనకు తెలియలేదు, మనము పిలిపించి విచారించితే బహుకరామతు చూపించి బావిలో బంగారు పుతిలీనివ దౌలతు చూపించినాడు వీరు లక్ష్మిప్రసన్నులు కనుక మన కోరి లు ఈడేర్చి మనల కృతార్థులచేసినాడు. వీరితోనే మన గద్దినిలచియున్నది. కనుక ఈ కొండయ్యాకు ఏమి కావలెనో ఏమి అడుగుతాడో విచారించమని చెప్పిన సయ్యదుషా ముస్తఫా మురుషదు కాదరీగారు. కొండయ్యాతో చేసిన మారూజా ఏమనగా! (3, ఏ-కొండయ్యా బాదుషాగారు ఏమి కావలెనో ఏమి అడుగుతాడో మిమ్ముల విచారించమని అన్నాడు కనుక మీరు పెద్దలు కనుక నీకు ఏమి కోరిక వుంటే ఆ కోరిక అడుగుమని విచారించగా మురుషదుతో కొండయ్యా చేసె మారూజా ఇదికదా! పన్నెండు గొల్ల కులాలకు రెండు కురుమ కులాలకు నేను గురువును యాదవ పీఠానికిని అధికారివలె మానుగలుగు ఎప్పటికి గోలకొండ అనే పేరు వుంచేది. గొల్లకొండ అని అనవలసినది. మా పరంపర రాబడిన 1465 సంవత్సరముల నుండి జరుగుకుంటు వచ్చిన వరంగల్

ప్రతాపరుద్ర మహారాజు ఇచ్చిన సనదు చూచుక ఆదే ముతాబకు మొహరు దస్త కతుతో మాకు సనదు ఇచ్చేది. ఇదికాక గొల్లవాండ్లకు కురుమవాండ్లకు కూని చేయకూడదు ఆగరు కూని చేసినట్టు అవుతె గద్దికి హతకు వస్తాది. అదే తక్షణం లక్ష్మి వెళ్ళిపోతుంది ఇదిగాక కిలాలోపట యున్న యల్లమ్మ ఒకటి కిలా బయట యున్న మల్లన్న మఠము. ఇవి యావత్తు వున్నంత దూరము దోషావరు జమీను ఇవి మావిగా వుండె అట్టి హుకుం ఇవ్వవలసినది. ఇదిగాక ప్రతాపరుద్ర మహా రాజు ఇచ్చిన 1465 బిరుదావళి మర్తబా కితాబు ఏమనగా మా యాదవ పీఠము వెంట యాదవులున్ను యెలిగొలచి మహమ్మదీయున్ను స్వామి కార్య దురంధ రున్ను దేవబ్రాహ్మణ భయభక్తి పరులున్ను పదునూట సహోదర రాజులున్ను బిరుదు అంబారి చెంద్రా యుధము మకర తోరణాలు పగటి దివిటీలు నెమిలి పింఛాలు భుజకీర్తులు, కిరీటము, భూచక్ర గొడుగు, అప్తాగిరి పాలీక నగుబోతు, నగారాధముకా నిషానీ, హనుమంతు నిషాని, ఏనుగుమీద ధముకా ఒంటెమీద ధముకా రణభేరి సింహమూతి కడియాలు మకర కుండనాలు సింహతలాట అంబారి మహిమా రుతబా గరుడ పడిగెలున్ను హనుమంత చక్రములున్ను అల్లా పద్మము లున్నూ శంఖాలున్నూ వీరణమ్ములున్నూ శ్రీరామ కొణితలున్నూ సమస్థ రాగా లున్నూ బసువ చెక్రపు గొడుగులున్నూ చుట్టు వీదెలున్నూ జంగపు గొడుగులున్నూ శ్రీరామ కాని యాదవపీఠము నిర్ణయంబైన తారీకు 5002 అక్షయ సంవత్సర సృష్ట్యాది శతాబ్దం 1955 & 5002 రాజాధిరాజ ప్రతాపరుద్ర మహారాజు యాబైయారు రాజ్యములకు ఇచ్చిన సనదు ముతాబికు మరిమాత రేపెల్లెవాడ మసీదువ మల్లన్న మఠం దీనిక్రింద వూదుగుల్‌వ చిరాగువ, మరమ్మతు హమేషా దుచాపరుజమాను సఫీలు బయటము, గూమవరము, మర్లగడ్డ మక్తా 305 బిగాలు రామస్వామి గుట్టవద్ది మక్తా 325 బిగాలు తోకపుట్టి చరాయపట్టి, వజా తర్లు మల్లన్న జాగీర్లు. వటీకప్ప జాగీరు వగొల్లల కురుమల దగ్గర రుసూంసాలు బసాలు రుసూం జారిచేసినందున సనదుము తాబికువ కొండయ్య అరజుముతాబికు సర్కారు పర్మానుముతాబికు జరుపవలసినది. ఈ సనదు యందున్న దానిలో సర్కారికి ఏమి హక్కులేదు. ఈ కార్యం సరుహర్ మాకు సర్కారు సదా మదతు ఇచ్చి హమేశా ఊదుగుల్ చిరాఖు మరమ్మతు చేయించవలసినది. పుత్ర పౌత్ర పారంపార్యాయం హరిచంద్ర హరుకంగ వారి ఆలు ఆవులాదు సూర్య చంద్రులు ఉన్నంత పర్యంతము ఏ బాదుషా గద్దె ఏలినా సుఖంగా రాజ్యములో

జరిపించవలసినది. సమస్త రాగాలున్నూ శ్రీరామ కొలనులున్నూ పడిగనాదము లున్నూ యడమ కుడి శంఖములున్నూ ఏకముఖరుద్రాక్షయున్నూ శంఖుచామరా లున్నూ బసువశంఖుబిరుదులున్నూ సంగడి తోరణాలున్నూ ఛాయఛాయ గొల్లెండ్లున్నూ నవవన్నె గొల్లెండ్లున్నూ జల్లానదట్టీలున్నూ పట్టుదట్టీలున్నూ పట్టు హారాలున్నూ గంటల వడ్యాలమున్నూ తరుట వీరణంబులున్నూ అశ్వము మొగ గుర్రములున్నూ వివహము.........మురుమలతోటి ద్వాదేశమున్నూ భారత భాగవతము......... యావత్తు బిరుదావళి ప్రతాపరుద్రుడు ఇచ్చిన ముతాబికు మీరు హుకుం ఇచ్చి దౌరామీద రవాణా చేస్తూ వుండవలసినది. గోలకొండ గద్దె ఏ బాదుషా ఏలినప్పటికైన మా సిలసిలా వాండ్లతో ఆశీర్వచనములు సాలు సాలుకు తీసుకొనుచుండవలెను. ఏ బాదుషా అయిన తప్పినట్టు అయితే గద్దికి హతకు రాగలదు. తురకలేగాని, తెలుగలేకాని సాలుసాలుకు ఆశీర్వచనములు తీసు కుంటూ పుత్ర పౌత్రాభివృద్ధిగా హరిచంద్రార్కముగా సూర్య చంద్రాదులు వున్నంత పర్యంతరము సుఖముగా రాజ్యమేలుచుండవలసినది. బాదుషా గొడుగు తిరిగిన పరియంతరము మా పరంపర వాండ్లను సురుబరాయి చేసి దౌరామీద హరియేకు పరుగణాకు రావాణా చేసేది. ఏ గ్రామమే కాని ఏ సర్కారే గాని ఎక్కీసు సర్కారు అనగా ఇరవై ఒకటి సర్కారు ముమాలకె సర్కారిఆలి మాసిలసిలా వారికి హమేషా మదతు ఇచ్చుకుంటా వుండవలసినది. అట్లు మదతు వ్వుండనట్టు అపుతె మా సంతతివాండ్లు ఏమన్నప్పటికైనా హతకు కాగలదు. మా సంతతివాండ్లు కన్నీరు నించితే ఇచ్చటినుంచి లక్ష్మి కన్నీరు నించుకొని వెళ్ళి పోవును. గద్ది పరరాజుల పాలుగాగలదు ఇదిగాక మా యాదవ కులములో ఒక చోటి మొకద్దమాకు మినహ తతిమ్మ మొకద్దమా ఏదైనా మేము విచారణ చేసి పైసలా చేసుకోగలము కాని సర్కారువారు విచారించుటమునకు బిల్‌కూలు అక్కరలేదు. ఇదిగాక ఈ గోలకొండ గద్దికింద ఎన్ని రాజ్యములుంటే అన్ని రాజ్యములలో యున్న మల్లన్న జాతరాలు, బీరప్ప జాతర, మల్లన్న మ్యాళ్లాలు, బీరప్ప మ్యాళ్ళ్యాలు, చౌడమ్మ మ్యాళ్ళ్యాలు, తెల్ల చెరల మ్యాళ్లాలు, కొమ్మోజీ మ్యాళ్లాలు, ఎగరజోగోని మ్యాళము కుల్లు యాభైయారు రాజ్యాలలో వుండె పన్నెండు గొల్లకులాలు రెండు కురుమ కులాలు సాలుసాలుకు మాకు రుసుం కట్టె అట్టు మీరుసనదు మొహరుదస్కతుచేసి ఇవ్వమని కొండయ్యా విచారించి సయ్యదుషా ముస్తపా సాహెబు కాదరీగారు సమ్మతించి ఈ కొండయ్యా చేసిన

యావత్తు మారాజాను సుల్తానుఅబ్దుల్లా బాదుషాకు చెప్పితేవారు సమ్మతించి ముందు ప్రతాపరుద్రుడు ఇవ్వబడిన సనదు యాభై ఆరు రాజ్యములకు వుండె కనుక తమచే సూబెదకన్‌కు సుల్తాను అబుదుల్లాబాదు బాదుషా ఇచ్చే హుకుం మాచే సూబేదక్కన్ వాండ్లు వుండె కుల్లు యావత్తు మఠాలలో వసూలు చేసుకొనేది. పన్నెండు గొల్లకులాలు రెండు కురుమ కులాలదగ్గర ఇల్లువకటికి ఒక్క రూపాయి భత్యంమ్యాకలువున్న వాండ్లతావున ఒక్క మ్యాకభత్యం తీసుకునేది. గొర్లువున్న వాండ్ల తన ఒక్క గొర్రె భత్యం తీసుకోవలసినది. ఆవులువున్న వాండ్ల తన వక్క రూపాయి భత్యం తరుపు తీసుకోవలసినది. మొగ్గాలు వున్న వాండ్ల వద్ద ఒక్క రూపాయి భత్యం తీసుకొనేది. చీర్ల వాండ్ల మేళమువద్ద అయిదురూపాయల భత్యం తీసుకునేది. మల్లన్న మఠాలలో మల్లన్న మ్యాళ్ళాల్లలో మఠం వక్కంటికి మ్యాళ్ళం వక్కంటికి అయిదు రూపాయల భత్యం తీసుకోవలసినది. తెల్ల చీరల మ్యాళ్యం వాళ్ళవద్ద అయిదు రూపాయల భత్యం తీసుకోవలసినది. మందుచ్చోని మ్యాళ్యం వద్ద అయిదు రూపాయలు తీసుకునేది. కొమ్ము వాండ్ల మ్యాళ్యం వద్ద అయిదు రూపాయల భత్యం తీసుకోవలసినది, తగరుజోగోని వద్ద అయిదు రూపాయల భత్యం తీసుకొనేది. దక్షిణ కాశి కొలను ప్యాకలో కాటకోటయ్యను వుంచిన మఠములో అయిదురూపాయలు భత్యం తీసుకునేది. సిద్దేశ్వర సిద్దయ్యను వుంచిన మఠములో అయిదు రూపాయలు భత్యం తీసుకునేది. ఈ రెండు దక్షిణ కాశి కొలను ప్యాకలో గొల్లకురుమ వాండ్ల మఠాలు చౌడమ్మ మ్యాళ్ళం వాండ్లవద్ద అయిదు రూపాయల భత్యం తీసుకోవలసినది, కుల్లు యాభై ఆరు రాజ్యములలో వుండె జాతరుల హక్కు రుసుం సదరు యాదవ పీఠము క్రింద వున్న కుల్లు జాతరాల వాండ్లు సాలుసాలుకు యాదవ పీఠానికి రుసుం కట్టవలెను. మా ఇక్తిదారిప్రకారం శిక్షించి భూదానగోదాన సమేతముగా తీసుకొనేది. ఇందుకు సర్కారు వారు మద్దతు ఇచ్చి దొరామీదా హాజరువుండి వసూలుచేసి ఇవ్వవలసినది. ఇది సుల్తాను అబ్దుల్లా బాదుషా కుతుబుషా సమ్మతమున వ్రాసి ఇచ్చిన మొహరు దస్తకతు సనదు, పర్మాను. ప్రతాపరుద్ర మహారాజుగారి ఇచ్చిన సనదుమీద దస్కతులు చేసిన పీఠముల తపిసీల పేర్లు :-

## పీఠములు :

1. శృంగేరి పీఠము, 2. పుష్పగిరి పీఠము, 3. విరూపాక్ష పీఠము, 4. కనకమ్మ పీఠము, 5. మాధవాచార్యుల పీఠము, 6. విపోదివారిపీఠము, 7. కనుపర్తి వారి పీఠము, 8. వీరభోజన పీఠము, 9. రామానుజ పీఠము, 10. అయ్యాళం పీఠము, 11. ఈరమాతిగరాయుని పీఠము, సాకిన్ హస్తినా పురము.

## పన్నెండు గొల్ల కులాలు :

1. యెర్రగొల్ల, 2. ముష్టిగొల్ల, 3, కరిణిగొల్ల, 4. పాకనాటిగొల్ల, 5. పూజగొల్ల, 6. మొదటీట గొల్ల, 7. నల్లసదనపు గొల్ల, 8. గుజరాతి గొల్ల, 9. గంపగొల్ల, 10. పెయ్యగొల్ల, 11. వెయ్యగొల్ల, 12. సిద్దగొల్ల.

## కురుమ కులాలు :

1. పత్తికంకణము, 2. ఉన్ని కంకణము

ఇట్లు, విధేయుడు యాదవ దాసుడు దస్తూరి సింగభూపాల్‌రావు సా, రాచెర్లగారు, అని వున్నది.

9-1-41 నాటి గోలకొండ పత్రికలో గొల్లకొండయే గోలకొండ అయ్యెనని నిరూపించు సనదును ప్రకటించి యుంటిని. అందలి విశేషాలను తెలుపుటకు ముందు ఆ సనదులోని కొన్ని పదాలకర్థములు వ్రాయుదును. హైద్రాబాదు రాష్ట్రములో ఉర్దూ తెలిసిన తెనుగువారి కందలి చాలా పదాలర్థమగును. ఉర్దు తెలియని వారికొరకు కొన్ని పదాల అర్థమును వ్రాయుదును.

ఈ సనదు ఇప్పుడు ముద్దము మల్లయ్యా అను గొల్లవద్ద ఉన్నది. పూర్వము ఈ మల్లయ్యా ఇంటి పేరు కొండవాళ్ళు అని యుండెను. అనగా కొండయ్యా ఇంటి వారు అని యర్థము. ఇతని గోత్రము పేరు అంకిళ్ళ గోత్రము. దీనినే సనదులో ఆంఖిల్లా గోత్రము అని వ్రాసినారు. ఇతని నివాస స్థలము గోలకొండ ఖిల్లాకు అరకోసు దూరములో ఉన్న "దర్గా" అను గ్రామము. ఇతని పూర్వీకుడే సనదు పొందిన కొండయ్యా. అతనిని దనుగరు కొండయ్యా అన్నారు. దనగరు అనగా గొల్ల (దధికార తద్భవము) బిను లేక బిన్ లేక ఇబ్బను లేక ఇబున్ అను పదాలు అరబీ పదాలు, కుమారుడు అని అర్థమిచ్చునవి.

ఇక సనదులోని పదాల వివరణమును తెలుపుదును. గోలకొండకు పూర్వము పేరు మానుగల్ కోట అని యుండెననీ మొట్టమొదటి వాక్యమే స్పష్టము చేయుచున్నది. ఈ పేరు చరిత్రకారు లెవ్వరు పేర్కొనలేదు. ఈ సనదులోనే మనకు మొదటి పర్యాయము కనబడుచున్నది. భాగా నగరము లేక భాగ్యనగరము ఇప్పటి హైదరాబాదే. రేపల్లె వాడ గోలకొండ కోట ప్రక్క భాగముననే పడమటి దిక్కున ఉన్నది. ఇప్పుడది పాడుపడినది ఈ సనదులో చూపించబడిన మల్లన్న మఠము, మసీదు, మర్రిమాత నాగఝరి ఈ రేపల్లె వాడలో ఉన్నవి. సనదులో 1086 సంవత్సరము క్రిందట అనిన్ని 964 సంవత్సరాల క్రిందట అనిన్ని వ్రాసినారు, అనగా అవి హిజ్రీ తేదీలు, 1086 హిజ్రీలోను, 964 హిజ్రీ లోను అవి జరిగెనన అర్థము. ఫార్సి సనదులో సీస కమ్మల గుట్టవద్ద కోట కట్టుటకు 1027 హిజ్రీలో ప్రారంభించిరి అని వ్రాసినారు.

సీసకమ్మ గుట్టలు గోలకొండకు ఉత్తర దిశలో ఇప్పటి హకీంపేట అను గ్రామము వద్ద ఉన్నవి. వాటి పైన గూడ కోట కట్టదలచిరి. కాని అచ్చట అది కుదరలేదు. ఔరంగజేబు గోలకొండను ముట్టడించినపుడు ఈ సీసకమ్మల గుట్ట వద్దనే డేరాలు వేసి విడిది చేసెను.

ఈ సనదును ఇచ్చినవాడు సుల్తాన్ అబ్దుల్లా కుతుబుషా. ఇతని గురువునే మురుషతు అని పేర్కొన్నారు. పెద్ద మూలకు కుతుబుషాగారు అనగా ఇబ్రహీం పూర్వికుడగు 964 హిజ్రీలో గల గోలకొండ రాజ్యమును పాలించిన కుతుబుషా యని అర్థము. అతని కాలములో గోలకొండ కోట కట్టబడెను. అది బాగా కుదర లేదు. దానినింకను దృఢపరుపదలచిరి, అందులకే కొండయ్య సహాయపడినాడు.

"పులగం పోయుట" అనగా కోటలకు పునాది వేసినప్పుడు అన్నమును మేకలను బలిగా యిత్తురు దానినే పులగం పోయుట అని యందురు.

నాగఝురి :- ఇది గోలకొండకు పశ్చిమ దిశన నుండు గుట్టలలో ఉన్నది కోటకు అర్ధమైలు లోనే ఉంది. ఇది నాగఝురి. సుమారు 50 అడుగుల ఎత్తు రెండు గట్లున్నవి. వాటి సమీపములో భూమిలో 3 అడుగుల లోతున గుంత కలదు. అందు సదా ఊట వచ్చుచుండును. ఎండాకాలములో కూడ ఒకే విధముగా

నీరు వచ్చుచుండును. ఇప్పటికిని ఆ గట్లలో పశువుల మేపుకొని పశువులకు ఈ నాగఝరి వద్దనే నీరు త్రాపుదురు.

సాధుగోకుల్‌దాసు బావి :- ఇది గోలకొండ కోటలోనే కలదు. దీని కథ రమ్యముగా ఉన్నది ముందు విమర్శలో వ్రాయుదును.

బంగారు పుతలీ :- బంగారు బొమ్మ ఈ బొమ్మ కథపై గోకుల్‌దాసుతో సంబంధించినది.

మర్రిమాత ఎల్లమ్మ :- ఇది నాగఝరి వద్దనే 100 అడుగుల దూరాన కలదు. ఒక పెద్ద గుండునకు పెట్టెలు వేసి దానిని పూజింతురు. దాని నిప్పటికిని అచ్చటి హిందువులు పూజింతురు. ఏటేట ఉత్సవము చేయుదురు. మానుగల్లును గోలకొండ అని పిలువవలెనని ఇందు కొండయ్య కోరెను. అదే అపభ్రంశమై గోలకొండ అయినది. గొల్లవాండ్లలో 12 శాఖలును వారికన్న కొంచెము తక్కువగా చూడదడు కురుమవారితో 2 శాఖలును కలవు వాటి పేరులు ఈ సనదులో కలవు. ఇప్పటికిని ఈ శాఖలు కలవు.

ఎల్లమ్మ :- ఈ దేవత ఖిల్లా లోపల కలదని ఈ సనదులో కలదు. ఇప్పటికిని కలదు. కట్టకడపటి భాగమగు బాలాహిసారును ఎక్కు ఆవరణము ప్రక్కన ఉన్నది. ఈ ఎల్లమ్మ గుడివద్దనే ఒక ఫిరంగి కలదు. ఇప్పటికిని గోలకొండలోని హిందువులు ఈ ఎల్లమ్మకు ఏటేట కొలుపులు చేయుదురు.

మల్లన్న మఠము :- నాగఝరికి పోవు మార్గములో దానికి ఫర్లాంగు దూరములో ఒక చిన్న ప్రాత మసీదు కలదు. దానికి సమీపములో ఒక చిన్న సమాధి కలదు. దానిపై మూడు అడుగుల చౌకము 6 అడుగుల ఎత్తును పైన చిన్న గుంబదువంటి కలదియును శిథిలావస్థలోను నున్న గది కలదు. అదే మల్లన్న మఠము దానినిప్పుడు గుర్తుపట్టువారు లేకున్నారు. దానిని గుర్తుపట్టుటకు పరిశోధన చేయవలసి వచ్చెను.

దోషావరు జమీను :- జమీను అనగా భూమి దోషావరు, లేక దోచావరు అనునది ఒక కొలత రెండు గొర్రల వైశాల్యము కలదిగా ఉండెను. ఇది పార్శీ

పదముగా కనిపించుచున్నది. అందున ఇప్పుడు మిలిటరీకిగాను బునాదులు తీసి బంగ్లాలు కట్టుచున్నారు ఆ భాగమంతయు దోషావరు జమీనే- అది కొండయ్య కిచ్చిన ఇనాము భూమి. దాని వారసుడు యీ సనదుకల మల్లన్నయే. యితని అజ్ఞానముచేత దారిద్ర్యముచేత ఈ జమీను సర్కారుకు చెందిపోయినదను కొనవలెను.

సనదుపొందిన కొండయ్య ఎట్టిగొలకాదు, వెట్టిగొల్ల. అతడంతటి సహాయ కారియుండిన అబ్దుల్లా ఖుతుబుషా అంతటివాడు ప్రసన్నుడై ఉండిన ఆ పాదుషా వద్ద ఒక సంస్థానమును కోరియుండరాదా? దానికి బదులుగా తిక్క బిరుదుల, గొర్రెలు, రూపాయలు, కట్నములు కోరుకొన్నాడు ఆ బిరుదుల పట్టిక యిందు కలదు.

అప్తాగిరి :- పార్శీలో ఆఫ్తాబ్‌గీరి అనగా ఎండను ఆపు ఛత్రి.

పాలీక :- పల్లకి.

నగుబోతు :- నౌబత్ - నగారా జాతి దముకా - ఢంకా.

అల్లా పద్మములు :- ఇస్లాం మత చిహ్నముగా అల్లా పదములు చేసుకొని కొలుచుట గొల్లలలో కొందరికి వాడుకగా ఉండినట్లున్నది.

రామకొణితలు :- కొణితలనగా సొమ్ములు. శ్రీరామ విగ్రహానికి పెట్టిన సొమ్ములు. ఇప్పుడవి జనగామ తాలూకాలో కొమరవెల్లి గ్రామములోని శ్రీరాముని విగ్రహముపై ఉన్నవందురు.

సింహమూతికడియాలు :- మణికట్లకు పెట్టుకొను సింహమూతిగల బంగారు కడియాలు.

గరుడపడిగెలు :- పట్టుదారాలతో అల్లిన పట్టీ - నాల్గువ్రేళ్ళ వెడల్పుదిగా ఉండును. దానిని నడుమున బిగింతురు. శివమువచ్చువారే దీనిని కట్టుకొందురు.

శ్రీరామకొని :- శ్రీరాములవారి కాలమునుండి మొదలుకొని అని అర్థము.

పూదుగుల్ చిరాగు :- పూదు అనగా అగరు ధూపము. గుల్ అనగా పూలు, చిరాగు అనగా దీపము.

బీరప్ప జాతర :- బీరప్ప లేక వీరప్ప అనుదేవత. గొల్లలకు ముఖ్య దేవత. ఆ దేవత కొలువులో సుమారు 4 అడుగుల యెత్తుగల పెద్ద డోలును వాయింతురు - ఇప్పటికిని దానిని వీరప్పడోలు అని యందురు.

హరిచంద్రహరుకం :- ఆ చంద్రతారార్కం అనుమాట.

ఆలుఅవులాదు :- అరబ్బీ పదము - పుత్ర పౌత్రపరంపర అని అర్థము.

రామకొలనులు :- అగ్నిగుండము ముందు మల్లన్న మఠముపెట్టి ఒళ్ళు నిండినవారు అగ్నిగుండములో దుముకుదురు - ఆ గుండమునే రామకొలను అని యందురు.

గంటల వడ్యాలము :- చిరుగంటలుకల వడ్డాణము, నడుము వట్టి.

గొర్లువున్న వాండ్ల తన :- తన అనగా తావున వద్ద అని అర్థము.

అశ్వము మొగము గుర్రము :- అశ్వము మగ గుర్రము అని చదువుకొన వలెను - మగ గుర్రమని యెందుకన్నారనగా గొల్లవారు పెంటిగుర్రాన్ని యిప్పటికిన్ని ఎక్కరు - పెంటిగుర్రమెక్కితే వారికి కులం తప్పు - అయితే వారికి వివాహాలలో గుర్రముపై మెరిమెన చేయు హక్కు లేదు.

మ్యాళ్ళము :- మేళము - భజంత్రీతోటి ఉత్సవము.

సాదు గోకుల్‌దాసు బావి :- కొండయ్య బాను చేసియుంచిన యావత్తు కరామతు బమాను చేసి దౌలతు చూయించి సాధు గోకుల్‌దాసు బావిలో బంగారి పుతిలీ అయి ఉన్న కరామతు చెప్పి ఆ స్థల మహత్తు అంతా చూపించెనని సనదులో కలదు. దీని కథ ఏమనగా !

గోలకొండ కోట కట్టిన కాలములో తత్పరిసర ప్రాంతాలలోని చిన్నచిన్న గట్లలో సాధు గోకుల్‌దాసు అనువాడు నివాసము చేసియుండెను. అదే ప్రాంతాలలో కొండయ్య మేకలమేపుతూ గోకుల్‌దాసునకు దినమున్నూ మేకపాలనిచ్చునూ వచ్చెను. కొంతకాలమిట్లు ఉభయులకు మైత్రి కుదిరింది. ఒకనాడు సాధువు ఒక పెద్ద ఇనుపకాగు పెట్టి, దానిలో నూనె పోసి సలసల కాచుచూ ఉండినాడు. కొండయ్య చెంబులో పాలు తెచ్చి సాధువుకిచ్చినాడు. సాధువు వాటిని త్రాగి ''అరే కొండయ్య నీకు ప్రత్యుపకారం చేయవలెనని బుద్ధిపుట్టింది. ఇట్లురా, ఈ

కాగుచుట్టును ప్రదక్షణము మూడు మారులు చెయ్యి'' అన్నాడు. అమాయకుడగు కొండయ్య అట్లే చేసినాడు మూడవ ప్రదక్షణం చేయుచుండగా సాధువు కొండయ్యను అమాంతముగా ఎత్తి కాగులో వేయబోయినాడు కాని కొండయ్య సాధువు కంటే బలాఢ్యుడగుటచేత పట్టు తప్పించుకొని ప్రక్కకు దుమికినాడు. ఇదేనా నీ ప్రత్యుపకారం అని మహత్తరమైన కోపంతో సాధువునే తటాలున ఎత్తి కాగులో పారవేసినాడు. అంతలోనే ఆశ్చర్యమగు పరిణామము సంభవించెను సాధువు మాయ మయ్యెను. అతని స్థానములో ఆ కాగుచున్న నూనెలో ఒక పెద్ద బంగారు విగ్రహము కనబడెను. కొండయ్య భయపడి ఆ విగ్రహాన్ని సమీపమందు గల ఒక భావిలో పారవేసిపోయెను. ఆ బావినే ఇప్పటికిని గోకుల్‌దాసు బావి అని యందురు. ఆ విగ్రహమునే తర్వాత కొండయ్య ఇబ్రహీం కుతుబుషా కిచ్చెను. ఆ విగ్రహములోని విశేషమేమనగా దినము ఒక అంగముగ చేధించితే మరునాటి వరకు మరల ఆ యంగము యథాప్రకారముగ పెరుగుచుండెనట. అట్టి అక్షయ విగ్రహము నుండి వచ్చిన బంగారుతో కోట కట్టించబడెనట. ఇది బంగారు (పుతిలీ) బొమ్మ కరామతు (మహత్తు) యొక్క కథ.

ఈ కథ నిజమో కాదో మనము చెప్పజాలము. ఇట్టి కథయే కొండవీటి కైఫియత్తులో కలదు. దాని నిందు ఉదాహరించుచున్నాను.

“అనిపోతయ వేమారెడ్డిగారు ప్రభుత్వమునకు వచ్చిన సమయమందు ఒక గొల్లవాడు మేకలుగాసే నిమిత్తము బొల్లుమూరు వేంకటేశ్వరస్వామి వారు వున్న కొండకుపోయి మేకల మేపుతూ వుండి వుండగా ఒక సిద్ధపురుషుడు కామ్యార్థియై వేంకటేశ్వర ఆలయంవద్ద తపస్సు చేసుకుంటూ వుండగా యీ గొల్లవాడు ఆయన యోగక్షేమము అడిగినాడు “నాకు నిత్యమున్నూ క్షీరములు ఇవ్వవలెను” అని సాధువు అడిగినాడు. సన్యాసి ఒకనాడు గొల్లవాన్ని చూచి నీవు నిత్యమున్నూ ఎక్కడెక్కడవుంచే చెట్ల అకులు, మేకలు మేవుతుంటావుగదా, ఏ వృక్షాన్ని అయినా మేకలు మేయగానే తిరిగి వెంటనే ఆకు పుట్టునట్టు దృశ్యమైతే నాకు చెప్ప మన్నాడు. ఆ గొల్లవాడు కొన్ని దినములు శోధనచేయగా దృష్టమైనందున సన్యాసికి చెప్పగా ఒక దిన శుద్ధి చూచి ఆ చెట్టును తగుల బెట్టించి వృక్షము దగ్ధమయ్యే సమయములో గోపకుని చెయ్యిబట్టి ప్రదక్షణచేస్తూ వానిని యేమరించి మంటలో పడదొయ్య బోతే వాడు పుష్టికలిగినవాడు కనుక గొల్లలోబడక బహు

దినాలనుంచి నా మేకల పాలుతాగి నాకు ఉపకారం చేస్తానని నమ్మించి నన్ను అగ్నిలోవేసి చంపజూచినావా అని సన్యాసిని బట్టి జ్వాలలోపడదోసి తన ఇంటికి వచ్చి మరునాడు తిరిగి మేకలు తోలుకొని ఆ స్థలానికి వెళ్ళిచూచేవరకు బంగారు ప్రతిమయై మనుష్య ప్రమాణపు, విగ్రహముగా నిలిచియున్నందున గొల్లవాడు పూర్వ వైషమ్యముచేత తన గొడ్డలి తీసుకొని ఆ విగ్రహము యొక్క హస్తమును ఛేధించేవరకు యథా ప్రకారం హస్తమావిర్భవించె, వాడు ఆశ్చర్యపడి వాడు బంగారం తీసుకొని సెట్టికిచ్చి తనకు కావలసిన పొగాకు తమలపాకులు యీ వరస ప్రవర్తిస్తూండగా ఆ కోమటి ధనికుడైనందున, మీ సంగతి చారుల వల్ల అనపోతయరెడ్డిగారు విని వైశ్యుని పిలిపించి దండించి అడిగి నంతలో వున్న స్థితి మనవి చేసెను. గొల్లవానిద్వార సువర్ణప్రతిమను తీసుకొని దానిద్వారా రాజ్య విస్తీర్ణము చేసెను. తదనంతరము కొమగిరి వేమారెడ్డి ప్రభుత్వమునకు వచ్చి ధర్మ కర్తను డయ్యెను. ఈ దినములో వరస చెడి సువర్ణ విగ్రహమున్ను మాయం అయినది."

మరి ఈ కొండపీటి "కరామతు"లో ఎంత సత్యమున్నదో, కొండవీటి కరామతుకు కైఫీయతు ప్రమాణము. "గోకుల్‌దాసు పుతిలీ"కి ఈ గోలకొండ సనదే ప్రమాణం. అయితే యీ సనదు కూడా అబద్ధపు సనదుగా ఉండవచ్చును. ఇదియు కల్పన యేమో అను సంశయములు కలుగకపోవు.

## సనదుయొక్క ప్రామాణ్యత :

ఈసనదు పుట్టినది నిజమైనదిగా కనబడుచున్నది. ఏలనన తెనుగులో సనదును మొదలు వ్రాయించి తర్వాత దానినే ఫార్సీలో వ్రాయించినారు. అయితే ఈ రెండును కల్పనలుగా ఉండగూడదా యనిన తర్వాతి కాలంలో సనదులో కనబరచిన హక్కులు కొండయ్య వంశమువారికి వర్తించుచు వచ్చినట్టు దాఖలాలు నేటి వరకు కలవు. పైగా ఆ సఫ్‌జాహి వంశపు నిజామైన నిజాముద్దౌలా సనదు ఒకటి కొండయ్య వంశము వారి వద్దకలదు. అది 1249 హిజ్రిలో ఇయ్యబడినట్టిది. అనగా సరిగా 111 ఏండ్లక్రిందటిది: అప్పుడు మహారాజ చందూలాల్ మంత్రిగా ఉండెను. ఆ సనదులో ఇట్లు వ్రాసినారు.

"గోలకొండ ఖిల్లాపద్ద దోషాపర్ జమీనున్న కోటలోని యెల్లమ్మయున్నూ, కోటబయటి రేపల్లెవాడలోని మర్రిమాత నాగఝరి మల్లన్న మఠము' యాదవ పీఠముయొక్క అధికారమును పూర్వము ప్రభువులు అనగా ఖుతుబుషాహీలు దస్గర్ కిష్టయ్య పూర్వికులకు ఇచ్చినారు. కనుక మొత్తం రాష్ట్రములో జాతరులు, సంతలు మున్నగునవి జరిగినప్పుడు దస్గర్ కిష్టయ్యకు 12 గొల్లకులాల పైనను యాజమాన్యము కలదనియు, కిష్టయ్య పోయిన తావుందెల్లను సర్కారి అధికారులు అతనికి అతని హక్కులను వసూలు చేసుకొనుటలో సాయపడవలెను. పైగా గోమారం మర్లగూడెంలో 300 భోగాల మక్తాయున్నూ రామస్వామి గుట్టవద్ద 325 భోగాల భూమియున్నూ అతనిదే అయియున్నది."

పైనదేకాక వీరివద్ద మరియొక సనదు కలదు. అది కూడ 1071 హిజ్రీలో అబ్దుల్లా ఖుతుబ్‌షాచేత కొండయ్య పేర ఇయ్యబడినది. అందులోను కొండయ్య కిచ్చిన హక్కులు పాలింపబడునని వివరింపబడియున్నది.

ఇంకొక సనదు కూడ ఈ వంశము వారి వద్ద కలదు. అది ముఖ్తారుల్ ముల్కుసర్ సాలారుజంగు మొహరుతో 1273 హిజ్రీలో ఇయ్యబడినది. అందలి ముఖ్యవిశేషాలేమనగా సనదు కొండ బాలయ్యపేరట ఇయ్యబడినది (ఇతడు కొండయ్య వంశమువాడు) "పూర్వసుల్తానులనగా సుల్తాను అబ్దుల్లా ఖుతుబుషా యొక్కయు నిజామలీఖాన్ యొక్కయు సనదును బట్టియు రాజాచందూలాలు యొక్క ఫహిమాయిషను బట్టియు ఈ బాలయ్య కరేలీ, అయినూరు, మేలారం, అయ్యారం, మలీగావూ, ఖండబా మున్నగు స్థలాలలో జరుగు జాతరలలో ఏయే హక్కులు వీరిక్కి కలవో అవన్నియు అనుభవించుటకు అధికారము కలిగియున్నాడు.

దీనివలన తెలియునదేమనగా! అబ్దుల్లా ఖుతుబ్‌షా ఇచ్చిన సనదు నవాబు నిజామలీఖానున్నూ, చందులాల్ మంత్రియున్నూ, సర్ సాలార్‌జంగు మంత్రియున్నూ నమ్మినారు. సత్యమని నిర్ణయించినారు. తామున్నూ సనదుల నిచ్చినారు.

ఇతర సనదులలో కొన్ని గ్రామాల పేరులు కలవు. అందు గోమవరం అనునది మెదకు తాలూకాలో ఉన్నది. మర్లగడ్డ అనునది గోమవరంలోని పొలము

పేరు. రామస్వామి గట్టు అనునది గోమవరం వద్ద నుండు గట్టు. అచ్చట రామస్వామి దేవాలయం కలదు. కొమిరవెల్లి గ్రామము జనగామ తాలూకాలో ఉన్న, ఐనూరు, మేలారం, అయారం మాలెగాం వద్దనున్నవి.

## మరికొన్ని పదాలు :

కొండయ్య సనదులో 'తగరుజోగోడు' అను పదము కలదు. తగరుజోగువారు అనునదొక జాతి పేరు. డమరువంటి ఢక్కని వాయించు ఈ జాతి వారు బిచ్చమెత్తుదురు.

## కాట కోటయ్య :

12 గొల్ల, 2 కురువ మఠాలకు పెద్ద అయిన బలిజ కీ పేరు.

## మందుబోబ్బడు :

బిచ్చముతో బ్రతుకు ఒక జాతి. వీరు మంటి చేతను, పేడ చేతను, చేసిన 200 వరకు సంఖ్యగల బొమ్మలను ఒక పెద్ద పెట్టెలో పెట్టుకొని వత్తురు. వీరు గొల్లల వద్దనే వారి కులగోత్రాలు చెప్పుకొనుచు బిచ్చమెత్తుదురు.

సనదు ఇచ్చిన అబ్దుల్లా ఖుతుబుషా అబుల్ హసన్ తానీషా కన్న ముందువాడు. అతడు క్రీ. శ. 1626 నుండి 1672 వరకు గోలకొండ రాజ్యమును పాలించెను. ఈ కొండయ్య సనదు పుట్టిన కాలం 1071 హిజ్రీకి అనగా 289 ఏండ్ల క్రిందట, ఈ లెక్కచొప్పున ఈ సనదు క్రీ.శ. 1652 లో ఇయ్యబడినదని స్పష్టమగుచున్నది. అనగా అబ్దుల్లా రాజ్యకాలంలోనే ఇయ్యబడినది.

ఇవి యీ కొండయ్య సనదులోని విశేషాలు.

# పంచేశ్వరము

హైదరాబాదు రాష్ట్రములో చూడదగిన హిందూ క్షేత్రాలు చాలా కలవు. మత సాంప్రదాయిక దృష్టితో చూడదగిన వానిని గురించి యిప్పుడు వ్రాయుట లేదు. చారిత్రిక దృష్టితోను శిల్ప దృష్టితోను చూడదగినవాని ప్రశంసయే చేయు చున్నాను. అట్టివానిలో "పంచేశ్వరము" అను క్షేత్ర పంచకము చేరినది. దానిలో ఒక విశిష్టత కలదు. అది నిజాము బ్రిటిషు సంధి క్షేత్రమున్నూ అయి యున్నది. కృష్ణానది రెండు తీరాలలో ఆ క్షేత్రాలు వెలసియున్నవి. "గంగకిద్దరి మేలద్దరి కీడునుంగలదే" అన్నట్లుగా ఉన్నవి. కృష్ణ కిటు కొల్లాపురము సంస్థాన మున్నది. అటు దక్షిణమున కర్నూలు జిల్లాలో నందికొట్కూరు తాలుకాయున్నది. కొల్లాపుర సంస్థానమందలి కృష్ణా తీరములో పంచేశ్వరములోని మల్లేశ్వరము అను శైవ క్షేత్రమున్నది. సోమేశ్వరము నాగరుకర్నూలు తాలూకాలోని దైనను మల్లేశ్వరము ప్రక్కననే కలదు. ఆ రెంటికెదుటి దిక్కున చూపుమేరలోనే కృష్ణ కావలి యొడ్డున సిద్దేశ్వరము, సంగమేశ్వరము, కపిలేశ్వరము అను మరి మూడు శైవ క్షేత్రాలున్నవి. ఆ యైదింటిని పంచేశ్వరమందురు. అవి యుండు స్థాన మందు నది కిరు ప్రక్కలలో ఎత్తయిన గట్లు కలవు. కృష్ణను ఎండ కాలములో దాటుట కష్టము. వాన కాలములో దాటుట సుఖము. ఎందుకనగా ఎండ కాలములో తొడల లోతు నీళ్ళుండును. అడుగున జానెడు మూరెడు గుండ్లు నిండుగా పరిచి నట్లుగా నుండును. కాలు పెట్టగానే జారుట సంభవించును. ఒడుపు తప్పినచో ప్రవాహములో పడుదురు. ఈదుటకును వీలులేదు, కొన్ని గుండ్లు మోకాళ్ళతో డీకొనును. ఇట్టి గ్రహచారమునకు బద్ధులై అవతలి క్షేత్రాలను చూచి రావలసి యుండును. వానకాలములో నిండు ప్రవాహ ముండుటచే అరిగిలి లేక పుట్టి అను వానిపై సుఖముగా దాటవచ్చును. నదీ ప్రవాహ మహాధ్వానము, అయిదు క్షేత్రాలు, వాటి నాశ్రయించిన గ్రామాలు, దేవాలయ శిఖరాలు, చుట్టునుండు గట్లు, వాటిపైనుండు చెట్లు ఇవన్నియు ఒక చక్కని దృశ్యమును కలిగించి మరుపురాని స్మృతిగా మనస్సులో నిలిచిపోవును.

ఇదే స్థలమందే నిజాం ఇంగ్లీషు ప్రభుత్వాలు చేతులు కలిపి నడికట్టుగా ఆనకట్టవేసి కాలువలను తీయుటకై సంకల్పించినారు. పది పదిహేను ఏండ్లనాడే ప్లానులన్ని సిద్ధముచేసి యుంచినారు. యుద్ధానంతరము చేయుచున్న కార్యాలలో ఇచ్చటి ఆనకట్ట యొకటియై యున్నది. ఈ పంచేశ్వరములోని ఒక క్షేత్రమగు సోమేశ్వరమును సోమశిల అనియు అందురు. అచ్చట హైద్రాబాదు వారి సుంకము ఠాణా యొకటి కలదు. సోమశిల మల్లేశ్వరానికి ఒక మైలు దూరములో కలదు. మల్లేశ్వరము కొల్లాపురము వారిది. సోమేశ్వరము నాగర కర్నూలు తాలూకా లోనిది ఈ రెండును కొల్లాపురానికి 7 మైళ్ళ దూరములోను కొల్లాపుర సంస్థాన ములోని దగు పెంట్ల వెల్లికి 6 మైళ్ళ దూరములోను కలవు. బాటలు మాత్రము చాలా అధ్వాన్నముగా ఉన్నవి. ఆ ప్రాచీన క్షేత్రాలకు పెంట్లవెల్లి నుండి పోవు దారి నైనను బాగు చేయించుట సంస్థానం వారికి తప్పని ధర్మమని తలంతును.

ఇక క్షేత్ర విశేషాలను గూర్చి వ్రాయుదును. వనపర్తి రోడ్డు స్టేషనులో దిగవలెను. అక్కడినుండి కొల్లాపురం పోవు బస్సులో వెళ్ళి పెంట్లవెల్లి స్టేజిలో దిగవలెను. అక్కడ బాడుగ బండ్లు దొరుకును. అక్కడి నుండి 6 మైళ్ళ దూరాన నున్న మల్లేశ్వరములో ప్రధాన దేవాలయము యేటి గట్టుననే కలదు. దానిలో మూడు శాసనాలున్నవి. ఒక శాసనముపై త్రైర్థికులు చెట్నీ నూరు కొంటూ వచ్చినందున అది ముప్పాతిక అరిగిపోయినది. తక్కిన రెండున్నూ అరిగినవి. మట్టితో నిండినవి కానవచ్చు లిపి స్వరూపాన్ని బట్టి అవి చాళుక్యుల శాసనాలని స్పష్టమగును ఇంతవరకీ శాసనాల ప్రతులను తీసి ప్రకటించినట్లు కానరాలేదు. అతివృష్టి కాలములందు కృష్ణవేణమ్మకూడా ఈ దేవాలయావరణము లోనికి వచ్చి శివుని పలుకరించి పోవును. ఆమె ఆగమన ఫలితముగా దేవాలయము ఒక గజము లోతు వుండుటచే నిండినది. అందందు పగుళ్ళు మొదలై ఆలయ భాగాలు పడిపోవు చున్నవి. కొన్ని ఆవరణ విగ్రహాలు సుందరముగా నున్నవి. దేవాలయమునకు కొద్ది దూరమందే రెండు చిన్న గుళ్ళు మిట్టపై నున్నవి. అందొక దానిలో శేషశాయి కలదు. శివక్షేత్రములో వీరెట్లు ప్రవేశము కల్పించు కొని తిష్ఠ వేసిరనిన తర్వాతి వారెవ్వరో లింగ స్థానములో శ్రీ వారిని ప్రతిష్ఠించి నారనుట యొప్పును. విగ్రహము పెద్దది. చాలా సుందరమైనది. సన్నపని చూపరుల నాకర్షించును ఒకటి రెండు అంగాలను మెప్పులేని వారెవ్వరో చెక్కి

వేసినారు. ఈ దేవాలయమును సంస్థానమువారు కాపాడవలెను. శాసనాల ప్రతులను ఆర్షశాఖ వారు తీయించవలెను. త్రైర్థికులకు చెట్నీ రోళ్ళను సమకూర్చి శాసనాలను కాపాడవలెను. పూడికను కూడా తీయించవలెను.

మల్లేశ్వరము నుండి సోమేశ్వరము పోవలెను. బండినాట్లకున్నూ అంగ భంగాలకున్నూ భయపడకుంటే బండ్లలో పోవలెను. లేకున్న నడకయే రమ్యము. సోమేశ్వరములో ఏటిగట్టున 200 ఏండ్ల నాటి మసీదు కలదు. అందొక గోరీ కలదు దానిపై ఒక ఫార్సీ లిపి శాసన కలదు. పాముల పిల్లలవలె అక్షరాలను పెనవేసి వ్రాసినారు. వాటిని మల్లాలే చదువగలరు. ఏటి యొడ్డుననే ఊరున్నది. ఇండ్ల వెనుక భాగములో పెద్ద ప్రాచీన దేవాలయమున్నది. దానిలో నుగ్గు లెండించు కొందురు. ఈ కాలానికంత మాత్రమైనా ఉపయోగ పడుచున్నది. మరికొంత కాలానికట్లు పనికిరాదు. దేవాలయములో శిల్పాలేవియు లేవు. లోపలి కప్పులో దశావతారాల సుందర విగ్రహాలు చూడదగినవి. ఒకచోట ఒక స్తంభముపై శాసన భాగమున్నది. అది అచ్చటిది కాదు. శిథిల భాగానికి పోటీ పెట్టి ఒక శాసనాన్ని స్తంభముగా చేసి అచ్చట నిలిపినారు. అది కాకతీయుల నాటి శాసనమని జ్ఞాపకమున్నది.

ఏటిలోనికి దిగుచోట ఠాణా ముందరి మెట్టువద్ద కొన్ని దేవాలయ స్తంభాలు అందందు పూడగా మిగిలినవి కానవచ్చుచున్నవి. అందొక దానిపై నాగర లిపి శాసనమున్నది. ఆ స్థలములోని శాసనాలను కూడా ఎవ్వరునూ సేకరించి ప్రచురించలేదు. సోమేశ్వరమువద్ద ఎండకాలములో నదిని దాటవలెను. వానకాలములో మల్లీశ్వరమువద్ద దాటవలెను. నదినిదాటిన వెంటనే అచ్చటి గట్టుపై సిద్దేశ్వరము కలదు అచట ఒక ప్రాచీన దేవాలయ మున్నది. కాని అందేదియు చూడదగిన శిల్పము లేదు

సిద్దేశ్వరమునుండి రెండు మైళ్ళు నడచి వెళ్ళిన సంగమేశ్వరము వచ్చును. మధ్యన చిన్నగట్టు తగులును. అందొక గుహకలదు. ఇప్పుడు విశాలమగు రెండు గదులందు కానవచ్చును. లోపలి గదిలో చీకటితో నిండిన పెద్ద గుహాబిలము కలదు. అది యెంతో దూరము పరకున్నదని స్థానికులేమేమో చెప్పుదురు కొన్ని యేండ్ల కిందట ఒక సాధువు అచ్చట బహుకాలము నివసించెను. అతనికి భక్తులు

ప్రబలిరి. వారందరున్నూ సిద్దేశ్వరమునకును, సంగమేశ్వరమునకును మధ్య నుండే నదీ తీరమార్గము చాల ప్రమాదకరముగా నుండుటచే అచ్చట నొక గోడను కట్టించినారు.

సంగమేశ్వరము ఈ పంచేశ్వరములలో తలమానికము. అది సప్త నదీ సంగమము. తుంగభద్రము దాని పంచోపనదులున్నూ అలంపూరు వద్ద కృష్ణలో కలియును. అందుచే దానిని చిన్న సంగమందురు. ఆ పంచ నదీ ప్రవాహము కృష్ణలో కలియును. ఈ సంగమేశ్వరమువద్ద భవనాశి అను పెద్దవాగు (ఆ నది ఉపనదంతటిది కాకున్నను దానిని నది యందురు.) కృష్ణలో కలియును. ఇట్లు ఆ స్థానము సప్త నదీ సంగమ మగుటచేత దానిని పెద్ద సంగమని యందురు.

బ్రిటిషిలాకావారు ఆ దేవాలయము మంచి స్థితిలో నుంతురని తలచితినికాని దాని నేమాత్రమున్నూ విచారించక చాలా అన్యాయము చేసినందునను అచ్చటి శిల్పము ఉత్తమశ్రేణిలో చేరినదైనందున దానిని శైథిల్యమునుండి ఏమాత్రమున్నూ రక్షింపక పోయినందునను చాల విచారము కలిగినది. అచ్చట అయిదు శాసనాలు కలవు. ఒక శాసనమును దేవాలయపు బయటిభాగములో అరుగుపై కూర్చునుటకై అమర్చినారు. అది చాళుక్యుల కన్నడ శాసనము. ఇంచుమించు 900 ఏండ్లనాటిది. ఆ శాసనము కూడ సంపూర్ణముగా లేదు. కట్టడానికి వాడినందున కావలసినంత వరకుంచి మిగతా దానిని పగులగొట్టి పారవేసినట్లున్నది. దేవాలయ మందు ఒక చిన్న శాసనమున్నది. అదియు చాళుక్యులదే. దేవాలయము వెనుక దిక్కు ఒక యిసుక రాశిపై శాసనము కలదు. దానిపై సున్నము చుక్కలు నిండుగా గలవు. అవి కడిగినను పోవు. ఆ శాసనమును చదువుటకు వీలు లేదు. దేవాలయములో రెండు స్తంభాలపై రెండు శాసనాలు కలవు. అవి 1050 ప్రాంతము శాలివాహన శక కాలపు శాసనాలు. బ్రాహ్మణులకు భూదానాలు గ్రహణ కాలములో ధనికు లెవ్వరో చేసిన ముచ్చట అందు కలదు. అవి 400 ఏండ్ల నాటివి. దైవ భక్తులు దేవాలయము ముందు భాగాన్ని విస్తరించి కట్టించుచున్నారు. పాత కట్టడమునకు కొత్త కట్టడమునకు పోతరాజుకు, భోజరాజుకును ఉండు అంతరాయ మున్నది. నదీ తీరములోనున్న దేవాలయమునకు 200 గజాల దూరములో గ్రామమున్నది. గ్రామములో ఒక దేవాలయ మున్నది. దాని చుట్టును ఏమిన్నీ సందు లేకుండా గుడిసెలు, ఇండ్లు పెరిగి పోయినవి. ఆ దేవాలయ సౌందర్యమును చూచిన చూపు

తోనే, ఆ యిండ్లను చూచిన 'స్వర్గ నరకా' లెట్టివో యూహించు కొనవచ్చును. ఆ దేవాలయాన్ని 'రథము' యని అందురు. దేవతలు రథాల్ని నిర్మించి అందే వదలి పోయిరని స్థానిక జ్ఞాను లందురు. అది దివ్యశిల్పమనియైనా వారు గ్రహించినారు కదా ! అది శివాలయము తప్ప మరేదియు కాదు. దేవాలయము గోడల చుట్టును అడుగడుగునకు శిల్పములే. ఆ శిల్పాలను గ్రామము వారు మెచ్చుకొనునట్లులేదు. చేపల బుట్టలు, వలలు, జల్లలు, గంపలు తుదకు కట్టెల మోపులు సుందర విగ్రహాములుండు గోడలోని పెద్ద గూళ్ళలో నింపినారు. దేవాలయానికి చక్కని ఆకర్షణీయమగు శిలా గోపురము కలదు. ఆ గోపురము నిండుగా విగ్రహాలను చెక్కినారు. అవన్నియు అతి రమణీయములు. దేవాలయ ప్రధాన ద్వారమందు కొన్ని విగ్రహాలు విరుగ గొట్టబడినవి. సంగమేశ్వరములోని "రథము"ను చూచి ఆనందించవలెను. దాని సౌందర్యాన్ని యెట్లు వర్ణించవలెనో తెలియదు. మద్రాసు ప్రభుత్వము వారీ దేవాలయమునకు ఆవరణము కల్పించి చుట్టు నుండు యిండ్లను, వాములను, పశువుల కొట్టాలను తీసివేయించి రథాన్ని మంచి స్థితిలో నుంచవలసిన బాధ్యత తమపై కలదని యెరుగవలెను.

సంగమేశ్వరము నుండి అరకోసు దూరములో కపిలేశ్వరము నదీ తీరమున కలదు. అందుకూడ ప్రాచీన దేవాలయాలు కలవు. కాని ప్రశంసింప దగిన శిల్పాలందు కానరావు ప్రకృతి రామణీయమునకు సుందర శిల్పముల జోడించి ఆ రెంటిలో మతాన్ని ముడిపెట్టి జనుల విశ్వాసాలను బంధించివేసిన వీర శైవులు గట్టి దిట్టలని ఈ పంచేశ్వరము చాటుచున్నది. ఇప్పుడు శివరాత్రి కాలమందు శైవ భక్తులు కైలాస తృష్ణచే ఈ పంచేశ్వరమును సేవించుచున్నారే కాని ప్రాచీనుల కళా సృష్టిని వారు గమనించిన వారు కారు- గమనించినచో వారు శాసనాలపై చెక్కిన నూరి కళాస్వాదము చేసియుండరు. పైగా శివరాత్రి కాలములో ప్రాకార విగ్రహాలపై సున్నము ఎర్రమన్ను కొట్టి తమ శివోపాసనను వ్యక్తపరచుచున్నారు. పంచేశ్వరముల ప్రాచీనమది. చక్కటి దృశ్యము మరుపురానట్టిది. ఇప్పుడు శోచనీయ స్థితిలో నున్నట్టిది.

# పానగల్లు కోట

నాగరకర్నూలు తాలూకాలో పానుగల్లు కోట కలదు. అది చాలా ప్రాచీనమై అనేక విధాలా ప్రాముఖ్యమును వహించినట్టిది. ఆ కోటలో సంస్కృతాంధ్ర పార్సీ శాసనాలున్నవి. అది ఇంచుమించు 4 సామ్రాజ్యాల వశమగుతూ వచ్చినట్టిది.

దానిలోని శాసనములను ఇంతవర కెవ్వరును ప్రకటించలేదు. లక్ష్మణరాయ పరిశోధక మండలివారు తెలంగాణా శాసనాలలో ముద్రించలేదు. వారు ముద్రించక యుంచిన వాటిలో అవేమైనా సేకరింపబడినవో లేదో తెలియదు.

హైద్రాబాదు రాష్ట్రములో పానుగల్లు పేరు కలవి రెండున్నవి. ఒకటి యీ నాగరు కర్నూలు తాలూకాలోనిది. రెండవది నల్లగొండ పట్టణానికి 3 మైళ్ళ దూరములో నుండు నట్టిది. పాఠకు లీ రెంటిని వేరుగా గ్రహించి యుండవలెను. రెండును ప్రసిద్ధ స్థలాలు. నాగర కర్నూలు పానుగల్లు కోటలకు ప్రసిద్ధి. నల్లగొండ పానగల్లు ప్రాచీన చాళుక్య దేవాలయాలకు ప్రసిద్ధి. బాలనాగమ్మ కథ జరిగిన నల్లగొండ పానుగంటిలో మాయల ఫక్కీరు గోరీ కలదు. నాగర కర్నూలు పానగల్లు వారును మాయల ఫక్కీరు అక్కడివాడే అని వాదింతురు. కాని విశ్వాసార్హము కాదు నాగర కర్నూలు సానగల్లును గూర్చి యింతవర కెవ్వరున్నూ వ్రాయనందునను వ్రాసినట్లు కానరానందునను యిందు కొంత వివరణ చేయుచున్నాను.

ఈ కోట చిన్న చిన్న గట్ల మీద కలదు. రెండు గట్లను కలిపి పూర్వ మందు కోట గట్టినారు. గట్లపై శిఖరము లందిప్పటికిని కొన్ని బురుజులును గోడ లును సుదూరము కానవచ్చు చున్నవి. శ్రీరంగాపురమునకును; వనపర్తికిని; ఈ పానగల్లు 8 మైళ్ళ దూరములో నున్నది. పూర్వము అనగా ఏడెనిమిది నూర్ల ఏండ్లకు పూర్వము కోట లోపలనే గ్రామము యుండిన జాడలున్నవి. ఇప్పుడు కోటలలో ఒక యిల్లు కూడా లేదు. కోటక్రింద యూరు వృద్ధియై ఇంచు

మించు అయిదారు నూర్ల యిండ్లున్నవి. ఇప్పుడు కోటలో కొన్ని యెకరాల భూమి సేద్యమగుచున్నది ఈ గట్టు నాశ్రయించి యే గ్రామము కలదు. కోటకు ముందు భాగము చాలా యెత్తు కలదు. కాని దాని వెనుక భాగములో కోట మీదికి బండ్లు బాగా పోవు దారి కలదు. వ్యవసాయ దారులు కూడా దారినే యుపయోగించుదురు.

కోటకు మొత్తము 52 బురుజులుండె నందురు. మూడు అంతర్దుర్గాలు నిర్మించి వాటి చుట్టును కందకములు త్రవ్వి నీరు నించి యుండినట్లు కానవచ్చు చున్నది. ఇప్పుడు పానగల్లు గ్రామములో ఒక నాకా యున్నది. అక్కడ ఒక పోలీసు అమీనున్నాడు. కోట కావలికి ఇద్దరు ముగ్గురు కావలి వారు నియమితులైనారు వారు విశేషముగా రాత్రులందు కోటలో పండుకొందురని యందురు. ఇక కోట నెవరు నిర్మించిరి? దాని చరిత్ర యేమి? అను విషయము విచారణీయమగును. దానివి సరిగా తెలుపుటకు వీలులేకున్నది. వీలైనంత వరకు ఊహించి తెలుపవచ్చును.

ఈ కోట చరిత్ర కాధారములు దానిలో నుండు శాసనములే. కోటకు పై భాగములో ఒక శాసనము బయటి గుండుపై నున్నది. అది సరిగా చదువుటకు వీలు లేదు. అక్షరాలు మాసిపోయినవి. దాని ప్రక్కననే ప్రవేశద్వారము (గవిని వాకిలి) కలదు. ఆ ద్వారములో కుడి ప్రక్కన అరుగులో నుండు పెద్ద ఇసుక రాతిపై నొక శాసనమున్నది. బయటి శాసనానికిని దీనికిని భేదము కానరాదు రెండును సంస్కృత శాసనాలు. ఈ శాసనమును చదువ వచ్చును. కాని దాని వద్దనే కావలి కాయువారు నిరంతరము సెగడును (నిప్పు కొరవి) మండించుచుండుటచే శాసనము పొగమారి నిలువున సగము పగిలినది అచ్చట మంట చేయుకుండుటకై అధికారులు వెంటనే ఆజ్ఞ యిచ్చి శాసనమును కడిగించి శుభ్రముగా నుంచునట్లు చేయవలెను. అ శాసనములో తుది భాగమందు ఇమ్మడి బుక్కరాయలు అను అక్షరాలు కనిపించుచున్నవి అందుచేత అది విజయ నగర రాజుల కాలము నాటిదని ఊహింప వీలగుచున్నది. కోట లోపల పెద్ద బయ లున్నది. అందొక చోట ఆరు స్తంభాలు వాటిపై అడ్డ దూలాలు నిలచినవి వాటి ముందు కొంత దూరములో రెండు స్తంభాలు కలవు. వాటిపై బుద్ధుని విగ్రహము రెండు ప్రక్కల కడపరాయి కలదు. ఆ స్తంభాలను లంజ

ఉయ్యాల అని యందురు. కారణమేమనగా పూర్వమొక రాజు యొక్క లంజ ఆ స్తంభాలను ఉయ్యాలకై నిర్మింపజేసి యుండెనని జనులందురు. అది అబద్ధము. అది దేవాలయ శిథిల శకలము. అది బౌద్ధ దేవాలమై యుండును. లేదా జైన దేవాలమై యుండును; అనగా అది కాకతీయుల ఆది కాలములో ఇంచుమించు క్రీ.శ. 1200 ప్రాంతమున కట్టబడినదై యుండును. ఆ కోటలో దేవాలయ శిథిలముపై నుండు ఆ విగ్రహమొక్కటే అన్నిటికన్న ప్రాచీనమైనదిగా కనబడు చున్నది. కోటలో మరొక భాగమందు ఒక మసీదు కలదు దాని వీపుననే కొన్ని దేవాలయ స్తంబాలు తమ పూర్వ కథను అవ్యక్తముగా చెప్పుటకై అట్లే నిలిచినవి. ఒక స్తంభముపై శాసనమున్నది. రామేశ్వర స్వామి దేవాలయము పేరు అందు కనబడుచున్నది. కాలమును తెలుపు భాగము చెడిపోయినది. మసీదు. లోనికి పోయిన అందు కూడా దేవాలయ చిహ్నములు కానవచ్చును అందు స్తంభాలపై గచ్చు వేసినారు. ఒక స్తంభము గచ్చు కొంత రాలిపోయినది. పోయిన తావున నాగర లిపిలో ఒక శాసన పంక్తి కనిపించుచున్నది. అందొక్కటే. చాలును. రాశ్వమేరాలయమును మసీదుగా మార్చినట్లు నిరూపించుటకు.

రెండు కుతుబ్షాహీ కాలపు శాసనాలున్నవి. కొత్తబావి అను పూడినబావి వద్ద ఒక ఫార్సీశాసనము అబ్దుల్లా ఖుతుబుషాహీది కలదు. (అతడు 1626 నుండి క్రీ శ. 1632 వరకు రాజ్యము చేసెను.) దాని యెదుటనే తెనుగులో అబ్దుల్లా ఖుతుబుషా శాసనమే కలదు. కోట యొక్క ఉన్నతోన్నత శిఖరమందు ఒక శాసనము సగము ఫార్సీ సగము తెనుగులో కలదు. అది మహమ్మద్ ఖులీ ఖుతుబుషా కాలములో (1550, 1590) ఖిరాత్ ఖాను అనువాడు "బాలా హిసారు"ను కట్టించినట్లు దానిలో వ్రాసినారు కాలము శాలివాహన శకము 1476 అని యుండినట్లు నాకు జ్ఞాపకము. ఈ రెండు శాసనాలను బట్టి ఈ కోట విజయనగరము వారినుండి వారి పతనానంతరము గోలకొండ ఖుతుబు షాహీలు వశపరచుకొని దానినొక ముఖ్య దుర్గముగా కాపాడినట్లు విశదమగును.

ఈ పానుగల్లు కోటపై రెండు బావు లున్నవి. ఒక దానిని రామగుండ మందురు. అది చాలా పెద్దది అందు తియ్యని నీరు కలదు. నీటిలోతు 150 అడుగులకు పైగా కలదనియు ఎవ్వడో ఒక తాలూక్దారు లోతును పరీక్షింప జేసి యుండెననియు స్థానికులందురు. ఆ బావి గట్టుపై ఒక రాతిపై రాముని పాదాలు

చెక్కినారు. అది యిటీవల వారి పని తనమనుట స్పష్టము. రెండవ బావిని సీత గుండ మందురు. అది రామగుండము కన్న పై భాగములో కలదు. మూడు గుండ్ల సందున గజము లోతు మూడుగజాలు పొడవు కలిగిన గుంతలో తియ్యని నీరుకలదు ఈ రెండు గుండాలను గూర్చి కొన్ని చిత్రములు చెప్పుదురు. రోగులైనవారు కొన్ని దినాలు ఆ నీటిని త్రాగితే బాగు పడుదురట, వరిచేలకు రోగము తగిలితే ఈ రెండు గుండాల నీటిని చెంబెడో కడవెడో మడితో తీసుకొని పోయి మోటనీరు లేక చెరువునీరు పొలములపై పారుచోట గ్రుమ్మరించి, పొలానికి నీరు కట్టితే ఆ పూటనే రోగము కుదిరి పోవునని జనులు నమ్ముచున్నారు ఆ ప్రకారము చేసి లాభము పొందినామని అంటున్నారు. అది నిజమైతే సైన్సు వేత్తలచే ఆ నీటిలోని రసాయన పదార్థాలను ప్రభుత్వము వారు పరీక్షింపజేసి ప్రజలకు యథార్థమును తెలియ జేయుదురు గాక !

ఈ పానుగల్లు కోటలో హైద్రాబాదు కోటలో ప్రాచీనమైన కోటగా కనబడు చున్నది. అసఫజాహి ప్రభువులలో రెండవ వారగు నిజామలీఖాన్ ఈ కోటలో కొన్ని యేండ్లుండెనని దబ్దబెనిజాం అను గ్రంథములో వ్రాసినారు. మహారాష్ట్రుల యొత్తిడినుండి వనపర్తి, గద్వాల, ఆత్మకూరు సంస్థానాల రెడ్డి ప్రభువులు వారిని రక్షించినట్లు జన ప్రవాదము బలీయముగా నున్నది. ఈ కోటపై నుండి చుట్టు మూడామడవరకు కనబడుచుండును. చక్కని దృశ్యములు దాని నుండి కానవచ్చును. మన పురాతత్త్వ శాఖవారు ఈ కోటలోని శాసనాలను ఒక ప్రత్యేక సంపుటముగా ప్రకటించవలెను. స్థల చరిత్రను కూడా వ్రాయించవలెను.

# మా వూరు

కృష్ణా పత్రికలో "మా వూరు" అని కొందరు తమ తమ గ్రామాల ఘనతను గురించి వ్రాస్తూ ఉండినది చదివినప్పుడంతా మా వూరును గురించి కూడా ఎందుకు వ్రాయ గూడదు అని పలుమారు అనుకొని తుదకీనాడు కృత నిశ్చయు డనై తదేక దీక్షతో వ్రాయనే వ్రాసినాను. ఇందలి విషయాలను అపహాస్యానికై వ్రాసినానని కాని అబద్ధాలతో నింపినానని కాని ఎవ్వరున్నూ భావింపరాదు. పదారణాలూ, 12 మాసాలు సత్యమని నమ్మండి. ఇక మా వూరు చరిత్ర వినండి.

మా వూరు పేరు ఇటిక్యాలపాడు. ఇది రాయచూరు జిల్లాలో అలంపూరు తాలుకాలో ఉన్నది. బ్రిటిషు సరిహద్దగు కర్నూలు పట్టణానికి 10 మైళ్ళ దూరములో ఉన్నది. పూర్వము అలంపూరు దేవాలయమునకు కావలసిన ఇటుక మా గ్రామము పొలాంలోనే సిద్ధము చేసి తీసుకొనిపోయి యుండిరట. అందుచేత 250 ఏండ్ల క్రిందట ఈ గ్రామాన్ని నిర్మించుకొన్న పిచ్చి పుల్లయ్యలు వెర్రివెంగళప్పలు దీనికి ఇటికెలపాడు అని పేరు పెట్టిరట. సుమతి శతకములో ఒక పద్యమిట్లున్నది.

క॥ అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడ తెగక పారు నేరును ద్విజుడున్
జొప్పడిన నూర నుండుము
చొప్పడకున్నట్టి యూరు జొరకుర సుమతీ॥

మా వూరును మొదట కట్టిన బేఖూబ్ మదర్సాబులు పై సుమతి పద్యాన్ని అయినా చదువుకొన్నవారు కారు. నేటికిని మా వూరులో అప్పిచ్చేవారు అరుదు. వైద్యుడు పోయిన నెలవరకు లేకుండెను. కాని యిప్పుడు తెలుగు చిన్నయ్య రోగాలను మంత్రించి జలగం రమణయ్య మందిచ్చి బాగైనవని పిస్తున్నారు. రమణయ్య చేతి వైద్యము సకలార్తి నివారక మగుటచేత అతని పేరులోని మొదటి రెండక్షరాలను తారుమారుచేసి అంటూ ఉంటూరు. మా యూరులో పారే

నీరు లేదు కాని మూడుమైళ్ళ దూరాన ఆ నీరు దొరుకును. మాకు 10 మైళ్ళ దూరములో ఇటికెల అనే గ్రామమున్నది. పొరపాటు పడకుండుటకై యా గ్రామాన్ని అకుచోటి ఇటికెల అంటారు. మా గ్రామాన్ని నీళ్ళులేని యిటికెల పాడు అంటారు. కారణమేమనగా మా గ్రామములో ఎంత ప్రయత్నము చేసినా ఊట బావి పడనేలేదు. తుదకు 150 ఏండ్ల క్రిందట గ్రామానికి రెండు ఫర్లాంగుల దూరములో ప్రక్క గ్రామ మగు జల్లాపురంలోని ఇట్టేలవారు అనే కోమట్లు తదేక దీక్షతో పాతాళం చూచేవరకు వదలకుండా త్రవ్వించగా అచ్చటివారికి పాతాళగంగాదేవి ఉగ్రరూపముతో విసుగుతో ప్రత్యక్షమయ్యెను. అట్టి బావికి లెక్కపెట్టగా 120 మెట్లు కలవు. నీరు చాలా ఉప్పుగా నుండును. నీటిని బాగా కాచి ఆవిరిగా ఎగిరిపోవునటుల జేస్తే చక్కని తెల్లని ఉప్పు దొరకును. ఉప్పు సత్యాగ్రహం చేసేవారు మా బావి నీటిని కాస్తే శిక్షించేవారు లేరు. మా సర్కారు వారితో 40 ఏండ్ల నుండి లబ లబ మొత్తుకొనగా రెండేండ్ల క్రిందట కాస్త వినిపించుకొని ఒక బోరింగు మిషను తెచ్చి 80 అడుగుల లోతు కొట్టితే అచ్చట అర్ధ గజం లోతుగల ఉప్పునీరు దొరికెను. ఇంకా లోతుగా కొట్టవలెనయ్యా అంటే వచ్చినవారు మాకు ఎక్కువ లోతు కొట్టే హుకుం లేదు అని 4 నెలలవరకు తమకు వెళ్ళి రమ్మను హుకుం వచ్చేవరకు ఈగల జనాభాను వ్రాసుకొని వెళ్ళిపోయిరి. వారు వెళ్ళిన వారం దినాలలో ఊరి పిల్లలు రాళ్ళువేసి ఆ కాస్త బోరింగును మూసి వేసిరి. మా గ్రామములో 400 హరిజనులు కలరు. వారికి బావిలేదు. పై జాతులవారిని బావివద్ద ఎంతో ప్రాధేయపడగా హరిజనులకు లిరిపెముగా కాస్త నీరు పోస్తున్నారు.

మా యూరిలో ఎవరి పప్పు కూడా ఉడకదు. అందుచేత ఊరి బయట ఒక పెద్ద గుంతను గ్రామస్థులే చందాలు వేసుకొని సగటున ఏటేటా 500 రూ॥ వరకు వ్యయంచేసి అందు వాననీరాపుకొందురు. ఆ మురికి నీరే పప్పునకు, త్రాగుటకు, బట్టలుతుకుటకును, స్నానాదులకు. అంట్లు కడుగుటకు వాడుకొందురు మా ఉప్పు నీటిని త్రాగినవారికి ఒక్కసారికానేకాదు రెంటి నుండి పది వరకు ప్రతివానికి నారి పుండ్లు ఏటేటా అవుతూవుండును. ఎవరో కొందరు మాత్రమే ఆగస్త్యులవలె నారి పుండ్లను బయటికి రానీయకుండా లోననే జీర్ణోభవ అని మంత్రించు కొనేవారు.

మా యూరిలోనికి యెంతటి మహామహులైనా సరే, ఎంతటి అసూర్యం పశ్యలైన, అంతఃపుర కాంతామణులైనాసరే ఊరివాకిలి వద్ద బండిదిగి ఊరులోనికి పోవలసినదే. కారణమేమన మా గ్రామ మంతా బంకరేగడి భూమిలో కలదు. వీథులలో చేలల్లో వానవస్తేమోకాటివరకు దిగబడును. అందుచేత ఊరి వీథులను నాలుగు అడుగుల వెడల్పుతో కట్టి బండలను పరిచినారు. అట్టి యిరుకు వీథులలో బండ్లు పోజాలవు వానవస్తే బండల మధ్యన గుంతలలో మురికినీరు కొన్ని దినాల వరకు ఆగియుండును. అందు దోమలు గ్రుడ్లుపెట్టి పిల్లలను లేపును. ఇండ్లకు వెనుక భాగాలు లేవు కాని యండ్లముందే యింటి వారి పిల్లలంతా మల మూత్ర విసర్జనచేస్తూ ఉందురు. ప్రతి వీథిలో కొన్ని పెంటలుండును. ఊరు చుట్టూ కల్లాలుండుటచేత తూర్పుపట్టితే నుసి ఊరంతా నిండుకొని యుండును.

మా ఊరిని పిండారీల కాలములో కట్టినారు. అందుచేత ఊరికి నాలుగు బురుజులు నాలుగు ప్రాకారాలు కలవు. మాదిగవాడవారు ఆ దిక్కున నున్న బాట లోనే స్త్రీ శిశు పురుషులంతా రాత్రి అనక పగలనక లఘు గురు శంకలను తీర్చు కొనుచుండుటచే ఊరివారా దిక్కు నడుచుట అరుదు. కాని సర్కారీ అధికారులు వేరే గ్రామాలకు పోవువారు ముచుంవలె ముక్కుపట్టుకొనియైన ఆమాంతంగా గ్రామాన్ని దాటవలసి వస్తున్నది.

ఇన్ని కారణాలచేత మా వూరిలో 365 దినాలు కూడా ఏకధాటిగా ఈగలు ఒక్కొక్క యింటిలో లక్షల కొలదిగా ఉండును. గట్టిగా విసరినా పోవు. అన్నములోపడి చచ్చును. నీటి స్థాలీలలోపడి చచ్చును. తేనీరు నోటివరకు పొయ్యే లోపలనే రెండైనా అందుపడును. అనగా 'ప్రథమకబళే మక్షికాపాతః' అన్న గీర్వాణ భాణకము మా ఊరిలోనే ప్రారంభమైనదన్నమాట. మా వూరికి పెద్ద మనుషులు కూడా వస్తారు. మా వూరిలో పెద్ద మనుషులు కూడా పుట్టినారు కాబట్టి గత సంవత్సరము శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు దయచేసి ఒక దినముండి "ఈ ఊరిలో ఈగలు కూడా మంటలెత్తేటట్లు కరుస్తవే". అని అంతటి గొప్పవారు కూడా జడిసి పోయిరి.

మా యూరి ఇండ్లన్నీ పలకరాతి కట్టడములే. గోడలకు గచ్చు కాని, మన్ను కాని మెత్తరు. అందుచేత చలికాలములో నీలగిరిలో ఉన్నట్లు ఎండ

కాలములో సహారా ఎడారిలో ఉన్నట్లు ఉండును. ఉప్పునీటి చోట నేలలో చెట్లు కూడా వృద్ధికావు కాని అందందు తుమ్మచెట్లు మాత్రం పాంథులకు ఆశ్రయమిచ్చి పుణ్యము కట్టుకొని తమ లోక కంటకత్వ నిందను బాపుకొనును. ఎండకాలము రాత్రులందు రాళ్ళ గోడలలోని తాపమునకు తట్టుకొనలేక వీథులలో తేళ్ళు బ్లాకు మార్కెటులోని బేరగాండ్లవలె వాహ్యాళి చేయును. లంచాలు తినే అధికారులవలె ఊరకుండె వారిని తమ జోలికి రానివారిని ఆ తేళ్ళు బాధించవు. కాని తమను త్రొక్కి అపచారము చేసిన వారిపై కొండెమీటి దెబ్బకొట్టి తీరును. ప్రతి యింటిముందు దినం పది తేళ్ళయినా ఊరక పారజూస్తే లభించును. వాటి అవసరముండే వారు మా గ్రామం దయచేసిన బాగా సహాయం చేస్తాము.

ఏమైనా కాస్త విశాల స్థలం కలదంటే అది ఊరిముందు కలదు. అచ్చట 600 చ.గజాల స్థలం కలదు. ఊరివారి యిండ్ల మరమ్మతు రాళ్ళ కుప్పలు సేద్యం పనిముట్లు వాడుకొనని బండ్లు రెండు కొత్తగా ఏర్పాటిన పెంటలు వడ్ల వాని చెట్టుకింది కార్ఖానా కూలికి వచ్చిన పర గ్రామాలవారి వంట పొయ్యి వరుసలు, బిచ్చగాండ్ర విడిది ఇవన్నీ అందే గారడీ బుట్టవలె యిమిడి యుండును.

గ్రామం పుట్టిననాడు 200 మంది యుండిరేమో యిప్పుడు 1100 మంది కలరు. కాని పది మాదిగవారి కొత్తయిండ్లు తప్ప గ్రామమంతా మొదటి చెక్బందీ లోనే ఇరికి యున్నది. గ్రామస్థులు ఆ జ్ఞాన సంపన్నులును అభిమాన ధనులును అగుటచే స్థలానికై అధికారుల నడుగరు. అధికారులు లేపీలో మునిగిన వారగుటచేత ఈ అల్పపు ముచ్చట్లను వినిపించుకొనరు. మా గ్రామములో కల్లు సారా త్రాగని యిండ్లు అయిదే అయిదు. మా గ్రామంలో బ్రాహ్మణులు, బాతులు, నీరుకొళ్ళు కొంగలు ఆదినుండి నేటివరకు లేవు. ఘోటక బ్రహ్మచారియగు కోమటి యొక డుండెను. మొన్ననే కొంత అప్పును ఒక పాత బసివిని వదలి చచ్చిపోయెను. ఒకే ఒక తురక కుటుంబమున్నందున పీర్లపండుగను హిందువులే చేస్తున్నారు. గంటసేపు వర్షము గట్టిగా కురిస్తే రెండు దినాలవరకు బండ్లు కదలవు. మొన్న మొన్ననే సర్కారీ పంతులిద్దరు మా గ్రామానికి వచ్చినారు. కాని వారికి ఉప్పునీరు సరిపడక నెలలో 20 దినాలు ఊరిలో ఉండరు ఉండిన పది దినాలు ఎవ్వరికీ కనబడరు. మా హొలానపండే గోధుమలకు కర్నూలులో ఎక్కువధర యిచ్చి

కొంటారు. మొత్తం హిందుస్థానంలో ఇంతమంచి గోధుమలు దొరకవన్న మాట. మా గ్రామంలో ఒక వరిగింజ పండకున్నా ఊరంతా వరియన్నమే తింటుంది.

అధికారులు బియ్యం సప్లయికి సెలవియ్యకున్నా మా గ్రామానికి బియ్య మెట్లు వచ్చెనో తెలియదు కానీ, మా యూరి నీటిలో తెల్లబట్టలు వేస్తే మైలపడును. అందుచేత అధికారులు దొరాకురారు. విధిలేక వస్తే అప్పుడే మరోక గ్రామానికి వెళ్ళుతారు. ఇదొక్కటే ప్రశంసనీయమగు మా గ్రామ సులక్షణము.

మా గ్రామానికింతలో సర్ మీర్జా ఇస్మాయిల్ గారి నాహ్వానించి వారికి మా ఉప్పునీటి తీర్థమిచ్చి మా కప్పులేని చావడీలో ఐస యేర్పాటుచేసి మా ఊరి ముందటి ఫతేమైదానులో వారి వాహ్యాళికేర్పాటు చేసి మా స్థితి గతులను తెలుపుకో వలెనని మా గ్రామ యువకులు ఇస్పేట్ ఆటఆడని కాలములో అనుకొంటూ ఉంటారు.

# హజరత్ ఉమర్

ఉమర్ భగవత్పాదుడు పైగంబర్ మహమ్మద్ ప్రవక్తగారి తర్వాత ఇస్లాం లోకములో అగ్రగణ్యుడు. ఇస్లాం మతములో అంతటివాడు పుట్టలేదు. పుట్టబోడు. (న భూతో న భవిష్యతి) అనవచ్చును. ఇస్లాం మత వ్యాప్తికి అతడే కారకుడు. అతడు ముసల్మానులకు ఆదర్శ ప్రాయుడు. అంతేకాదు అతని జీవిత విశిష్టతను, అతని న్యాయపద్ధతులను, అతని మత వ్యాప్తి రహస్యమును కనుగొన వలెనంటే ఇతర మతస్థులు కూడా అతని గురించి తెలుసుకొనవలెను. అతని జీవిత చరిత్రలు కొన్ని ఉర్దూలోను, ఇంగ్లీషులోను రచింపబడినవి. ప్రపంచ మహా పురుషులలో అతడు గణనీయుడు. కాని మన హైదరాబాదు సారస్వత పరిషత్తు వారీ కార్యమును చేయుట సమంజసము.

హజరత్ ఉమర్, పైగంబర్ హజరత్ మహమ్మదు గారి సమకాలికుడు. అతడు మొదట ఇస్లాం మతమును ప్రతిఘటించిన వాడు. విగ్రహారాధనతో కూడిన తన పాత మతమునే ప్రేమించినవాడు. కొత్త మతమును తెచ్చినందుకు కంటగించు కొని ఒకనాడు కత్తిదూసి మహమ్మదుగారినే చంపుటకై ఆవేశపూరితుడై బయలు దేరెను. దారిలో ఒక పెద్దమనిషి యెదురై ''నీ యింటిలో నీ సోదరిని ఆమె భర్తను ఇస్లాం నుండి తప్పించలేవు కాని ప్రవక్తపై దాడిచేయబూనితి వెందుకయ్యా'' అని మందలించగా ఆగ్రహోదగ్రుడై అదే కత్తిని ఆమె పై వినియోగించుటకు మరలి పోయెను. తన సోదరి నెత్తురు చూచువరకు కసిదీర్చు కొనదలిచెను. నీవు నన్ను చంపినను నా కొత్త మతమును వదలుకొనను, అని ఆమె పలుకగా చకితుడై నీవు మెచ్చిన ఖురానును చదువు విందునుగాని అని ఆమెచే చదివించి విని దాని భాషకు దానిలోని భావాలకు ముగ్ధుడై దీర్ఘాలోచనా నిమగ్నుడై మూకీ భావముతో నిలువెడల పైగంబరుగారి వద్దకు వెళ్ళి తమదీక్ష నిచ్చుటకై ప్రార్థించెను. ఉమర్ ఇస్లాం పుచ్చుకొన్న సమయము ఆ మత విజృంభణకు నాందీభూతమగు విజయ ఘటిక. అతనికి అతనికి అల్ ఫారుఖ్ అను బిరుదు వచ్చెను. సత్యాసత్య విచక్షణ నెరిగిన వాడని దాని అర్థము.

అరబి స్థానములో చాలా గోత్రముల వారుండిరి. హిందువులలో ఋషి గోత్రాల వారెటుల నేటికిని యున్నారో అటులే అరబులో పూర్వము ప్రతివంశము వారును తమ మూలపురుషుల (గోత్రవతుల) పేరుతో వర్గాలుగా ఏర్పడి యుండిరి. అట్టి వర్గమును ఖబీలా యనిరి. ఉమర్ ఖురేషీ అను ప్రసిద్ధ గోత్రము వాడు. మన దేశములో నవ ముస్లిములు కూడా ఖురేషీ అను అర్థము లేని పేర్లను పెట్టుకొందురు. అట్టి వారందరును ఈ ప్రసిద్ధ ఉమర్ వంశమువా రనిన హాస్యాస్పదము. ఖురేషీ గోత్రము వారు అరబులోని ఖబీలాలలో ముఖ్యమైన వారు.

ఉమర్ పైగంబరు గారి కన్న 17 ఏండ్లు చిన్నవాడు. చిన్న తనములో ఇతడు ఒంటెల కాపరిగా ఉండెను. ఇతని తండ్రి యీ పశుల కాపరితో పగలంతా మసలనీయక కఠినంగా పని తీసుకొనుచుండెను. ఇతని కొక ముతక బట్టను కట్టు కొనుట కిచ్చు చుండెను. ఈ కారణములచేత తర్వాత కాలములో హ॥ ఉమర్ తన విధులను నెరవేర్చుట లోను, ఇతరులతో పని తీసికొనుటలోను కఠినాతి కఠినడై యుండెను. తాను సకల ఇస్లాం రాజ్యమునకు సర్వతంత్ర స్వతంత్రుడగు ఖలీఫా యయినను మోటు వస్త్రములనే కట్టుచుండెను. సొంతముగా కష్టించి, సంపాదించి జీవించుచుండెనేకాని మతపీఠకోశమునుండి ఏమియు తీసికొనకుండెను. చిన్నప్పుడు పొలాలలో తిరిగి పసుల మేపి, కర్కశ కాయుడైనందున అతి బలాఢ్యుడని పేరొందెను. అరబ్బు దేశము గుర్రాలకు ప్రసిద్ధి. ఇతడు గుర్రపు సవారీలో మహా నిపుణుడు. ఆ కాలములో అరబ్బీ చదివిన కొలది మందిలో ఉమర్ ఒకడు. అతడు మంచి ఉపన్యాసకుడు. బాగా వ్రాయగలడు. ఇంతో అంతో కవితకూడా అల్లినవాడు. వ్యాపారములో దక్షుడు.

పైగంబర్ గారు ఈ లోకమును వదిలిరి. ఆ దుర్వార్తను విన్నవారందరును హాహాకారములతో రోదనము చేసిరి. "పైగంబర్ గారు గతించినారు అని అన్నవారి తల లెగరింతును." అని ఉమర్ అనెను. పైగంబర్ గారిపై అతని భక్తి యెంత గాఢమైనది.

పైగంబర్ గారు ఇస్లాం వ్యాప్తికై ఈరాక్, మెసోపటేమియా దేశాలపై దండెత్త బూనినప్పుడు ముసల్మాను లందరును త్యాగము చేయవలెనని కోరెను. "నీవేమి తెచ్చినావు ఉమర్" అని యడుగగా నా ఆస్తిలో సగము తెచ్చితిననెను.

"మరి నీవేమి తెచ్చినావు అబూబకర్" అని విచారించగా, నా ఆస్తి యంతయు తెచ్చితినని అబూబకర్ అనెను

పైగంబర్ అనంతరము అబూబ్కర్ గారు మొదటి ఖలీఫా అయిరి. వారు చనిపోవునప్పుడు అబ్దుర్రహిమాన్ అనునతనితో "ఉమర్‌ను గూర్చి నీ అభిప్రాయమేమి" అని యడిగెను. అతడు చాలా గొప్పవాడు, కాని చాలా కఠినుడు" అని యతడనెను. అబూబకర్ చనిపోవునపుడు తన తర్వాత పీఠాధికారి (ఖలీఫా) హజరత్ ఉమర్ అని శాసించెను. అబూబకర్ కాలములో ముసల్మానులు సిరియా, ఈరాఖ్, పాలస్తీనులను జయించి యుండిరి. ఉమర్ జరుసలేమను జయించుటకు సేననంపెను. ఆ నగర జనులు ముట్టడికి తాళజాలక తమ కోటను ఉమర్ గారికే యప్పగింతుమని చెప్పినంపిరి. ఉమర్ ఒక ఒంటెతో ఒక బానిస వానితో చద్దిమూటతో బయలుదేరెను. నీ వొక అంచె నేనొక అంచె వంతు ప్రకార మొంటెనెక్కి పోవలెనని అతడు బానిసతో చెప్పి అటులే జేసెను. దారిలో చద్దిమూటను విప్పి ఇరువురును పొత్తుగుడిచి మరల బాట పట్టిరి. జరుసలేమను సమీపించినప్పుడు ఒంటెపై నెక్కు వంతు బానిసకే వచ్చెను. "ప్రభూ, ఇప్పుడు తామ దర్జాగా ఒంటెపై నెక్కుటయే నీతి" అని వాడు మనవి చేసుకొనెను. "మరి మన ఒప్పుదల?" అని ఉమర్ తర్జించి వాని నెక్కించెను. కోట వద్ద జరుసలెం ప్రజలు వేలువేలుగా గుమికూడి ఒంటెపై నున్న గూలామునే చూచి జోహారు లర్పించుకొనిరి. ఈ జోహారుల నందవలసిన భక్తజనాధిపతులగు ఖలీఫాగారిదిగో అని ఒంటె త్రాటినిబట్టి పాదచారియగు ఉమరును వాడు చూపగా ఆశ్చర్యచకితులై అతని నెగదిగ చూచిరి. అతని అంగీకి కోరినన్ని అతుకులతుకులుండెను. అతని మోజాలకునూ అతుకులే యుండెను. జరూసలెం వారు అతనికి దివ్య వస్త్రాలను సమర్పించు కొనిరి. ఇస్లాం ఆలం కరణముతో నిండిన నాకు ఈ అలంకరణ లేమియు రుచించవు" అని మతాభినిష్ఠుడనెను.

ఈరాన్, (పర్షియా) సామ్రాజ్యముతో అరబ్బులు తలపడిరి. ప్రతిదినము యుద్ధ వార్తకై ఉమర్ ఊరు బయటకు పోయి వార్తా హరునికై యెదురు చూచు చుండెను. ఈరానును అరబ్బులు జయించిరను సువార్తను ఖలీఫాకు తెలుపుటకై ఒక నవాబు దుమ్ము లేపుతూ దౌడుతీయుచు వచ్చెను. దారిలో ఖలీఫా గారు ఏమి వార్త అని వాని నడిగెను. "ఉండవయ్యా, నేను ఖలీఫాతోనే మొదలీ వార్త

చెప్పవలెను" అని వాడు వేగాన్ని తగ్గించకుండా సవారి చేసెను. ఉమర్ గుర్రము తోకను పట్టుకొనియే వెంట నురికెను.

ఈరాన్ చక్రవర్తి ఉమర్‌కు కానుక లంపి యుండెను. అరబ్బుల దేశాలలో కానుకలు తెచ్చినవారు ఖలీఫా గారెక్కడ అని విచారించుచూ వెదుకుచుండిరి. తుదకొక సాధారణమగు డేరా ముందొక ఖర్జూర వృక్షము క్రింద ఖలీఫాగారొక చినిగిన ఉడుపును కుట్టుకొనుచు కూర్చుని యుండిరి. ఖలీఫా గారెక్కడ అని యతనితో వచ్చిన రాయబారులు ప్రశ్నించిరి "నేనే" అను మాటను విని అతడౌనో కాదో యను విచికిత్సలో మునిగితేలిరి. తెచ్చిన కానుకలన్నియు ప్రజాకోశము (బైతుల్ మాల్) లో చేరిపోయెను.

ఒక యుద్ధము నుండి వార్తతెచ్చిన సేనానులు మంచి వెలగల యుడుపుల ధరించి యుండిరి. "ఇది సిపాయీల వేషము కాదు" అని ఖలీఫా మందలించెను. జుబ్బాయీలు కత్తులు నడుమున, చంకన కలవని వారు చూపించగా కొంత శాంతించెను.

ఖలీఫా బహు రాజ్యాలను గెలిచి వాటిపై సుబేదారులనుగా పలువురిని నియమించెను. వారికిచ్చిన యాదేశము లెట్టివనగా "తుర్కీ పెద్ద గుర్రాలపై సవారీ చేయరాదు. విలువగల యుడుపుల తొడగరాదు. రుచిరాన్నముల తినరాదు. నౌకర్లను పెట్టుకొనరాదు. ప్రజలందరికి దర్శనమిచ్చుటకై దర్బారు తలుపు లెప్పుడును తెరచి యుంచవలెను". ఈజిప్టు సుబేదారగు ఆయాజ్ అనునతడు తద్విరుద్ధముగా మహా వైభవముగా సుఖించుచుండుటను విని అతని పిలిపించెను. అతని మెరుగు బట్టలను స్వయముగా చించి పారవేసి మోటు బట్టలను కట్టించి మేకల గాయుటకై పంపెను. కొన్నాళ్ళు పనిచేసిన తర్వాత అతనికి బుద్ధి వచ్చెను.

పూర్వము విక్రమాదిత్య చక్రవర్తి తన సామ్రాజ్యములో ప్రజల స్థితిగతు లెట్టివో కనుగొనుటకై రాత్రులందు మారు వేషాలతో తిరుగుచుండెనట. అటులే హ॥ ఉమర్‌గారున్నూ తిరిగెడివారు. ఒక రాత్రి ఒక యింటిలో పిల్ల లేడ్చుటచే తలుపు తట్టి కారణమేమని విచారించగా ఆకలిచే వారేడ్చుచుండిరని తెలుసుకొనెను. అయితే ఆ మూలలో ఉడుకేదేమిటి? అని యతడు విచారించెను. ఉత్త నీరు మాత్రమే కుత కుతమని యుడుకుచున్నది. పిల్లల యోదార్చుటకై అటుల చేయుచున్నాను

అని తల్లి పలికెను. ఉమర్ ఏమియు పలుకక మదీనాకు వెళ్ళి ఒక సంచి పిండిని తన వీపుపై మోసుకొని పోవుచుండెను. "ప్రభూ నే నీ మూటను తెత్తునులెండి- తమ కెందు కీ శ్రమ" అని బానిస యనెను "ఒరే ప్రళయ కాలమునాడు నీవు నా బరువు మోయుదువా? అని యతడనెను. మరొక రాత్రి ఒక అరబు గుడార ములో ఆక్రందనమును విని కారణమడుగగా అయ్యా నా భార్య ప్రసవ వేదనలో నున్నది. దాయిని తెచ్చుకొను శక్తి లేదు. మరెవ్వరును నాకు దిక్కులేరు." అని భర్త యనెను. ఉమర్ తన భార్యను కాన్పు చేయుటకై పంపెను. మరొక రాత్రి ఒక స్త్రీ ఉమర్ పరిపాలనలో నాకు తిండి లేక పస్తుండవలసి వచ్చెనని తిట్టు కొనుచుండుటను ఖలీఫా విని ఆమెకు కడుపు నిండునటుల అన్నము తెచ్చి పెట్టెను. ఆమె యన్నమును తిని యిట్లనెను. "నీ వెంత మంచివాడవయ్యా నీవు ఖలీఫా కంటే మేలైనవాడవు నీవే ఖలీఫాగా నుండిన ఎంతో బాగుండునుకదా"

ఇస్లాం వ్యాప్తికి బైతుల్ మాల్ ఒక ముఖ్య కారణము, అది ప్రజల ధన కోశము గెలిచిన రాజ్యాల లూటి ధనములో అయిదవ పాలు బైతుల్ మాల్ లో చేరు చుండెను. ప్రతి ముసల్మాను తన ఆదాయములో నూటికి రెండుపాళ్ళు బైతుల్ మాల్‌కు చెల్లించు చుండెను. దాని నుండి బీదలు వృద్ధులు వితంతువులు, అనాథులను పోషించు చుండిరి.

అంతేకాదు విద్యాలయములు వైద్యశాలలు పైకమునుండియే పోషింపబడు చుండెను. ఒక అపశత్రు దేశపు లూటీలోని ధనము రాగా ఖలీఫా బిడ్డ కూడ అందు కొంత పైకము తన కిమ్మనెను. అది జనుల పైకము, నాకు దానిపై యధికారము లేదు అని ఉమరనెను.

ఒకనాడు ఖలీపా కుమారుడు మద్యమును సేవించి అపరాధి యయ్యెను. ఖురాన్ ప్రోక్త ప్రకారము వానికి 100 కొరడాదెబ్బల శిక్ష విధించెను. ఖలీఫా కొడుకని సేవకులు మెల్లగా కొట్టుటచేత తానే కోరడా తీసుకొని శక్తి కొద్ది 100 వరకు ఎంచి యెంచి చావ మోదెను.

"నేను తప్పు చేస్తే దానిని చూపించి సవరింపుడు. మీకు సౌఖ్యమును చేకూర్చు విధానములను నాకాదేశింపుడు" అని ఉమర్ పలుమారు అను చుండగా ఒకనాడొక శ్రోత కత్తి నొరనుండి లాగి "నీవు పెడత్రోవ పట్టితే నీకు దీంతో

బుద్ధిచెప్పగలము" అని పలికెను. "భేష్ నాకు నీవంటి ధీరులు అనుచరులైనారని నా యానందము పారమందినది" అని ఉమర్ ప్రత్యుత్తర మిచ్చెను.

ఇస్లాం కొరకై చేసిన యుద్ధాలలో స్త్రీలు చాలా సహాయము చేయుచుండిరి. వారు పురుషులకు జియోహమ్మెత్త్ర్వా-యుద్ధము చేయవలెనని పురికొల్పు చుండిరి, కొన్ని సమయములలో తమ పురుషులు చచ్చినప్పుడు వారి అయుధములను గొని తాము యుద్ధము చేసిరి.

హజరత్ ఉమర్ గారి అంత్యదశ విషాదకరమైనది. ఒక నాడొక ఈరానీ బానిస ఖలీఫాతో తన యజమాని తనపై భరింపరాని పన్ను వేసెనని మొరపెట్టు కొనెను. ఎంత పన్నని విచారించగా రెండు దిరములనెను. నీ వృత్తి యేమని యడిగెను. నేనువడ్ల పని కమ్మరిపని చేయుదుననెను. అట్లయితే పన్నధికము కాదు పొమ్మనెను. మరునాడు వాడు మసీదులో దాగి ఖలీఫా నమాజు చేయునప్పుడు బాకుతో పొడిచెను.

నన్ను పొడిచిన దెవరు అని ఖలీఫా అడిగెను. ఈరానీ గులామని చెప్పిరి. ఇస్లాం భక్తుడు పొడువనందున ఆ దేవునికి ధన్యవాదాలు అని ఉమర్ పలికెను.

అతడు అతి మితజీవి. మసీదులో దినము బీద ముస్లింవలె కూర్చుండు వాడు. న్యాయము చేయుటలో తనవారని పరులని విచక్షణ చేయలేదు. పెద్ద చిన్నలని కాని, ధనిక దరిద్రులని కాని, బాల వృద్ధులని ఆత్మీయ పరకీయులని కాని యెన్నడును భేదము చేయలేదు. ఇస్లాముకై జీవించెను. దాని సేవలో చని పోయెను. దానికై తన సర్వస్వమును త్యాగము చేసెను. ఇతరులకి మేలు చేయించెను. ఈ గుణములు కలవాడగుటచే అతని నాయకత్వమున ఇస్లాం సామ్రాజ్యము అతివేగముగా నలుదిక్కుల వ్యాపించెను.

"హజరత్ ఉమర్ ఇస్లాము లోకములో ఉత్తమోత్తముడు."

# రాజా జైసింగు

250 ఏండ్ల క్రిందట ఉత్తర హిందూస్థానములో నొక మహావ్యక్తి యుండెను. అతడే రాజా జైసింగు. అతడు జయపుర సంస్థానమున తనపేర నగరముకట్టి, వ్యాప్తినొందించి స్థాపించినట్టివాడు. "ఇదంబ్రాహ్మం ఇదంక్షాత్రం శాపాదపి శరాదపి" అనట్లుగా అతడు శస్త్రవిద్య యందేకాక శాస్త్ర విద్యయందును ఆరితేరినవాడు. క్రీ.శ.1699లో సింహాసనాధిష్టుడయ్యెను. ఔరంగజేబు చక్రవర్తి యొక్క సుబేదారులలో నొకడై యుండెను. ఔరంగజేబు చనిపోయిన తర్వాత ఢిల్లీ సింహాసనానికై అన్నదమ్ములలో కలహములు జరుగగా అందొక పక్షమువహించి జయసింగు యుద్ధములు చేసియుండెను. తుదకు షా ఆలం చక్రవర్తి యైన వెంటనే తన కసిదీర్చుకొనుటకై జయసింగు రాజ్యమును లాగుకొనెను. జయసింగు మరల దానిని సంపాదించుకొనుటయే కాక తన రాజ్యాన్ని బాగా విస్తరింపజేసు కున్నాడు. పూర్వము తన రాజ్యానికి ముఖ్యపట్టణము అంబరు అను నగరమై యుండెను. అది తగినట్టిది కాదని ఇంకొక క్రొత్త నగరాన్ని తన పేరుతో జయ పురమని పేరుపెట్టి నిర్మించెను. ఈ నగర నిర్మాణమునకు ప్లానులు వేసియిచ్చిన వాడు విద్యాధరుడు అను జైనుడు. చక్కనివీధులను గట్టినాడు. దానిని చూచిన వారది ఈనాడు కట్టినారు అన్నట్లు కనిపించును.

ఇట్లు జయసింగురాజు గొప్పవీరుడనియు, రాజకీయ వేత్తయనియు ప్రసిద్ధి గాంచినను అతని జ్యోతిశ్శాస్త్రములోని ప్రఖ్యాతి ఖండ ఖండాంతరములలో వ్యాపించిపోయెను.

జయసింగు రాజుకు నక్షత్ర శాస్త్రముపై చాల అభిమానము. ఆ కాలములో మహమ్మద్ షా చక్రవర్తి ఢిల్లీ సింహాసనముపై నుండెను. ఆ చక్రవర్తి కోరిక ప్రకారము జయసింగు హిందూ పంచాంగమును సంస్కారము చేసెను. ఇందుకై అతడు ఢిల్లీ, ఉజ్జయిని, కాశీ, మధురా (మట్రా) జైపూరు నగరములలో నక్షత్ర వేదికలను నిర్మించెను. ఆ వేదికలపై నక్షత్రములను పరీక్షించుటకై కొన్ని యంత్రములను సిద్ధము చేయించెను. పారసీకుల యంత్రములు కొన్ని అతనికి

సహాయపడెను. అయినను తన సొంత ఉపజ్ఞతో నూతన యంత్రములను సిద్ధము చేసినాడు. మరియు నక్షత్ర శ్శాస్త్రమందు కొన్ని లెక్కలను సిద్ధము చేసినాడు. పోర్చుగల్ దేశములో జ్యోతి శాస్త్రము చాల వృద్ధి పొందినదని ఒక పోర్చుగీసు ఫాద్రీవలన విని ఆ దేశ రాజధాని యగు లిస్బన్ నగరానికి ఒక రాయబారి నంపినాడు. పోర్చుగల్ రాజగు ఎమాన్యుయల్ రాజు, జేవియర్‌డా సిల్వా అను పండితుని పంపెను. అతడు 1702 లో అప్పుడప్పుడే ముద్రితమైన పోర్చుగీసు భాషలోని జ్యోతి శ్శాస్త్ర గ్రంథమును జైసింగుకు తెచ్చియిచ్చి విషయములను అవగాహనము చేసెను. జయసింగు ఆ శాస్త్రములను విమర్శించినాడు. అందు కొన్ని తప్పులు కనిపెట్టినాడు. తర్వాతి కాలములో ఇంగ్లాండు యొక్కయు యూరోపు ఖండమందలి యితర దేశముల యొక్కయు, మహా పండితులందరును జయసింగు యంత్రాలను పరీక్షించి వాటిలో ఒకటి రెండు క్షణముల భేదములు తప్ప తక్కిన లోపములేమియు నిరూపింప జాలక ఆశ్చర్య యుక్తులైరి. జయసింగు తన శాస్త్ర గ్రంథమును జీజ్ మహమ్మద్ షాహీ అని పేరిడి తన చక్రవర్తికి అంకితమిచ్చినాడు. ఇంతేకాక అతడు పండితులను ప్రోత్సహించి వారిచే గణిత శాస్త్రములను సంస్కృతములోనికి పరివర్తనము చేయించినాడు.

తన జయపురములో నిప్పటికి అతడు నిర్మించిన అనేక నక్షత్ర వేదికలు కనబడుచున్నవి. అవన్నియు శిథిలమై పోయినవి. చిత్ర విచిత్రములైన రూపములతో, అర్ధ చంద్రాకృతిగా, త్రికోణాకారముగా నానారూపములుగా ఈ నిర్మాణములున్నవి. వాటిపై తాను చూపించి చేయించిన చాల పెద్ద యంత్రములను సెక్కించి యుండెరి. ఆ యంత్రములు రాగితో చేయబడి యుండెను. తర్వాతి రాజైన జగత్ సింగు యొక్క ఉంపుడు కత్తె యగు సస్‌కాపూర్ అను స్త్రీకి ఆ పెద్ద పెద్ద రాగి యంత్రములలో రాగి మాత్రమే కనిపించెను. అవన్నియు అమ్మిన వేలకొలది ధనము వచ్చునని ఆ గణిక గుణించెను. అప్పుడే ఆ యంత్రాల నన్నింటి లాగించి పాత్ర రాగికి మంచి ధర వచ్చుటను జేసి కరిగించి అమ్మించెను. ఇట్లొక బోగము దాని మూలమున ప్రపంచానికి జైసింగు యొక్క అపూర్వ మేధస్సుచే కనిపెట్టబడిన శాస్త్రీయ యంత్రములు నష్టమయ్యెను. తర్వాతి రాజులు అట్టి యంత్రాలను మరల సిద్ధము చేయించ ప్రయత్నించిరి. కాని ఆ పద్ధతి వారికిగాని పండితులకు గాని తెలియనందున ప్రయత్నములన్నియు వ్యర్థమయ్యెను.

# దివాన్ బహద్దర్ వి. నాగమయ్య

ఆంధ్ర మహాపురుషుల జీవితములు పూర్వమందేమి యాధనికకాలమందేమి వ్రాయుట యందు, పాశ్చాత్య సంపర్కము గల యిప్పటి కాలమందయిన నీ లోపమును బాపుకొనుటావశ్యకము. ఇందు తిరువాన్కూరు రాజ్యములో నలుబది సంవత్సరములు రాజకీయోద్యమమందు గడిపి, హిందూస్తానమందే కాక ఇంగ్లీషు దీవులయందును ప్రఖ్యాతిగాంచిన యాంధ్ర బ్రాహ్మణుడైన నాగమయ్య జీవితమును సూక్ష్మముగా నివేదించెదను.

దివాన్ బహద్దరు వి. నాగమయ్య బి.ఏ, యఫ్.ఆర్. హెచ్.యస్. తిరునల్వేరి జిల్లాలో తామ్రపర్ణ నదీతీరమునున్న వీరరాఘవపురమను గ్రామమున 1850 వ సంవత్సరము డిసెంబరు నెలలో జన్మించెను. ఇతడారువేల నియోగి. వీరి పూర్వులు కృష్ణా జిల్లాలో బొంపూడి గ్రామమునుండి దక్షిణమునకు వెడలిరి. ఇతని మాతా పితరులితడు జన్మించిన మూడు సంవత్సరములకు తిరువనంతపురము (తిరువేంద్రము)లోబోయి చేరిరి. నాగమయ్య యచట మహారాజాగారి స్కూలులోను కాలేజిలోను విద్యాభ్యాస మొందెను. 1886 వ సంవత్సరములో మెట్రికు పరీక్షలో గడతేరి 1870 లో బి.ఏ. బిరుదమంది సర్.టి. మాధవరావు చేతి క్రింద సర్కారీ గుమాస్తాగా నౌకరీ చేయ ప్రారంభించెను. 1890 వ సంవత్సరములో మన దేశమున ఇంగ్లీషు విద్యా చాలతక్కువ. అట్టి తరి యీతడే తిరువాన్కూరు సంస్థానములో మొదటి బి ఏ. బిరుదమందినవాడు. ఇతడు విద్యాభ్యాసము చేయుకాలమున పాఠశాల యందలి బాలురలలో నెల్లను బుద్ధి కౌశలమున మించి యుండెను. ఇతడుద్యోగమున జేరిన రెండు సంవత్సరముల లోపలనే కొట్టయం, భాగమునకు తహసీలుదారుగా తిరువాన్కూరు సర్కారుచే నియోగింపబడెను. ఇతని పై యధికారులు - ఇంగ్లీషువారును, స్వదేశస్థులును - ఇతని చాతుర్యమునకు, గార్యనిర్వాహణమునకును, మెచ్చుకొని యతనిని బాల తహసీలుదారు అని పిలుచుచుండెడివారు. గతించిన మహారాజు కూడ యతని శ్లాఘింపదొడగెను. 1894 సంవత్సరమున తిరువాన్కూరు జనాభా (Cengus) పై నతడు సూపరింటెండెండుగా నుండుటకై యేర్పాటు చేయబడెను. ఈ జనాభా లెక్కలు

ముగిసిన వెంటనే మహారాజు, మంత్రి మొదలుగ ఇంగ్లీషువారును, నితరులు నాగమయ్య శక్త్యుత్సాహములతో నొక లోపమైయినను లేక నియుక్త కార్యమును బూర్తి చేసినందులకు నతనిని బ్రశంసించిరి ఈ సందర్భమున హైద్రాబాదులో మంత్రియైన సర్‌సాలర్‌జంగ్ నాగమయ్యకిట్లు వ్రాసెను. "మీ ఖ్యాతి నేను విని నాడను. మా రాజ్యపుబాలనా పద్ధతులను మీకు స్వయముగా నివేదింప నిచ్ఛ గలదు." 1880 వ సంవత్సరమున ప్రకృతపు మహారాజుగారు సింహాసనా రూఢులైరి. మరుసటి యేటనే నాగమయ్యకు దివాన్ పేష్కారి పదవినిచ్చిరి. తిరు వాన్కూరులో నిప్పుడు చాలవఱకు తగ్గినను, బ్రాహ్మణ సత్రములు ధారాళముగా జరుగుచుండును. ప్రతి దివసమెందఱు వచ్చిన నందఱి బ్రాహ్మణులకు అనంత శయన పద్మనాభ దేవాలయములో భోజనము పెట్టబడును. కాని ప్రతి సంవత్స రమును మూరజపతులాభారాద్యుత్సవ సమయములందు నాగమయ్య కార్య క్రమమును జరిపించుచుండెను. ఈ సత్రముల విషయమై నాగమయ్య తన రిపోర్టులో నిట్లు వ్రాసెను.

"మూరజపోత్సవమున సుమారు 4000 బ్రాహ్మణులకు 80 వారముల వఱకు భోజనమిచ్చుచున్నారు కడపటి వారమున భుజించువారు 10,000 జనులు. ఇట్టి పద్ధతి ప్రపంచమందెందును గమనింప జాలము."

నాగమయ్య రెండవ తూరి సహితము జనాభా లెక్కలపై నేర్పాటు చేయ బడి యందఱి మెప్పువడసెను. మహారాజాగారు హిందూస్థాన మందెచ్చటికైన బయలుదేరు సమయమున వారి సౌకర్యములకై యేర్పాటు చేయుటకు నాగమయ్యనే కోరుచుండెను 1881 వ సంవత్సరమున మహారాజాగారు వీరి యేర్పాటులకు సంతసించి యుంగరమొకటి బహుమతిగా నిచ్చెను.

1890 లో నితడు మూడవ తూరి జనాభాపై యధికారము వహించెను. ఈ సందర్భమున నితనిని రిప్పన్, గ్రాంటుడఫ్ బాల్ఫర్‌వాచా మున్నగువారు ప్రశంసించుటయేకాక హిందూస్థాన ఇంగ్లీషు స్థానమందలి పత్రికలు బహువిధముల శ్లాఘింప దొడగెను. 1892 లో నితడు రాయల్ హిస్టారికల్ సంఘములో నొక సభ్యుడుగా నెన్నబడెను.

ఇతడు పేష్కారిగా నుండిన కాలములో సత్రములను, బావులను, బాటలను, పాఠశాలలను దేవతాయతనములను కొన్నింటిని నూతనముగా నిర్మించి, యన్నిం

టిని బాగుచేయించి ప్రజలకేలాటి కష్టములుండిన నివారించు నుపాయములను జేయు చుండెను. ఇతడు మత సంబంధమైన ఏండోమెంటు చట్టమును శాసన రూపము వహించునట్లు దీనికై యతడు తిరువాన్కూరు సభలో ఉపన్యాసములనిచ్చి యాక్షేపణముల కన్నింటికిని సమాధానముల నిచ్చి బహు ప్రయాసముతో సభ యొక్కయు రాజాగారి యొక్కయు అనుమతి బొందెను. రమేశచంద్రదత్తు నాగమయ్య కిట్లు వ్రాసెను "మీ గంభీరోపన్యాసముల జదివితిని. అందు మీరతి ప్రతిభాశక్తిని జూపించినారు. మా సంస్థానములో సహిత మిట్టి చట్టమును శాసింపయోజించు తమరు నాకును జాల సహాయపడినవారై యున్నారు" నాగమయ్య గంభీరోపన్యాసముల నిచ్చుటలో చాల ప్రవీణుడనుట కతని కంపిన లేఖలే నిదర్శనము. టాస్మేనియా గవర్నరుగానుండిన సర్ ఆర్థర్ హావ్లార్ ఇట్లు వ్రాసెను. "1897 లో నేను తిరువనంతపురము వచ్చినపుడు మీతో గలసిన సందర్భము నెప్పటికిని మఱచిపోను. దక్షిణ హిందూస్థానములోనే గలసిన ధీ ప్రజ్ఞాశేఖరులలో మీరొకరని నా దృఢ విశ్వాసము."

1902 లో రాజాగారు మంత్రియు ఢిల్లీలో చక్రవర్తి పట్టాభిషేకోత్సవమున కరిగినపుడు నాగమయ్యను రెండు నెలలు "దివాను"గా నియోగించిరి. మరల 15 మాసముల తర్వాత రెండవ తూరి యితడు దివానయ్యెను. పిమ్మట తిరువాన్కూరు నాణెముల యేర్పాటుకై నాగమయ్య "చక్రం కమిటీ కధ్యక్షుడయ్యెను. ఇది ముగిసిన పిమ్మట నాగమయ్యను" తిరువాన్కూరు స్టేటు మాన్యుయల్ ను తయారు చేయుటకై మహారాజాగారు కోరిరి. ఈ పని నాగమయ్యకే తగినట్టిది.

ఇతడు చిన్న నాటను గోలె యనేక శాఖలందు ప్రవీణత నొంది నానావిధ శాస్త్రములను గ్రంథములను ప్రతిదినమెంతటి కార్యముండినను గొంతవఱ కవకాశము చేసుకొని యవలోకనము చేయుచుండెడివాడు. సర్కారు భాండాగార మందల పుస్తకముల జదివినదే కాక తన సొంత లైబ్రరీలో 2500 యుత్కృష్ట పుస్తకముల గూర్చుకొనియుండెను. తన తక్కిన రాజ్య కార్యముల నిర్వహించు చుండియు 2000 ముద్రిత పత్రముల విషయముల నీత డచిరకాలము లోపలనే ముగించి ప్రకటించెను. ఈ గ్రంథములందితడు తిరువాన్కూరులోని జనులకు విదితములైన వాని వెల్లడించుచు నచటి సర్వజనుల చారిత్రములను వృక్ష జంతులోహాదుల విషయములను భాషా చరిత్ర దేశ చరిత్ర మున్నగు వానిని

సమగ్రముగా వ్రాసి శేముషీవిశేషములను బ్రకటించెను. మత విషయముల వ్రాయుచో "హిందూ గృహము, ప్రపంచములో నుత్తమ నిర్మాణమని యభిప్రాయమిచ్చి ఫాద్రీలు యాక్షేపణముల ఖండించెను తిరువాన్కూరులో మెల్ల మెల్లన ప్రాకి దినదినము ప్రబలమైనట్టి క్రైస్తవ మతమును నిష్పక్షపాత బుద్ధితో బ్రశంసించుటచే ఫాద్రీలు సైతము మిక్కుటముగా హర్షించిరి చరిత్రకారుడైన "లేకి" యతనిట్లు ప్రశంసించెను

"ఆల్ ఫ్రెడులయల్" మలబారు మంత్రవాదమును గురించి మాకు గొంత తెలిపెను. కాని మీరు వ్రాసిన దానిలో ననేక నూతాంశములు దొఱకినవి, నాగమయ్య వ్రాసిన మాన్యులు నాధారముగా జేసికొనియే ఎన్సైక్లోపిడియాలో మలబారు విషయము వ్రాయబడెననుట వీరి యసమానబుద్ధి ప్రభావమును వేనోళ్ళ జాటుటయైనది.

ఇది ముగిసిన పిమ్మట నాగమయ్య 1904, 1905, 1907 సంవత్సరములలో వరుసగా మరల దివాను పదవి నందెను. తుదకు 1907 లో తన యుద్యోగ పదవినుండి సెలవు తీసుకొనెను. ఇతడు ముగ్గురు మహారాజుల కాలమునను, ఏడుగురి దివానుల దగ్గరనుద్యోగము చేసెను. మొదటి నాలుగు సంవత్సరములు విద్యాశాఖయందును, 2 సంవత్సరములు దివాన్‌కచ్చేరియందును, 2 యేండ్లు తహసీల్దారుగను, 12 యేండ్ల దివాన్ పేష్కారీగాను, 11 సంవత్సరములు రెవిన్యూ దివానుగాను, 5 మారులు దివానుగాను, మొత్తము, 42 సంవత్సరములు రాజాగారి యుద్యోగమునకు ధారపోసెను. ఇట్లు ప్రపంచమందంతటను బ్రఖ్యాతి గాంచిన యీ యారువేల నియోగి, నాగమయ్య 1916 ప్రాంతమందు పరమపదించెను. ఇతని కుమారులిప్పుడు తిరువనంతపురములో మహారాజుగారి యున్నతోద్యోగములందు బ్రసిద్ధి వహించి వర్ధిల్లుచున్నారు.

# పండిత మాడపాటి హనుమంతరావుగారు

"గోలకొండ పత్రిక మేనేజరుగారికి— అయ్యా నా యుపన్యాస ప్రతులలో 17 తక్కువగా వచ్చినవి. మహిళా సభాధ్యక్షురాలివి 100 తక్కువగా నున్నవి. దయచేసి పంపగలరు"

మహిళా సభాధ్యక్షురాలు మాడపాటి హనుమంతరావుగారి భార్య. నిజాం రాష్ట్రి చతుర్థాంధ్ర మహాసభకు అధ్యక్షులు శ్రీరావుగారే. తమ తమ యుపన్యాస ప్రతులను (200 లను) ఓపికతో స్వయముగా నెంచుకొనినారు. ప్రతి చిన్న విషయములోను కట్టుబాటు. అందు ఆవంత పొరపాటును గూడ గుమ్మడి కాయంతగా జూతురు. సహింపనే సహింపరు. తమ యింటి లెక్కయెట్లో ప్రజా నిధి లెక్కయునట్లే దమ్మిడీ దమ్మిడీ లెక్కపెట్టవలె. ఆ లెక్కసరిగా కుదురవలె ఏదన్న వ్యర్థముగా పోరాదు. "ఆనెగొంది లెక్కలు" వారికి సరిపడనే సరిపడవు.

* * *

ఇంచు మించు 17 సంవత్సరముల నాటి మాట. ఆనాడు హైద్రాబాదులో తెనుగు వారికి సంస్థలు లేవు. సంఘటన మంతకును తక్కువ. మహారాష్ట్రుల సంఖ్యతక్కువైనను వారిదే ప్రాధాన్యము. ఒక సభలో నొక తెనుగు పెద్దమనిషి సభావేదికపై నెక్కియుపన్యసింప బోయినాడు. మహారాష్ట్రులు గోలపెట్టినారు ఆ పెద్దమనిషితోపాటు శ్రీ హనుమంతరావుగారున్నూ సభను వదలి వెళ్ళినారు. ఆ చిన్నఘట్టమే ఆంధ్రోద్యమ శంఖుస్థాపనకు కారణమైనది. నేడు మహారాష్ట్రుల కన్న ముందంజ వేయుచున్నారు ఆంధ్రులు. ఇదంతయు రావుగారి నిరంతర కృషి ఫలితమువారి యాంధ్రాభిమానమునకు నిదర్శనము.

వక్తృత్వ పరీక్షలో బహుమానం పొందిన వక్తకాడు. గొప్పపండితుడునుకాడు. కవిత్వము చిన్నప్పుడేవో గణబద్ధముగా వ్రాసిన కొన్నిపద్యములు కలవు. పరిశోధకులకుల తప్పనితరుల కాసంగతి తెలియదు. ఇంగ్లీషులో మెట్రిక్కుహద్దు. ఫార్సీలో సాదీని సాధించెను. ఉర్దూలో మంచి పాండిత్యము. తెనుగులో గ్రాంథికవాది. కాని గ్రాంథిక వ్యావహారిక చర్చలో తమ విలువవోటు నెవ్వరికి

ఇయ్యరు. ఇతిహాసికుడు కాడు, పరిశోధకుడు మున్నే కాడు. అయితే యిన్ని "నజ్" లతో ఒప్పియు వీరికీ ప్రాముఖ్య మెట్లు వచ్చెను? అదియే వీరి జీవిత రహస్యము.

*  *  *

శ్రీ పంతులు వారికి చేపట్టిన విషయములందెల్ల పట్టుదల మెండు. కార్య సాధకుడు. (పర్జోపయోగార్థమై యా సాధన మరుదుగా యేనకేనా ప్యుపాయేన అయిననూ సాధారణముగా నియమోల్లంఘన మభిలషించరు)

ఏ విషయమును గురించి ముచ్చటించినను - సభలో గాని, ఇంటిలోగాని- ఆ విషయము ను విపులీకరించి, తిన్నగా, నెమ్మదిగా, కథా క్రమముగా, పూస గుచ్చినట్లు విషయము పెరిగినను సరే, శ్రోతల కానంద ముండునంతవరకు సాగ దీయును.

*  *  *

ఎవ్వరి మనస్సును గాని, ఏ కారణముననైనగాని, నొప్పింపగూడదనునది వారి నీతి మార్గములలో రాజ మార్గము. "అన్యుల మనముల్ నొప్పింపక తా నొవ్వక తప్పించుక తిరుగువాడు" అని యీనాడే రాష్ట్రకవియైన వ్రాసియుండిన అది వీరిని మనసులో నుంచుకొనియే వ్రాసినాడేమోయని మిత్రు లందరిలో గుస గుసలు బయలుదేరి యుండును. ఎవ్వరేని రావుగారి అభిప్రాయము గోరిన వారికి మనసిచ్చి చెప్పరు. "పుత్రోను పుత్రి"వంటి జోస్యముగా నుండును. అభిప్రాయ భేదమును విధిలేక ప్రకటింపవలసియే యుండిన అది ద్రావిడ ప్రాణాయామ న్యాయముచే సిద్ధింప జేతురు.

*  *  *

నాయకుడైన వానికి ఒకానొక సమయములో శీఘ్ర నిర్ణయము (Quick decision) ఉండవలెను. వీరు తరచుగా వికల్ప న్యాయములో జిక్కియుందురు.

నాయకుడు సమయమునకై పొంచియుండవలెను. సమయము వచ్చినపుడు దానిని తటాలున గ్రహించి లాభము పొందవలెను.

అట్టి సాధనకు సహనము (Risk) కావలెను. రావుగారిలో (అవకాశము కలుగనందుననేమో) యీ గుణము వ్యక్తము కాలేదు.

*  *  *

వీరిలో నొక గొప్పలక్షణము కలదు. ప్రజాసేవకులను, ప్రాయసకాంగ్రడను గుర్తించుటలో వీరికి పక్షి చూపు (Eagle eye) కలదు. అట్టి వారిని జారి పోద మన్నను జారనీయక తమ దృక్పథమందే యుంచుకొని ప్రోత్సాహపరచి రంగము లోనికి సిద్ధము చేసుకొనుట నాయకుని లక్షణములలో నొకటి.

ఎత్తైన వారుకారు. స్థూల శరీరులు. ఆ స్థూలత వారి నడకనెటులో నడవడి కను నటులే నెమ్మదిగా సాగించును. స్వీయప్రకటమును ఆత్మోత్కర్షను గోరరు. ఆడంబరము లేదు.

ఉడుపులందు సాధారణత యెట్లో జీవన మందును నట్లే కళోపాసకులు కారు. భావానుగుణ్యముగా నింటిగోడలు క్యాలెండరు అలంకారములనైన నోచుకొన లేదు.

* * *

సభా వేదికాలంకారకులు, వాగ్రంగసింహులు, స్వార్థ నిమిత్త కౌటిల్యులు, పత్రికా ప్రకటితులు, మతావేశోన్మాదులు, దాంభికోత్తంసులు, — నాయకులు పలు తెరగులవారై యుందురు. మనరావుగారు పై తెరగులలో నొక్కదానికైనను చేరిన వారుకారు. తమ యుద్యమ మూలమున జీవనోపాధియగు ప్రాక్టీసును నష్ట పరచుకొనినారు.

ఉత్సాహవంతులను ముందునకు నడిపించుటలో నానందింతురు. ఆంధ్రాభి మానము మెండు మనవారు - ఏ ప్రాంతీయులైనను సరియే - పేరు ప్రతిష్ఠలు పొందుచున్నారనిన అది వారికి విందు. ప్రాంతీయ దురభిమాన పిశాచబాధితులై యాత్మోత్కర్షలో తగుల్కొని యైకమత్య దూరులైన యాంధ్రులలో రావుగారి యీ గుణము అనుకరణీయము.

* * *

ఉత్సాహము, తాత్కాలికావేశము, ఉద్రేకము పొందకమున్నే శాంతించుట- ఇవి యాంధ్రునికి - పూర్వమందుగాని, పశ్చిమ మందుగాని వలసలోగాని - ప్రత్యేక లక్షణములని విశదములైన యంశములే. వీరీ ముఖ్యాంధ్ర లక్షణమునకు దూరులైనారు. మాటలందుగాని, కార్యములందుగాని ఆవేశము చూపరు. శ్రద్ధను పూర్తిగా పూని యుందురు. ఇదియే నిష్కామ కర్మ ప్రథమ సోపానము.

* * *

తమ ప్రథమ కళత్రమువలన నొకే కూతురు. ఆ బాలికకు వివాహ మైనప్పుడు యువకులు తమ యసమ్మతిని రావుగారు తమ హృదయ దౌర్బల్యా

మును ప్రకటింపవలసి వచ్చెను. ఇప్పుడు సంఘ సంస్కారులు. జిల్లాలలో ప్రచారార్థ మరిగినప్పుడు మాత్రము మడి పంచ తమ తోలు పెట్టెలో నుండి తీరును. పంతులు గారికి వేరు సంతానము లేనందున పిల్లల సందడి యెరుగరు. అందుచే తమ బల్లపైని కాగిదములు కలము పుల్ల యథాప్రకార సిద్ధిలోనే యుండును.

* * *

హిందూ సమిష్టి కుటుంబముల గందర గోళముల నెరుగరు. వీరి కన్న గారు కలరు. వారిటీవలనే చనిపోయిరి. పేరునకు సమిష్టి కుటుంబమే. కాని చిన్నప్పటి నుండియు వీరు బయట బయటనే పెరిగిన వారగుటచేత సమిష్టి కష్ట సుఖముల నంతగా నెరుగరు

"అరే" అను మిత్రులు వీరికి లేనే లేరు. "ఓయ్" తెగ వారొకరిద్దరే! "ఆర్యవర్య" పరిచయస్థులే బహుళము.

* * *

పంతులు గారింటిలో నొక పాత పటము కలదు. బుర్ర మీసాలు, 24 అంగుళముల యెత్తుగల తుర్కీటోపీ, మోకాళ్ళపై చిందులాడు షేర్వానీ, పైజామా దిట్టమగు శరీర స్థౌల్యము - ఇవి ఆ పటమందలి విశేషాలు. సుమారు 30 ఏండ్ల వయస్సును సూచించును. ఆ జమీరుషరీపు నుండి హైద్రాబాదుపై సవాలు వేయవచ్చిన పైల్వానును సూచించును. ఆ పట మేమూలనో దాగియున్నది. బయటి వారికి గోచరించదు.

ఇప్పుడు రావుగారికి 52 సంవత్సరముల వయస్సు. ఈ 20 ఏండ్లలో నింత గొప్ప మార్పు.

నిజాం రాష్ట్రములోని విద్యావంతులైన యాంధ్రులలో నీ 10-15 ఏండ్ల నుండియు ఇట్టి మార్పులు జరుగుచున్నను "దొర" జాతివారు మాత్రము తమ "చిత్త నిత్య స్థితిని"ని నిరూపించికొనినారు.

రావుగారు మిత జీవులు. (నగనాగరికుల యభ్యాసములు ఫ్యాషన్, సిగరెట్, టాకీవగైరాలు బొత్తిగా లేవు) బెజవాడ సరిహద్దగు మధిర తాలూకా వారై ప్రాత ముల్కీ అయినను పూర్వాంధ్ర సంస్కారమే హెచ్చుగా కనబడుచున్నది. ప్రతి ప్రజా సంస్థలోను సభ్యులై ఆలోచనలు చెప్పి శ్రద్ధతో పనిచేసి లోక సంగ్రహార్థమై తమ శక్తి కొలది సేవజేయు హనుమంతరావు పంతులుగారు ఆంధ్ర మహా పురుషులలో ముఖ్యులనుటలో నేమియు సందేహము లేదు.

# శ్రీ రాజాబహద్దూరు వేంకటరామారెడ్డిగారు

నిజాము రాష్ట్రములోని రాయచూరు పట్టణమున ఒకప్పుడు 18 ఏండ్ల రెడ్డి బాలుడొకడు తన మేనమామ చనిపోవుట వలన చాల చింతించు చుండెను. అతడు మిగుల బీద కుటుంబము లోనివాడు. మేనమామ జిల్లా పోలీసు సూపరెండెంటుగా నుండి అతనిని తన యింటనే యుంచుకొని చదివించు చుండెను. ఆ పోలీసు అధికారి చనిపోగా అతని బంధువులు వచ్చి యిల్లు ఖాళీచేసి యీ బాలుని గూడ తమతో గొనిపోవ నుద్యుక్తులైరి.

బాలునకు విద్యాసక్తి యధికముగా నుండెను. గ్రామమునకు పోయిన వ్యవసాయమున ప్రవేశింపవలసి వచ్చును. అది బాలున కెంత మాత్రము నిష్టము లేకుండెను.

అతడుండిన యింటికి సమీపమున నొక మౌల్వీ యుండెను. బాలు డాతని చెంతకు బోయి కూర్చుండి దుఃఖింపసాగెను. అది చూచి మౌల్వీ "ఏల దుఃఖించెద"వని యడుగ బాలుడు సంగతి యంతయు చెప్పెను. దానిమీద మౌల్వీ "దేవుడున్నాడులే. దుఃఖించకు" అని ఓదార్చెను.

కాని బాలుని దుఃఖము ఓదార్పులతో పోలేదు. మరునాడు గూడ అతడు యథా ప్రకారముగ దుఃఖింపసాగెను. మౌల్వీ మరల అది చూచి బాలుని సమీపమునకు బిలిచి "ఏమి ఫర్వాలేదు పో, నీకు మేలే కలుగును" అని దృఢముగా పలికి పంపివేసెను.

మరునాడు బండ్లు కదలుటకు సిద్ధముగా నుండెను. బాలుడేమియు తోచక బిక్క మొగముతో నిలిచి యుండెను. ఒక క్షణమాలస్యమయిన బండ్లు సాగియే పోవును. కాని ఉన్నట్లుండగా యీ బాలుని మేనమామ అనుగ్రహమున ఉన్నతికి వచ్చిన ఒక పఠాను వచ్చి "ఈ బాలుని గూడ తీసుకొని పోయెదరా" అని అడిగెను.

"అవును?"
"తీసుకొని పోయి",
"వ్యవసాయము చేయింతుము."
"చదివించరా ?"
"ఎవరు చదివింతురు ? ఖర్చెవ్వరు భరింతురు ? అది మావల్ల కానిపని."
"సరే, మీరీ బాలుని నాకప్పచెప్పుడు"
"వీలులేదు."
"అప్ప జెప్పవలసినదే. ఆ బాలుని ముట్టితిరా, ఖబడ్దార్ !"

బంధువులు అందుకు మారు చెప్పలేక, "వాని తిప్పలు దైవమెరుగు"నని పఠానున కప్పగించి వెడలిపోయిరి.

బాలుడు బ్రహానంద భరితుడయ్యెను.

మరునాడే పఠాను బాలుని వెంటనిడుకొని హైదరాబాదు నగరమున కరిగి పెద్ద పెద్ద అధికారులవద్దకు పిలుచుకొనిపోయి "ఇతడు విలియం వహాబు (పోలీసు మొహతెమీం) సూపరెండెంటు గారి మేనల్లుడు" అని చెప్పి పోలీసు శాఖలో ఆమీన్ (సబినస్పెక్టరు) పదవి నిప్పించెను.

విలియం వహబ్ అను పదమును విన్నంతనే యీ పురుషుడు ఇంగ్లీషు వాడా, ముసల్మానా, లేక ఉభయ సంబంధము కలవాడా అనే పాఠకు లూహలకు పోవుదురు; కాని అతడు రెడ్డియే.

క్రీ. శ. 1865 లో దివంగతులయిన వనపర్తి సంస్థానాధీశ్వరులు ప్రథమరామేశ్వర రాయలవారు గొప్ప సంఘసంస్కార పరులలో అత్యుత్తములు (ఈ మహారాజే ఆంధ్రులందరిలోను మొదటి సంస్కారి అని నేనిదివరలో గోల్కొండ పత్రికలో విపులముగా వ్రాసియున్నాను.) తత్ఫలితముగా వారు తమ బంధువులలో ఏడుగురు బాలురను తమవద్దనే చేర్చుకొని వారి పుట్టు పేరులను తుడిచివేసి ఇంగ్లీషువారి పేరు కొంత, ముసల్మానుల పేరు కొంత చొప్పున చేర్చి వారికి పేరులు పెట్టిరి. ఆ బాలురే విలియం వహబ్, చార్లెస్ వహబ్ హెన్రీ వహబ్ ఇత్యాదులు. ఈ వహాబులందరును గొప్ప గొప్ప యుద్యోగములు చేసిరి. ఆ వహాబులలో నొకడయిన విలియంవహబ్ రామేశ్వరరాయల వారికి మేనల్లుడు. ఆ విలియం వహాబు మేనల్లుడే యీ బాలుడు - అనగా వేంకట రామారెడ్డి.

రెడ్డిగారి బాల్య దశలోని యింకొక చిన్న ఘట్టము నిక్కడ చూపవలసి యున్నది. రెడ్డిగారు సుమారు 12-13 ఏండ్ల వయస్సులో కొన్ని దినములు హైదరాబాదులో చదువుకొనిరి. ఆ రోజులలో నొకరాత్రి ఇంద్రసభ అనేది కాబోలు ఒక నాటకము ప్రదర్శింప బడినది. దానిని చూడవలెనని రెడ్డిగారికి సరదా పుట్టినది. కాని పెద్దలు పోనీయరు. మానలేడు. ఏమి చేయుట? తుదకు రెడ్డిగారొక యుక్తిపన్నిరి. మంచము మీద వారు దిండుపెట్టి దానిపై దుప్పటి కప్పిరి. చూచు వారికి బాలుడే పడుకొని యున్నట్టు తోచెటట్టు సరిగా సర్దిరి. తరువాత మిత్రులతో కలసి నాటకమునకు వెడలిపోయిరి. కొంతసేపయిన తరువాత యజమాని వచ్చి చూసి బాలుడే పడుకొనియున్నాడని వెడలిపోయెను. కాని అక్కడ నాటకమయి పోయిన తరువాత కళ్లు నులుముకొనుచు బాలుడు తన మిత్రులతో బయలుదేరి వచ్చుచు ఉస్మాన్‌గంజ్ నాకా (పోలీస్టేషన్) వద్ద ఎవరో తగవులాడుకొనుచుండ తమాషా చూచుచు నిలువబడెను. కొంతసేపటికి పోలీసులు వచ్చి "మాకీ తగవుతో సంబంధములే"దని బాలుడును, మిత్రుడును ఎంత మొర పెట్టుకొనినను వినుపించు కొనక తగవుచాడుచుండిన వారితోపాటు వీరిని నాకాలో బంధించిరి. తెల్లవారిన పిదప యజమాని బాలుని లేపవచ్చి, దిండుచూచి అదరిపడి బాలుడు రాత్రి మిత్రులతో గూడి ఎక్కడికోపోయి యుండునని తహతహపడును. కొంతసేపటికి బాలుడు పోలీసులు విడిచిపెట్టగా యింటికి వచ్చి యజమానిచే ప్రాయశ్చిత్తము పొందెను. రెడ్డిగారు ఇప్పటికి కూడా యీ సంగతి మరువకపోవుటయే కాక అప్పుడప్పుడు అది యంతయు చెప్పుచు "ఇప్పటికిగూడ నేను ఆ నాకాను చూసి నప్పుడు చిన్నప్పటి ఆ ఘట్టము జ్ఞాపకము వచ్చు"ననుచుందురు.

పఠాను అనుగ్రహము వలన అమీన్ పదవి దొరికినది; కాని తన్నిర్వ హణ విధానము మాటయేమి? అప్పటికి వారి పాండిత్యము ఉర్దూలో 6వ వాచకము వరకు మాత్రమే. తెనుగులో చదువుట, వ్రాయుట, కొంచము వడ్డీలెక్కలు కట్టుటవరకు మాత్రమే. పార్సీలో ఇంతకు చాలాతక్కువ ప్రవేశము మాత్రమే. పైగా ఉర్దూలోని నిశిందా వ్రాత చదువుటకే శక్తి చాలదయ్యెను. ఇక పోలీసు వ్యవహారముల జ్ఞానమా? పూర్తిగా సున్న.

ఈ స్థితిలో ఒక తాలూకాలో పోలీసు ఉద్యోగిగా వెళ్లి ప్రవేశించినారు రెడ్డిగారు; కాని అదృష్టము బాగుగానుండెను. ఏమంటే? అక్కడి తహస్సీలుదారు

రెడ్డిగారి మేనమామ సిఫారసువలన ఉద్యోగము పొందినవాడు. ఇంక లోటేమి? దినదినమును పైనుండి వచ్చెడి ఆజ్ఞలతో రెడ్డిగారు ఏకాంతముగా తహస్సీలుదారు వద్ద కరిగి జవాబులు రాయించుకొని (ఈ సంగతి అక్కడి నౌకర్లకును తెలియదు) వచ్చుచుండెడివారు.

ఇట్లు కొలది దినములే జరిగెను. తరువాత రెడ్డిగారు స్వయముగా వ్యవహరించుటకు పూర్తిగా సమర్థులయిరి.

సుమారు 15 సంవత్సరముల క్రిందటి మాట. వనపర్తిలో మహారాజా శ్రీ రామేశ్వరరావు బహద్దరువారి రెండవ కొమార్తెవివాహము జరుగుచుండెను. ఆ సందర్భమున మనరెడ్డిగారు "రెడ్డివిద్యార్థుల విషయమున శ్రద్ధచూపువారులే" రనియు, "వారికి సాయము చేయవలయుననే భావమే యెవరికినిలే" దనియు, "కాని ఇతరత్రా అనవసర వ్యయాలు చేయుటకు మాత్రము ఎవరూ జంక" రని ప్రసంగవశమున పలికిరి. అదివిని రాజులు మున్నగు పెద్దలు "మేము ద్రవ్యము ఇచ్చెదము; కాని దానిని సక్రమముగ వినియోగించు వారెవ్వరు?" అనిరి. వెంటనే రెడ్డిగారు "నేనున్నా" నని ధైర్యముగా బదులుచెప్పిరి.

ఇంకేమి? వెంటనే పింగళి వెంకటరామారెడ్డి దేశముఖు గారు 10000-0-0, వనపర్తి మహారాజు 250000-0-0, గద్వాల మహారాజు 30000-0-0, ఇతరులు మరికొందరు తమ తమ శక్తికొలది చందాలు వాగ్దానము చేసిరి. జాపితా మొత్తము 80000-0-0 అయ్యెను. అందుకు చాలా సంతోషించి మన రెడ్డిగారు వెంటనే వసూళ్ళు ప్రారంభించి హైదరాబాదు నగరమున "రెడ్డిహాస్టలు" అనే పేరితో నొక ప్రచండ రెడ్డిసంస్థను నెలకొలిపిరి. అది నేటికిని మన రెడ్డిగారి పర్యవేక్షణము క్రిందనే చక్కగా నడుచుచున్నది. దినదినాభివృద్ధియు గాంచుచున్నది.

ఈ రెడ్డి హాస్టలు విశ్వరూపము తాల్చునప్పటికి మన వేంకటరామారెడ్డి గారు అమీన్ పదవినుండి సర్కిల్ ఇనస్పెక్టర్, దానినుండి సూపరింటెండెంటు, దానినుండి నగరపు కొత్వాల్ గారి మదదార్ (first assistant) తర్వాత నగరపు కొత్వాలు (Commissioner of City Police)గను అభివృద్ధి బడసిరి. ఈ నగరపు కొత్వాలు పదవి పొందుటలో హైదరాబాదు చరిత్రలో మొదటి హిందువు రెడ్డిగారే. (ముందు సంగతియేమో)

రెడ్డిగారు కొత్వాలుగా నుండిన కాలములో నొకనాడు వీరి తల్లిగారి పుట్టింటి యూరగు (వనపర్తి సంస్థానము నందలి) రాయణిపేట గ్రామవాసి, వృద్ధుడైన యొక కాపు (రెడ్డి) నగరమున కేదోపని మీద వచ్చి రెడ్డిగారు తన గ్రామమున పుట్టి పెరిగినవారు గనుక చూచివత్తమని వీరి యింటికి వెళ్ళిరి ఆ సమయమున రెడ్డిగారు కొందరు నవాబులు, రాజులు, ఉన్నతోద్యోగులు దర్శనము కోరివచ్చియుండ వారితో మాట్లాడుచుండిరి. కాని బైటనుండి చూచువారికి ప్రక్కల నున్న గొప్పవారు కనబడక ఎదుటనున్న రెడ్డిగారొక్కరును మాత్రమే కనబడు చుండిరి. అందుచేత మన వృద్ధకాపురెడ్డిగారొక్కరే ఉన్నారని భావించి "ఏమిరా వేంకటరాముడూ బాగున్నావురా?" అని పలకరించుచు లోపల అడుగుబెట్టెను; కాని ఇంకేమున్నది? లోపల ఎందరో పెద్దలు, వారిమధ్య చుక్కలలో చంద్రునివలె రెడ్డిగారు! వృద్ధునకు వడకు ప్రారంభమైనది. మాట నిలిచిపోయినది. చూపులు చెదరిపోయినవి. అయితే రెడ్డిగారు సంతోషముతో బదులుచెప్పిరి. కుశల ప్రశ్న చేసిరి. ఒకటి రెండు నిమిషములు గడచినను వృద్ధుని భీతి ఇంకను అట్లేయుండుట చూచి "పనియున్నది, లోనికి పోవలయును" అని పెద్ద మనుష్యులను పంపివేసి, చేయిపట్టుకొని వృద్ధుని గృహాంతర్భాగమునకు తోడుకొని వెళ్ళి కులాసాగా మాట్లాడసాగిరి. దానితో వృద్ధుడు కొంతవరకును దేరికొనెను, గాని రెడ్డిగారు తమ ప్రక్క గూర్చుండబెట్టుకొని సరాగములాడుచు భోజనము చేయించునంతవరకును అతడు పూర్తిగా కుదుటబడలేదు. తరువాత రెడ్డిగారు అతని స్థిమితము గాంచి ఆనందించి సత్కరించి పంపివేసినారు.

హైదరాబాదులో కొత్వాలీ పదవీ అన్న అసిధారావ్రత మన్నమాట. ఒక ప్రక్క మహోఘనత వహించిన నిజాము ప్రభువు. ఒక ప్రక్క హిందువులు. మరొక ప్రక్క ముసల్మానులు, వేరొక ప్రక్క నవాబులు, రాజులును, అందరికిని పైని ఇంగ్లీషు ప్రభువులు. ఇందరికి తృప్తి కలిగించవలెనన్న సామాన్యముకాదు, కాని యీయసామాన్యకార్యమును మన రెడ్డిగారు మాత్రము చాల కులాసాగా నెరవేర్చి అందరవలనను మెప్పుబడసిరి.

రెడ్డిగారు కొత్వాలుగానున్న కాలమునందే మన హిందూ దేశమునకు వేల్సు యువరాజుగారు వచ్చిరి. అసహాయవాదులు దేశమందంతటను వారి రాకను నిరాకరించుచుండిరి. హైదరాబాదున నేమి చిక్కులు వచ్చునోయని ప్రభుత్వము

వారు తహతహలాడుచుండిరి. అది చూచి రెడ్డిగారు "ఏమియు భయము వలదు. వారిని ఆహ్వానింపుడు, వారి క్షేమమునకు, వారి సంతృప్తికి నేను పూచీ" అని బాసయిచ్చినారు.

ఆ సమయమున ఏలాటి కల్లోలములును జరుగకుండునట్లు రెడ్డిగారు, కావించిన ఏర్పాటులు, రాత్రింబగళ్ళు వీరుపడిన శ్రమ చాలామందికి తెలియవు, కాని వేల్సుయువరాజా గమనము సక్రమముగను, దేవేంద్ర వైభవముగను జరిగి పోయినది.

ఆ సమయమున రెడ్డిగారి శక్తిసామర్థ్యములను బాగుగా - పూర్తిగా గ్రహించిన వారిలో వేల్సు యువరాజుగారు ప్రముఖులు. వారు నగరమునుండి వెళ్ళునపుడు గొప్ప గొప్ప అధికారుల కందరకును దర్శనమిచ్చి ప్రతివారికి నేదో బహుమానమిచ్చిరి.

ఆ సందర్భమున వంతు ప్రకారము మన రెడ్డిగారికిని దర్శనము దొరకెను. వేల్సు యువరాజుగారు రెడ్డిగారితో చాలసేపు మాట్లాడివారికొక వెండి సిగరెట్ డబ్బీ బహుమానమిచ్చి పంపివేసినారు. (రెడ్డిగారికి సిగరెట్ అభ్యాసము ఏ మాత్రమును ఇప్పటికిని లేదు).

రెడ్డిగారు బయటికివచ్చిన తరువాత ప్రముఖులు చాలమంది వీరికి జరిగిన సత్కారమును వినగోరిరి. "నన్ను తమ ప్రక్కన కూర్చుండబెట్టుకొని వేల్సు యువరాజుగారు "నీవు చేసిన యేర్పాటులన్నియు నాకు మెప్పు కలిగించినవి" అని చెప్పినారు. అని రెడ్డిగారు పలుకగా తక్కిన అధికారులందరును ఆశ్చర్యపడి ఏమీ వారి ప్రక్కన కూర్చుంటివా? మే మందరమును దూరమున నిలిచియే మాట్లాడితిమే? తెలియక నీవు వారి పక్క కూర్చుంటి వేమో?" అని హేళనము చేసిరి. దానికి రెడ్డిగారు "నేనట్లు తెలివి తక్కువ పనిచేసిన నాతల తీయించి యుండరా? వారు స్వయంగా పిలిచి నన్ను కూర్చుండబెట్టుకొనిరి" అని బదులు చెప్పి వారిని నివ్వెరపడునట్లు చేసిరి.

వేల్సుయువరాజుగారు వచ్చునప్పటికి రెడ్డిగారి వయస్సు సుమారు 55 సంవత్సరములు. అప్పటి వరకును వారింగ్లీషు ఒక్క ముక్క అయిన నెరు

గరు. అట్టి రెడ్డిగారు వేల్సుయువరాజుగారు ఒక సంవత్సరములకు హిందూస్థానమునకు వత్తురనగా "వారు హైదరాబాదుకు తప్పక వచ్చెదరు. అప్పుడు నేను వారితో ఇంగ్లీషున మాట్లాడవలెను" అని దీక్ష పట్టిరి. ఉపాధ్యాయుడు వచ్చి, ఏ.బీ,సీ.డీలు ప్రారంభించెను.

అప్పుడు రెడ్డిగారు ప్రయిమరీ విద్యార్థికంటెను ఎక్కువ భయము శ్రద్ధ చూపసాగిరి. దినపాఠము తెల్లవారుజామున వల్లెవేయుట, రాత్రి పడుకొనబోవుటకు ముందు పాఠము గట్టిచేసుకొనుట, పాఠము నేర్చుకొనుటలో బిగ్గరగా చదువుట, ఇది నిత్యకృత్యము. రెడ్డిగారి గదిముందే జవానులు పహరా యిచ్చుచుండిరి. "ఎన్నడును లేనిది యీ మధ్య నేమోమో యెవ్వరికిన దెలియని మాటలతో తమకు తామే ప్రతి రాత్రియు గొణుకు కొనుచున్నారు వీరు. ఏదో దయ్యమో భూతమో ఆవేశించినట్లున్నది. ఇంకెట్లు?" అని జవాను లొక నాడు కూడ బలుకుకొని వేగముగ పోయి యొక పోలీసు అధికారితో చెప్పివేసిరి. అంతట ఆ యధికారివచ్చి రెడ్డిగారితో మాట్లాడి యథార్థము నెరిగి జవానుల భీతిని రెడ్డిగారి కెరింగించెను. దానిమీద ఇద్దరును చాలసేపు నవ్వుకొని జవానుల భీతి తొలగించిరి.

వేల్సుయువరాజుగారు రెడ్డిగారి వచ్చీరాని ఇంగ్లీషు విని ముసిముసినవ్వులు నవ్విరట.

రెడ్డిగారికి బీదలనిన చాల ప్రీతి. సాధారణముగా పోలీసులు కఠినులనియు, భయంకరులనియు జనుల అభిప్రాయము; కాని రెడ్డిగారు 40 ఏండ్లకుపైగా పోలీసు ఉన్నతోద్యోగము నిర్వహించినను మార్దవము, క్షమ, దయ, కరుణ తప్ప కాఠిన్యము, ఆగ్రహము, క్రోధము, ద్వేషము ఎంతమాత్రమును దగ్గరకు రానిచ్చి యెరుగరు. గొంగటివారిని (పేద రైతులను) జూచిన రెడ్డిగారికి ఎంతో ఆనందము. ఆదరమున్ను. బీదవిద్యార్థులకు సాయము చేయుటయన్న వీరికి పండుగ. సంఘ సంస్కారమన్న వీరికి చాల యిష్టము, ముందడుగున్నూ, పూర్వకాలపు మొగలాయి మనిషివలే కనబడుదురు. కాని నేటి సంస్కారి ప్రముఖులకంటె నెక్కువ సంస్కారులు.

రెడ్డిగారికి మహాఘనత వహించిన శ్రీనిజాము ప్రభువువారు శ్రీరాజా బిరుదమును, బ్రిటిషు ప్రభుత్వమువారు ఓ.బి.ఇ. బిరుదమును ప్రసాదించి గౌరవించిరి.

రెడ్డిగారు కొత్వాలీ ఉద్యోగమునుండి గత సంవత్సము నందే విరమించుకొనిరి. పెన్షను సగము జీతము-అనగా 750-0-0 మాత్రమే ఏర్పడ వలసియుండ శ్రీనిజాము ప్రభువువారు సమర్థమైన వీరి సేవను గుర్తించి 1000-0-0 ఇచ్చునట్లు ఫర్మానురూపముగా అనుజ్ఞయిచ్చిరి. ఇంతేగాక ఒక ప్రక్క కొత్వాలీ ఉద్యోగము నుండి సెలవు పొందుచుండ శ్రీనిజాము ప్రభువు వారు తమ సొంత జిల్లాయగు అత్రాపు బల్దాజిల్లాలో రెడ్డిగారికి ఒక ప్రత్యేక పదవిని కల్పించి ''స్పెషల్ ఆఫీసరుగా 500-0-0 వేతనముమీద (పెన్సను 1000-0-0లును గాక) నియమించినారు.

ఇప్పటికి రెడ్డిగారి వయసు సుమారు 62 సంవత్సరములు. ఇంకా వ్రాయ వలసిన వీరి చారిత్రక విషయాలు ఎన్నో యున్నవి. ఇప్పటికి సెలవు.

# కొండా వెంకట రంగారెడ్డి గారు

ఆ కొండకు ఈ కొండకు ఏమైనా సంబంధం ఉందా అని అన్నాడు ఒకాయన. కొండా వేంకటప్పయ్యగారు బ్రాహ్మణులు. కొండా వెంకటరంగారెడ్డి గారు బ్రాహ్మణేతరులు. ఇంటిపేరు కుదిరింది. అసలు పేరులో ముప్పాతిక కుదిరింది. నాయకత్వములోను సాటి పాటికి వచ్చింది. గుణములోను తూకము సరాసరిగా ఉంది. వయస్సులోనే కాస్త తేడా. మరి వారుండేది బ్రిటిషాంధ్రము వీరిది నిజామాంధ్రము.

హైకోర్టు వకీలటగా! కాదయ్యా అడ్వకేటు!! ఆం.ఎల్.ఎల్.బీయా? కాదు. బి.యల్లా? కాదు. మరేమి? వారు ఇంగ్లీషును సాధించే దానికి మెక్మిలన్ రీడరును నాలుగు మార్లు చేపట్టి గురు శుశ్రూష కూడా సాగించినారు. కాని కార్య బాహుళ్యము చేత 'పీ యూ టీ, పుట్' అని ఉచ్చరించి చాలించుకొన్నారు. ఇంగ్లీషు రానిది వకీలెట్లయ్యి రందురా? ఉర్దూలో ఖానూన్ పరీక్ష యిస్తే హైద్రాబాదులో వకీళౌతారు లెండి. అట్లయితే వారికి అరబ్బీ బాగా వచ్చునన్నమాట. లేదు. వారికి అరబ్బీ, ఫార్సీరాదు. ఉర్దూ మాత్రమే వచ్చు. బ్రిటిషిలాకా వారికి యిక్కడి పరిస్థితులు తెలియనందున ఇన్ని ప్రశ్నలు వేసి అవస్థ పెట్టుతారు. అయితే యీ "నైజాం"లో అంతా ఉల్టాగా ఉండే వ్యవహారం. అబ్బే! అంత భయంకరంగా లేదులేండి.

కొండా వెంకట రంగారెడ్డిగారు తెనుగులో ఏమైనా గ్రంథాలు వ్రాసినారా? లేదు. కాని వారు ఉర్దూలో ఫౌజ్దారీ సంబంధంలో గ్రంథాలు వ్రాసినారు. వారు తౌరక్యాంధ్రమం మాట్లాడుతారు. బ్రిటిషాంధ్రులు హూణ్యాంధ్రము మాట్లాడితే మేము తౌరక్యాంధ్రము మాట్లాడుతాము వారిది ఇంగ్లీషు దడదడా, మాది ఉర్దూ గడబిడ.

బ్రిటిషాంధ్ర నాయకులు ఉపన్యాసాలిచ్చే దానిలో దక్షులు. తెనుగులోనైతే జీ. ఐ. పి. వేగంతో ఝూడించుతారు. "నిజాం"లో అట్టి ఘనులు లేరు. ఆ పొట్టి బూర్గులవారు మంచివక్త అని అంటే దోషం లేదు. మాడపాటివారు ముద్దు ముద్దుగా

మాట్లాడుతారు. ప్రతాపరెడ్డిగారు మీసికే ఊరికి వస్తారు రావి మిత్రము ఒకటి తలచి ఒకటి అంటాడు. మందుమూల సోదరులు మూల్గుతారు. వారికి ఎడమ చేయిగా కొండావారు ఉంటారు.

ఇంతవరకు మదింపు చేస్తేఏమి తేలినట్లు? కొండకు ఇంగ్లీషు రాదు. తెనుగు బాగారాదు. గొప్పవక్త కాడు. అట్లయితే ఇంకెందున్నది ఆయన గొప్పతనం. ఈ కాలంలో రంగం యెక్కి ఏకధాటిగా జడివానవలె ఉపన్యాసం విసరేవారే గొప్ప వారు. ఏదో ఒకరాగం అలవాటు చేసుకొని గొంతెత్తి పాడేవారే కవిత్వ కోకిలలు. చతురాంగ్లాక్షరాతీత బిరుదలాంగూల విభ్రాజమానులే పండితమానులు. నేను సర్వ జ్ఞున్ని అనే వాలకంతో నోరెత్తితినా జాగ్రత్త అనే బెదరింపుతో మాననష్టం దావాకు భయపడకుండా వాదాన్ని వదలి ప్రతిపక్షులను సంస్కృత వ్యంగ్యధ్వ నులతో సత్కరించేవారే విమర్శ కాగ్రేసర చక్రవర్తులు. మరి వేంకటరంగారెడ్డి గారు ధ్వన్యాలోకం చదువుకొన్నారా ? అదికూడా లేదా. శాంతం పాపం. వారికి "వక్రోక్తి జీవితము" సరిపడనే సరిపడదు.

మరెందున్నదండి వారి గొప్పతనం. ఏదోవిసిగించకుండా రెండు ముక్క లతో చెప్పివేయండి అని అంటారా వినండి.

మా కొండా వేంకటరంగారెడ్డిగారి వంటి వకీళ్ళు మొత్తం హైద్రాబాదు రాజ్యంలో యిద్దరో ముగ్గురో అంతే ! వారి కాదాయం నెలకు 1000 రూపాయిలే. సర్ సప్రూకు నెలకు 20 వేలట. మోతీలాల్ నెహ్రూకు నెలకు 50 వేలు వచ్చే దట. 1000 రూ॥ వకీలు గొప్పవకీలెట్లామరి. హైద్రాబాదులో నెల 10 వేలు సంపాదించే వకీళ్లు కొందరున్నారు. కొందరు కక్షిదారులు న్యాయాధిపతిగారి అల్లుడు, చుట్టము, మిత్రుడు యెవరయ్యా అని విచారించుకొని అతనికి కోరిన 'ఫీసు'ను ఇచ్చి కోర్టులో దిష్టిబొమ్మవలె నిలబెట్టుతారని వింటూ ఉంటాము చాలా కాలో కొత్త మున్సిఫులను బండెడు పుస్తకాలతో, మేకచెప్పుల మెడ పట్టీలతో, 'అంధ్రం వాసుబద్ధం వాకుంతీ పుత్రో వినాయకః' అను దబాయింపు వైతండిక వాదముతో కేసులో గెలుపును పొందే వకీళ్ళు కొందరు, చీమతలంత అనుకూల్యము లేకున్నను ఫీసు నష్టం కాకుండా నీ కేసును గెలిపిస్తాను చూడు అని చిటకెలు వేసేవారు కొందరు. పండుగ దినాలలో ఈదెముబారక్ అని ఇగిలించుతూ అధికారుల యిండ్ల కెళ్ళి జీహుజూర్ సలాములు వంగి వంగి బజాయించే వారు కొందరు. ఏజంట్లను పెట్టి కేసులు సంపాదించే వారు కొందు. ఈ విధంగా ఎందరో

వకీళ్ళు కలరు. కొండా వారు సెలవులువస్తే చక్కగా మంగళారం లేకుంటే ధర్మసాగరం లేకపోతే షారాజూ పేటకు వెంచేస్తారు. బలహీనమైన కేసు వస్తే ఇందు నీకు బలం లేదు. అని పుడక విరిచి కక్షిదారుని మొకం మీదనే అని వేస్తారు. ఏదైనా చిక్కు చీకువస్తే నాకు బాగా బోధ కాలేదు, నా మిత్రులతో ఆలోచించు తానులే అని రహస్యం దాచుకోకుండా అంటారు. చాలా వేధించే కక్షిదారు దొరికితే నీకు తెలియదయ్యా నేను చెప్పినట్లు వింటావా లేదా అని గట్టిగా అంటారు. ఫీసు విషయములో ఇంత ఇస్తేనే కాని వల్లకాదు అని యెన్నడున్నూ సాధించిన వారు కారు తెలిసినవారు వెంటవెళ్ళితే వారెంత చెప్పితే అంతే అని తృప్తిపడుతారు. కొందరు వకీళ్ళు ఫీసు తక్కువ యిచ్చే కక్షిదారులను కూడ పోనీయరు. ఆ వారసు వేరే రూపంగా ఖర్చుల పేరుతో తీర్చుకుంటారు. కొండా వారు కేసు పట్టిన తర్వాత ఖర్చులు లెక్క ప్రకారం తీసుకుంటారు. కక్షిదారుకు ఏ విచారం కలుగకుండా చాలా శ్రద్ధ తీసుకొంటారు. అన్యాయముగా ఒక పైసా కూడా లాగే ఆలోచన చేయరు. అందుచేతనే వారు తమ వృత్తిలో విద్యలో గట్టి వారైన వారికి ఆదాయం మాత్రము తక్కువ. వారికి బంధువులైన అధికారులు లేరు. అధికారుల స్నేహానికి ప్రయత్నమే చేయరు.

రెడ్డి గారిది అత్రాపుబల్దా జిల్లాలోని మంగళారం అనే గ్రామం. వకీలు వృత్తి ప్రారంభించిన నాడు ఆ గ్రామం పటేలుగిరి, ఆ గ్రామంలో తగుపాటి సేద్యం ఉండింది. వీరితో దానికి అయిదుగురు భాగస్తులు. వీరు వకీలు వృత్తి ప్రారంభించిన తర్వాత వీరే నాలుగు గ్రామాలలో పటేలుగిరీని, భూములను సంపాదించిరి. కాని 'అవన్నీ నావే' అన్నవారు కారు. మూడేండ్ల క్రిందట సమిష్టి కుటుంబ విభజన జరిగెను. మీరందరు మీ యిష్టం వచ్చిన భాగాలు తీసుకొనండి. అందరున్నూ పసందు చేసుకొని తీసుకొన్న తర్వాత 'మిగిలినదే నా భాగం' అని అన్నారు. అట్లే తీసుకొన్నారు. అట్లు జరిగినను, ఒక భాగస్తుడు నాకు భాగం న్యాయంగా రాలేదు అని వీరివద్దనే పేచీ పెట్టుకొని తుదకు రెడ్డిగారికి వచ్చిన భాగం నుండియే మరికొంత లాగుకొనెను.

వీరు వకాలతును 30 ఏండ్లనుండి చేస్తున్నారు. అందరునూ కలసియుండిన కాలములో వీరి కుటుంబములో 22 వివాహాలైనవి. ప్రతి వివాహానికి అయిన వెండి, బంగారు, వస్త్రములకు వ్యయమును పూర్తిగా శ్రీ కొండా వేంకటరంగారెడ్డి గారే భరించిరి. అందులో వారి సొంత సంతానములో ఒక్కరికైనా వివాహం కాలేదు. విభాగమైన తర్వాతనే అయ్యెను.

హైదరాబాదు నగరములోని ప్రతి ప్రజాహిత సంస్థ కూడా కొండ వారి నుండి విరాళాలు, నెల చందాలు, పొందుచూ వచ్చినవి. వేమన గ్రంథాలయానికి వారు ముఖ్యాధార భూతులు.



హైదరాబాదు నగరంలో రెడ్డి హాస్టల్ ఒకటి కలదు. వీరి ఇల్లు రెండవ రెడ్డి హాస్టలు. వీరి బంధువుల పిల్లలు 20 మందికి పైగా ఎల్లప్పటికిని, వీరి ఇంటిలో భోజన, వస్త్ర, గ్రంథాలను పొందుచూ వచ్చినారు. అంతేకాదు, "వారికి ముక్కు నొచ్చిన వైద్యుని పిలిపించి చికిత్స చేయించుతారు. చదువు వారికి బాగా వంట బట్టవలెనని ఇంగ్లీషు, తెనుగు, ఉర్దూ భాషలను బోధించే పంతుళ్ళను నియమించి, చదువు చెప్పింతురు. అట్టి పిల్లలకు, తన పిల్లలకు తుదకు తనకు ఏమిన్నీ భేదము లేదు. అందరికినీ ఒకే విధమగు భోజన భాజనాదులు, అల్పబుద్ధి, కుటిలత, కల వారిని పరిహరింతురు. అభిప్రాయ భేదాన్ని దాచుకొనరు మొగమాట మెరుగరు. వారి యౌదార్యాన్ని, సాధుత్వాన్ని పురస్కరించుకొని వేధించు వారికి ఏమిన్నీ యెప్పుడున్నూ కొదువ యుండదు. కాని వారిలో ఓపిక అనుపమానముగా ఉండుటయే చాలా విచిత్రమగు విషయము.

అయితే వారు జెయిలుకు వెళ్ళ లేదేమి ? జెయిలుకు వెళ్ళితే నాయకుడు, ఒక నెలపాటు జెయిలుకు వెళ్ళేవారు సాధారణముగా తాము మహా నాయకులమని అనుకొని పోనివారు నోరెత్తితే - 'మూలన గూర్చున్న వారికి దేశ పరిస్థితు లేమి తెలుస్తవి' అని యెద విరుచుకొని మాట్లాడే ధోరణి "నిజాం"లోకూడా మొదలైంది కదా ! మరి యీ రెడ్డిగారు జైలుకెందుకు వెళ్ళక పోయిరి. జెయిలుకు పోవలసిన స్థితి వచ్చినదనియు అది నా ఆజ్ఞ అనియు చెప్పగలిగిన మహా నాయకుడు కానరా లేదని రెడ్డిగారనుకున్నట్లున్నది. జెయిలు అంటే 'ఓ యబ్బా'యని దద్దరిల్లి బొబ్బ రించేవారు కారులెండి. నిజమైన అవసరం వచ్చిన నాడు వారు వెళ్ళక మానరు. వారి వెంట వేలకొలది అనుసరించక మానరు. వారిలో అంతటి విశ్వాసం జనులకు కలదు.

ఎద్దుంచ పోయంగ ఏరులై పారంగ
ఉంకించి ఉంకించి దుంకినాడు.

అన్న విధంగా 'చూడు నా దెబ్బ' అని మీసం పురిపెట్టి, భుజమెప్పళించి రంకె వేసి సవాల్ వేసేవారు కారు శ్రీ రెడ్డిగారు.

స్వయంకృషి వల్ల వృద్ధికి వచ్చినారు. ఒకరికి అపకారము చేసి ఎరుగరు. వివాదాలకు దిగరు. ఎంత అంటారో అంత చేస్తారు.

